# మండోదరి ముచ్చట్లు

## రచన శ్రీ దత్త




ఫ్లాట్ నెంబర్ 403,ఫ్లాట్ నెంబర్ 147,

సిద్ధార్థ నగర్ కాలోని,యూసుఫ్ గూడా ,

హైదరాబాద్ 500038

# గురువు గారి మాట

స్త్రీ ఆలోచనా తీరు ఏ విధంగా ఉండాలో వివరిస్తూ స్త్రీ పురుష మానసిక భావనలు, భార్య భర్తల మధ్య సంబంధాలు, సమిష్టి సంతోషం , ధృడపరచే అనుబంధాలు , స్త్రీ ఆత్మ విశ్వాసం ఏ మేరకు ఏ అంశాల్లో ఉండాలో వ్యక్త పరచిన తీరు అభినందనీయం.

"రచన" ఇన్ని పుస్తకాలు ఎప్పుడు చదివిందా? అనిపిస్తుంది. చలం –"ఆర్గ్యు మెంటు " కథను విశ్లేషిస్తూ స్త్రీలో కలిగే భావ సంఘర్షణను వివరిస్తూ స్త్రీని శరీరంగా కాక ఓ ఆలోచనల వ్యక్త స్వరూపంగా చూడగలిగే మానసిక ప్రవృత్తి అందరికీ అలవడాలని మంచి మనస్సుతో కోరుతున్న 'రచన' ఉన్నతమైన భావనను అభినందించి తీరవలసిందే అనిపిస్తుంది.

స్త్రీ కి అవగాహన కలిగించే ఎన్నో విషయాలు ఈ పుస్తకంలో చర్చించడం ముదావహం. చాలా మంది స్త్రీలకు తమను కాపాడటానికి ఎన్ని చట్టాలు ఉన్నాయో ,వాటి ద్వారా తమను ఎలా రక్షించుకోవచ్చో తెలియదు. అటువంటి వారికి చట్టాల గూర్చి అవగాహన కలిగించే అంశాలు ఈ పుస్తకంలో చాలా ఉన్నాయి. అదే విధంగా చట్టాలు ఎన్ని ఉన్నా వాటి అమలు తీరు సరిగా లేనప్పుడు వాటి ఉపయోగం ఏమి ఉండదు అంటూ తలాక్ సమస్యను గూర్చి అవగాహన కలిగిస్తూ ఆలోచింపజేసే వ్యాసం 'చట్టం కన్నా కట్టు దిట్టమైన అమలు ముఖ్యం.

సమాజాన్ని గూర్చి ఎంతో అవగాహన ,ఆలోచన ఉంటే తప్ప ఇలాంటి అంశాల గూర్చి రాయడం కష్టం. మనకు ఈ పుస్తకంలోని అంశాలను పరిశీలిస్తుంటే సంస్కృతి పరిరక్షణ పట్ల ఎంతో తపన కనిపిస్తూ ఉంటుంది. ఇంత చిన్న వయసులో సమాజం పట్ల అవగాహన , సమాజాన్ని పరిశీలించిన తీరు అద్భుతంగా అనిపిస్తుంది.

విద్య యొక్క ఆవశ్యకతను చెప్తునే ఎలాంటి విద్యా ఇప్పటి విద్యార్థులకు కావాలో అందులో ఉపాధ్యాయుల పాత్ర ఎంతటి ప్రాముఖ్యత కలిగిందో వివరించడం బాగుంది.

'అ' సినిమా విశ్లేషణ చదువుతుంటే మంచి విమర్శకురాలు కనిపిస్తుంది. బహుశా స్త్రీ లందరికి వారిలో ఉండే భావోద్వేగాలను ప్రదర్శించడమే కానీ వాటి గూర్చిన విశ్లేషణ తెలియనివారందరికి ఈ వ్యాసం చదువుతుంటే తమ గూర్చి తాము ఆలోచించే సామర్ధ్యం కలుగుతుంది అనిపిస్తుంది.

అలాగే ఈ తరంను పీడిస్తున్న ఇంకో సమస్య ప్రేమ. ఆకర్షణే ప్రేమగా భావించే ఇప్పటి తరం అంతా చదివి తీరవలసిన వ్యాసం "వాలంటైన్స్ డే వరమా ? శాపమా? " నిజమైన ప్రేమ గూర్చి అవగాహన కలిగించే మంచి వ్యాసం.

నిజమైన స్త్రీ శక్తి అంటే ఏమిటో వివరిస్తూ కొంతమంది స్త్రీలు చేసే పోరాటాలు ఏమాశించి చేస్తున్నారో వారికే అర్ధం కాని పరిస్థితిని చక్కగా విశ్లేషించగలిగింది.

అందంగా ఉండడం కన్నా అందంగా కనిపించడమే ముఖ్యం అనుకొని ఎంతో ధనాన్ని , సమయాన్ని వెచ్చిస్తూ తమ అమూల్యమైన సమయాన్ని వృధా చేసుకుంటున్న వారిని ఆలోచింపచేసే వ్యాసాలు ఉన్నాయి. అందంగా ఉండడం కన్నా ఆరోగ్యంగా ఉండడమే మేలు అంటూ ,అలాగే స్త్రీకి నిజమైన ఆభరణం మానసిక సౌందర్యమే అని చెప్పడం "ఆమె" ఆలోచనా తీరుకు అద్దం పడుతుంది.

ఎటువంటి సమస్యనైనా అది శారీరకం కావచ్చు. మానసికం కావచ్చు. దాన్ని సమర్ధవంతంగా ఎదుర్కోగలగడమే నిజమైన స్త్రీ సాధికారత అని విపులంగా వివరించి అవగాహన కలిగించే వ్యాస సంపుటి రాసిన 'రచన' కు శుభాభినందనలు.

ఈ పుస్తకం స్త్రీలు ,యువత ,అందరూ చదివి తీరాల్సిన పుస్తకం. సమాజం పట్ల బాధ్యత ఉన్న ప్రతి ఒక్కరూ చదివి ఆలోచించాల్సిన ఎన్నో అంశాలు మనకు ఇందులో కనిపిస్తాయి.

చాలా మంది రచయితలు సమస్య మాత్రమే వివరిస్తూ విశ్లేషిస్తూ ఉంటారు. నాకు ఈ పుస్తకంలో నచ్చిన విషయం ఏమిటంటే సమస్యను సమూలంగా విశ్లేషించడమే కాక ప్రతి సమస్యకు పరిష్కారాలను ఎవరికి వారే వారి ఆలోచన విధంలో ఏ విధంగా కనుగొనవచ్చో , వాటిని ఎలా సాధించవచ్చో తెలిపే పుస్తకం.

ఈ సృష్టిలో ప్రతి ప్రాణికి ప్రాకృతిక ధర్మమైన సహజ స్వభావం ఉంటుంది. ఈ ఆధునిక యుగంలో, యాంత్రిక కాలంలో స్త్రీ , పురుషుడితో సమానంగా ఎదుగుతూ అన్ని రంగాలలో అభివృద్ధిని సాదిస్తూ ముందుకు వెళ్తుండటం ఎంతో అభినందనీయం. ఈ ఎదుగుదలలో చాలా మంది స్త్రీలు సమానత్వం యొక్క అర్ధం తెలియని అయోమయంలో తమ సహజ కోమలత్వాన్ని ,మన భారతీయ సంస్కృతి, సాంప్రదాయాలను మరచి ఎటు వెళ్తున్నారో తెలియని స్థితిలో ఉన్న చాలా మంది స్త్రీలకు ఈ పుస్తకం ఒక మార్గ నిర్దేశం అవుతుందని నిశ్చయంగా చెప్పగలను.

గొల్లపూడి రవి బాబు

# ఈ మగువ మాట

ప్రపంచాన్ని జయించాలనే కోరికతో ఎన్నో ఆశలతో జూలై,2016 న హైదరాబాద్ లో ఒంటరిగా అడుగు పెట్టాను. లోకం పోకడలు తెలియవు. అప్పటి దాకా ఇల్లు దాటింది లేదు. అమ్మా నాన్న లకు ఒక్కదాన్నే. నాకు తెలుసు వారికి ఎంత మనసు కష్టంగా ఉంటుందో అని. కానీ అమ్మమ్మ [కొండసాని రంగమ్మ ] ఇచ్చిన ధైర్యాన్ని నేను ఎప్పటికీ మరువలేను. అలాగే ఈ నిర్ణయం సరైన దేనా అని అడిగినప్పుడు ధైర్యం తో అడుగు ముందుకెయ్యి అని ప్రోత్సహించిన మా రవి గారిని ఎన్నటికీ మరువలేను .ఎంతో బెంగగా ఉన్న గుండె అంతా పాషాణం చేసుకుని ,భవిష్యత్తు లో కచ్చితంగా నా కలలు సాధించాకే మళ్ళీ తిరిగి వస్తాను అని అనుకుని మహా పట్టణమైన భాగ్య నగరంలో అడుగు పెట్టాను.

కానీ అక్కడ మనుషులు లేరని కనుక్కున్నాను. కానీ అప్పుడప్పుడు మాత్రం మానవత్వ స్పర్శ నాకు దైవ బలం లో ఎప్పటికప్పుడు అందుతూనే ఉండేది. కానీ రచయితలది ఓ వింత ప్రపంచం అని ,వారు ఊహల్లో బ్రతుకుతారని అంతే తప్ప నిజంగా చెప్పాలంటే రచన మా ఆశయం అని గట్టిగా చెప్పగలిగే రచయితలు నాకు ఎవరు కనిపించలేదు. అడుగడుగునా అవమానాలు ,అవహేళనలు తప్ప సరస్వతి కి కనీస ఆదరణ పక్కన పెడితే మనిషిగా చూసే సంస్కృతి లేదని నాకు అర్థం అయ్యింది. ఓ మహానుభావుడి వల్ల 'IAS ' ఆశయంతో అడుగు పెట్టిన మాటకు నిలబడక ,అంతే కాక సృజనాత్మక దోపిడికి గురయ్యాక ఇక నాకు రచన తప్ప వేరే ఆశయం లేదనే ధృడ నిశ్చయానికి వచ్చాను. ఎంతో మంది రచయితలను కలిశాను ,కానీ అందరిలో ఒకటే ప్రవృత్తి తాను మాత్రమే గొప్ప రచయిత అని. కానీ నేను ఆరాధించే సరస్వతికే అంత మిడిసిపాటు లేదు. మరి వీరంతా తాము మాత్రమే గొప్పవాళ్లం అనే అబద్ధంలో ఎంత అందంగా జీవిస్తున్నారు అని అనిపించింది. నవ్య ,స్వాతి ,ఫన్ డే,ఆంధ్రజ్యోతి లాంటి పత్రికల్లో[ దాదాపు అని పెద్ద పత్రికల్లో ] ఆస్థాన రచయితలు తప్ప ప్రతిభ కు పట్టం కట్టే ఉద్దేశం లేదని అర్థం అయ్యింది. అంతే కాదు సుమారు 250 రచనలు చేసిన తరువాత కూడా నేను 'REJECT' అవ్వడం నాకు బాధగా అనిపించింది. ఇక నిర్ణయించుకున్నాను , సరస్వతిని గౌరవించని వారిని నెత్తిన పెట్టుకొనవసరం లేదని , నా లోని సరస్వతికి గౌరవం దక్కే చోటే ఉండాలని.

ఈ క్రమంలో JOURNALIST[Vaaradhi Media House-Special Correspondent],Executive Editor [Sriven Times Magazine],English Trainer & Personality Development

Trainer,National Book Trust Accredited Translator[దీనికి ప్రోత్సహించిన Dr.Mohan Pathipaka గారికి ఎప్పటికీ ఋణపడి ఉంటాను,Guest Faculty-Sakshi Journalism School,All India Radio Programmes,Talk Shows with local channels ,Event Manager, Anchor & Content Writer @ Ekalavya Foundation,Edit Page Writer @ Gooogle news, Free lance writress for news websites... ఇలా ఎన్నో అవతారాలు ఎత్తవలసి వచ్చింది. వీటన్నింట్లో నేను తల దూర్చడానికి నాకున్న కారణం ఒకటే అది నాలోని రచయితకు వీటన్నింటిని మాధ్యమాలు చేసుకుందామని. కానీ అవన్నీ వృధా అని నాకు అర్ధం అయ్యింది. డబ్బు ,డబ్బు ,డబ్బు ...అంతే ,అంతకు మించి ఏమి లేదు అని అర్ధం అయ్యింది .

నా లోకానికి ఈ డబ్బు లోకానికి సంబంధం లేదని అర్ధం అయ్యింది. అందుకే దాని గురించి ఏ నాడు పట్టించుకోలేదు . అందుకే చేతకాని దానిని అని అనిపించుకున్న నా ఆశయం తప్ప నాకు ఏమి కనిపించలేదు.

ఈ ప్రయాణంలో నాకు వార్తా -శ్యామల గారు అందించిన ప్రోత్సాహం ఎన్నటికీ మరువలేను. నా వ్యక్తిత్వ వికాస కధనాలు ఆవిడ సహకారంతోనే వచ్చాయి. తరువాత 'మగువ మనసు'[ అదే 'మండోదరి ముచ్చట్లు'] లాంటి గొప్ప రచన చేసే అవకాశం కల్పించిన వార్తా యాజమాన్యానికి , అలాగే చెలి పేజ్ నిర్వహిస్తున్న వాణి పుష్ప గారికి నా ప్రత్యేక ధన్యవాధాలు. తరువాత నవ్య ,ఫన్ డే లాంటి వాటిల్లో ఎంతో ప్రయత్నిస్తే ఒక్కసారే కనిపించాయి. కనీసం పంపిన రచనలు చూసే అలవాటు [కొత్త రచయతలవి ] లేని పత్రికలు ఆంధ్ర జ్యోతి ,స్వాతి. [నిర్మొహమాటం గా స్టార్ రచయితలకే చోటు అని చెప్పేస్తారు]. ఇంతే కాదు ఎన్నో యూట్యూబ్ వీడియోలు చేశాను ,వాళ్ళు వాటి మీద సంపాదించుకున్న దానిలో ఎప్పుడు రూపాయి అడగలేదు ,కానీ నేను అందంగా లేను అనే న్యూనత తో ఆడుకుని నన్ను ఇంకా బలహీనురాలిని చేసిన వారిని నేను వారు సరస్వతికి చేసిన అవమానంగా భావిస్తాను. ఎన్నో అవమానాలు ,ఎన్నో గరాళాలు సేవించక ఇక ఓడిపోయాను అనుకున్న క్షణం లో శ్రీ నా జీవితంలో నేను నమ్ముకున్న 'సరస్వతి ,కల్కి' రూపంగా ప్రవేశించాడు.

పది మంది చెడ్డ వాళ్ళను చూసిన తరువాత పదకొండో వాడు కూడా అలానే కనిపిస్తాడు. నిన్ను నిలబెడతాను అని తను అన్నప్పుడు నేను నమ్మలేదు, కానీ పది రోజుల్లో పెళ్లి చేసుకుని ,రెండో నెల వచ్చేసరికి 'మండోదరి ముచ్చట్లు ' ని 'Best Seller 'గా చేసి, అంతటితో ఆగక 'సీతాస్ అసుర ', ' కామ తీర్ధం ',

'జటాధార ' వంటి రచనలు నా చేత చేయిస్తూ, నా పుట్టింటి వారి చేత 'నీ కన్నా ఉత్తముడు మా బిడ్డకు దొరకడు' అని అనిపించుకున్న తన గురించి ఎంత చెప్పిన తక్కువే . ధైర్యం గా Facebook లో అందరి సాక్షిగా పెళ్లి చేసుకున్న శ్రీ ధైర్యం నాకు నచ్చింది . అంతటితో ఆగక 'Aavirbhava Publishing House' ని స్థాపించి పేద రచయితలు రచనలు ప్రచురిస్తూ ,అలాగే ఎందరో రచయితల రచనలకు మధ్యంగా దానిని నిలబెట్టిన తన లాంటి పతి దొరికిన పత్ని గురించి ఇంకా నేను ఎక్కువ చెప్పనవసరం లేదేమో. కానీ ఒక్క మాట ఈ 'మండోదరి ముచ్చట్లు ' ఓ పుస్తకం కాదు. నన్ను అవహేళన చేసిన గొప్ప రచయితలు ,గొప్ప వాళ్ళకు ,సరస్వతిని అవమానించే వారికి నా తరపున సమాధానం. హోదాలతో గౌరవాలు కొనుక్కోవచ్చు కానీ మనుషులని కాదు. అది మానవ స్పర్శ తోనే సాధ్యం.



# సమానత్వం అంటే బాహ్యాలంకారాలా!

ఇష్టం వచ్చినట్లు జీవించే హక్కు మీకే ఉందా? మాకు లేదా? మీరే తాగొచ్చా? మేం తాగకూడదా? మాకు ఇష్టం వచ్చిన బట్టలను మేం వేసుకోకూడదా? మేమెందుకు మీ అంత స్వేచ్ఛగా ఉండకూడదు?' అని ప్రశ్నిస్తూ ఓ వాదానికి, సమానత్వానికి మధ్య ఉండే సంకుచిత భావజాలాన్ని సమానత్వంగా చిత్రీకరించి, సహజత్వాన్ని చంపేసి కృత్రిమ ఊపిరితో కొనసాగుతున్న స్త్రీవాదం మనకు తారసపడుతుంది నేటి పరిస్థితుల్లో. అనుకరణకి, సమానత్వానికి మధ్య చావుకి, బతుక్కి మధ్య ఉన్నంత తేడా ఉంది. ఇక్కడ లింగవివక్ష ఉన్న మాట నిజమే కానీ దానికి వ్యతిరేకంగా పోరాటాలు అంటూ ముందడుగు వేసి పురుషుడిలా అన్ని కోణాల్లో మారి పోవడమే స్త్రీ సాధికారత, సమానత్వం, స్వేచ్ఛ అనుకుని త్రిశంకుభావజాలంతో ప్లాస్టిక్ పువ్వుల బతుకు సందడిలో సాగుతున్న నేటి స్త్రీవాద దృక్కోణం ఈ కింద ప్రశ్నల పట్ల వాస్తవిక స్పష్టత కలిగి ఉంటే మంచిదేమో!

★ సమానత్వం అంటే ఏమిటి?

★ స్త్రీలకు ఏ విషయంలో సమానత్వం లేదు?

★ సమానత్వం లేదా స్వేచ్ఛ లేకపోవడం అనేది భవిష్య పరిణామాలను దృష్టిలో ఉంచుకొని సహేతుకమైన కారణాల వల్ల ఉద్భవించిందా? లేకుంటే కేవలం ఆధిక్యధోరణి ప్రదర్శించడానికే ఉద్భవించిందా? లేక మిశ్రమ ధోరణితో పుట్టిందా?

★ ఎటువంటి పరిస్థితుల్లో స్త్రీలకు సమానత్వం అవసరం?

★ ప్రకృతిరీత్యా స్త్రీ, పురుష శరీరధర్మాల్లో తేడాలున్నప్పుడు ఆ ప్రకృతికి దూరంగా జరిగి మూర్తిమత్వాన్ని ఇంకొకరిలా మార్చుకుంటే సమాజంలో ఉన్న వివక్ష భావజాలాలు తొలగిపోతాయా?

★ పురుషుడు చేసే ప్రతి పని స్త్రీ చేయడమే సమానత్వమా? అలా అయితే స్త్రీ చేసే ప్రతి పని పురుషుడు చేయలేడే! అంటే కొన్ని పనులను ప్రామాణికంగా పెట్టుకుని అవి కృత్రిమంగానైనా చేయడానికి ప్రయత్నించడమేనా సమానత్వమంటే? ఈ ప్రశ్నలకు సమాధానం ఎవరి భావజాలానికి తగ్గట్టు వారు చెప్పవచ్చు. కానీ వ్యక్తిగత ఆనందం, సమిష్టి సంతోషం, ముందు తరం వారికి ఆదర్శంగా నిలబడగలగడం వంటి సూచికలు స్త్రీ సమానత్వ వాదాన్ని నడిపిస్తే అప్పుడు అది అందరికి ఆమోదదాయకం అవుతుందేమో కదా? ప్రతి మనిషికి కావాల్సిన కనీస అవసరాలు తిండి, గుడ్డ, ఇల్లు. వీటితో పాటు విద్య కూడా. స్త్రీ, పురుష భేదం లేకుండా వీటికి భంగం కలగకుండా స్త్రీ కూడా ఉండేలా చూడటమే ప్రాథమిక సమానత్వం. స్త్రీలకు సమానత్వం లేని విషయాలు ఏమున్నాయి? ఈ ప్రశ్నను క్షుణ్ణంగా పరిశీలిస్తే అది ఆమె పుట్టి, పెరిగిన వాతావరణంపై ఆధారపడి ఉంటుంది. ఓ కుటుంబంలో కొడుకు, కూతురు ఇద్దరూ ఉన్నప్పుడు పైన చెప్పినటువంటి నాలుగు అవసరాల్లో దేనిలో ఆమెను వివక్షకు గురి చేసినా అక్కడ సమానత్వం లోపించినట్లే. పుట్టి పెరుగుతున్న క్రమంలో ప్రతి వ్యక్తి తన అభిరుచుల్ని, అలవాట్లను అలవర్చుకుంటాడు. అందులో భాగంగా స్త్రీకి వంటపని అభిరుచి అయితే దాన్ని ఆమె చేయడంలో తప్పు లేదు. కాని బలవంతంగా అది 'ఆడపని' అని ఆమెపై రుద్దితే అది కచ్చితంగా తప్పే. అదే అభిరుచి అబ్బాయికి ఉంటే అతను ఆ పని చేయడంలో తప్పు లేదు. ఇక్కడ అభిరుచి అనేది ఇష్టం, సామర్థ్యాలమీద

ఆధారపడిన అంశమే కానీ లింగభేదం మీద మాత్రం కాదు. స్త్రీ సమానత్వం లేని అంశాలు ఇవి అని ఖచ్చితంగా నిర్ధారించటానికి లేదు. అది పూర్తిగా ఆమె ఇష్టాలకు సంబంధించిన అంశం అంతే కానీ, 'ఆడవాళ్లే ఎందుకు వంట చేయాలి? మగవాళ్లు వంట చేస్తేనే స్త్రీకి సమానత్వం వచ్చినట్లు' అనే పిడివాదాలు మాత్రం కచ్చితంగా వాస్తవానికి దగ్గరగా నిలబడలేవు. స్త్రీ, పురుష శరీర ధర్మాలు వేరువేరు. నెలనెల జరిగే ఋతుక్రమ పద్దతిలో ఆమె కొంత శక్తిని కోల్పోవడం ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. అంతేకాకుండా కొంత కోమలత్వం కలిగిన శరీరం ఆమెది. మొరటు పనులు లేదా కాస్త అసౌకర్యాన్ని కలిగించే పనులు ఆమె చేయలేకపోవచ్చు. ఈ విషయంలో స్త్రీ అశక్తతని, ప్రకృతి ధర్మాన్ని ద ృష్టిలో పెట్టుకొని కొన్ని పనులు స్త్రీలు చేయరాదు అని ఆనాడు అని ఉండవచ్చు. కానీ ఈ క్రమంలోనే పురుష ఆధిపత్య ధోరణి ప్రవేశించి ఇంకొన్ని అంశాలు కూడా జత కలిసి ఉండొచ్చు. ఏదిఏమైనప్పటికీ వ్యక్తిగా తను ఏమి చేయగలను? ఏది చేయలేను. సాధనతో ఏది చేయగలను? అన్న విషయాలు నిర్ణయించుకొని, ముందుకు సాగాల్సిన స్వేచ్ఛాపరిధి అన్నది ప్రతి స్త్రీకి వ్యక్తిగతంగా మారుతూ ఉంటుంది. ఓ సమానత్వ చట్రం తయారు చేసి ఆ పరిధిలో స్త్రీజాతి మొత్తాన్ని ఇరికించేసి, ఇదే స్త్రీ సమానత్వం అని ప్రచారం చేసేవారు, ఈ విషయాలన్నింటిని కూడా నిశితంగా పరిశీలిస్తే బాగుంటుందేమో! భర్త పైశాచిక చర్యల్ని భరిస్తూ, సర్దుకుంటూ కన్నీళ్లతో గడుపుతున్న ఇల్లాల్లు ఇంకా ఎందరో? ఇప్పటికీ ఎన్నో తెగల్లో అవమానాల దాష్టికానికి గురవుతూ ఉన్న ఆడబిడ్డలు ఎందరో! గుట్టుచప్పుడు కాకుండా వీరంతా భరిస్తున్నారే కానీ గొంతు విప్పి, ఫిర్యాదులు నమోదు చేసేవారు అరుదే. స్వతంత్రంగా బతికే ఆలంబన లేక సర్దుకుపోయే వారికి కావాల్సిందే 'సమానత్వం' అనే అస్త్రం. కానీ పని ఒత్తిడిలో అలిసిపోయి అనుకోకుండా దొర్లే పదప్రయోగాలకి విపరీతంగా స్పందించి ఆలుమగల బంధాన్ని విచ్ఛిన్నం చేసుకోవడమే సమానత్వం అయితే దాని పరిణామాలు ఎక్కడికి దారి తీస్తున్నాయి? నిజంగా సమస్య ఉందా? లేదా? అనేది నిర్ధారించుకోలేక తటస్థ వైఖరితో కుహనా సమానత్వం పేరిట ఓ తరాన్నే పూర్తిగా విచ్ఛిన్నం చేస్తున్న సంఘటనలెన్నో! అన్నిటికన్నా ముఖ్యంగా ఆలోచించాల్సిన అంశం

ఇంకొకటుంది. అసలు లింగ వివక్షకు కారణం స్త్రీ, పురుషుడిలా ఉండలేకపోవడమా? అంటే తెలియకుండానే పురుషుడిలా ఉంటే వివక్ష ఉండదు అన్న భావనతో పురుష లక్షణాల్ని స్త్రీవాదం పేరిట అలవర్చుకొనే ప్రయత్నం జరుగుతుందా? అంటే తెలియకుండానే స్త్రీలా ఉండటాన్ని ఇష్టపడలేకపోతున్నామా? స్త్రీతత్వాన్ని, దాని ఔన్నత్యాన్ని మరిచి పురుష లక్షణాలపై మొగ్గుచూపడమే స్త్రీ సమానత్వంగా చిత్రీకరిస్తున్నామా? ఈ క్రమంలో చివరికి మిగిలేదేమిటి? 'స్త్రీ' అనే అంశం రూపానికి పరిమితమై వ్యక్తిగా పురుషుడిలా మారిపోవడమేనా? ప్రకృతికి, మనిషికి అవినాభావ సంబంధం ఉంది. సృష్టి క్రమంలోనే ఓ లయబద్ధత ఉంది. దాన్ని మర్చిపోయే ఈ వింత పోకడలు జీవితంలోని అందాన్ని పాడుచేయడమే కాకుండా తరతరాల మూలాలు అంతరించేలా చేస్తాయి. అనుకరణ మాని సహజసిద్ధ స్వభావానికి తగ్గట్టు స్వతంత్ర జీవనశైలిని అలవర్చుకునే తత్వాన్నే 'స్త్రీ సమానత్వం'గా నిర్వచించే రోజు రావాలని ఆశిద్దాం.



# మనిషి మరబొమ్మలా కారాదు!

ఈ జనరేషన్ పిల్లలకు నచ్చునివి ఏమిటి? ఒకటి వినటం రెండోది చదవడం! ఇది నా సొంత అభిప్రాయం కాదు. సుమారు 30 ఏళ్లుగా అధ్యాపక వృత్తిలో ఉంటూ ఓ ప్రఖ్యాత పాఠశాలను నడుపుతూ మారుతున్న తరాల పిల్లల అంతరాలు లోతుగా పరిశీలిస్తున్న ఓ ఉపాధ్యాయుని అనుభవాలతో ధృవపరచబడిన సత్యం. సమాజంలో ఎప్పుడూ వెలుగులోకి వచ్చే అరాచకాలు గమనిస్తూ ఉన్నప్పుడు ఏదో తెలియని ఓ 'ప్రత్యామ్నాయ ప్రవృత్తి' ధోరణి స్త్రీ, పురుష సంబంధాలపై గాఢంగా ప్రభావం చూపుతుంది అన్న విషయం స్పష్టం అవుతుంది. దీనికి బీజాలు బాల్యంలోనే పడతాయి అన్నది ఎవరూ కాదనలేని సత్యం. బాల్యం అంటే ఏమిటి? పిల్లల ప్రపంచంలో ఎప్పుడు ఎవరు ఉంటారు? తల్లిదండ్రులు ప్రతి మనిషి జీవితంలో ఎప్పుడూ ప్రముఖ పాత్ర వహించే వ్యక్తులే. కానీ ఉపాధ్యాయులు! (?) పిల్లల లోకం వాళ్లే మరి! రోజుకి సగంపైగా వారితో గడుపుతూ, మిగిలిన రోజుల్లో కూడా దాదాపు కాలాన్ని వారి గురించే ఆలోచించే చిన్నారులని ఎక్కువ ప్రభావితం చేసేది వారే అన్నది కూడా మనం తప్పకుండా ఒప్పుకోవాల్సిన సత్యం. ఈ రోజుల్లో అక్షరాస్యులకి కొరత ఏముంది? మరి అక్షరాల తూకం ఓ వైపు, అరాచకాల పాపం ఇంకోవైపు..

ఎందుకో ఈ దుస్థితి? లోతుగా పరిశీలిస్తే తరాల మార్పుతో కొట్టుకుపోతున్న ప్రవాహంలో ఏదో అవాంతరం వచ్చింది అనేది సత్యం. అదే మార్పుకి, మానవ స్పర్శకు మధ్య రగులుతున్న సందిగ్ధ సంఘర్షణ. టెక్నాలజీ డిజిటల్ విద్యనే అసలైన విద్యగా భావిస్తున్న నేటి పరిస్థితులు మనుషులకు మెషిన్లతో, గాడ్జెట్లతో ఎలా మెలగాలో నేర్పిస్తున్నాయే కానీ మనుషులతో మానవత్వంతో ఎలా మసలుకోవాలో మాత్రం తెలుసుకునేలా చేయలేకపోతున్నాయి. అన్నది కూడా సమకాలీన దుష్పరిణామాలను దృశ్యాలుగా చూస్తున్న తర్వాత అంగీకరించాల్సిన సత్యమే. మనిషికి ఓ వ్యక్తిత్వం రూపొందే క్రమంలో బాల్యంలోని ప్రభావాలు బలమైన పాత్రను పోషిస్తాయి. ఆ దశలో విద్యార్థిగా అతను జీవితం పట్ల అలవర్చుకున్న ఆశావాద దృక్పథమో లేక నిరాశావాదమో భవిష్యత్తుని నిర్దేశిస్తాయి. విత్తుని బట్టే కదా వృక్షం! క్షేత్రాన్ని బట్టే కదా విత్తు! బాల్యం నుండి ప్రారంభ యవ్వనదశ వరకు ఉండే కాలంలో మనుషుల ప్రభావం, పరిస్థితుల ప్రభావం తీవ్రంగా ఉంటుంది. అదే విధంగా గుడ్డిగా అవలంభించడం అనే పంథా కూడా ఉంటుంది. ఆ కీలక దశలో అనుకరణ కూడా ఉంటుంది. నేటి పరిస్థితులలో అంతర్జాల మమేకం అవుతున్న పిల్లల్ని నిజంగా బాల్యంలో ప్రభావితం చేస్తున్నవి ఏమిటి? మనుషులు కాదు గాడ్జెట్లు. మానవస్పర్శ కొరవడిన విద్య మనుషుల్లో పశుప్రవృత్తిని ప్రేరేపిస్తుంది. ఒకప్పుడు ఉపాధ్యాయులకు విద్యార్థులకు మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలు ఓ ఇంటి వాతావరణాన్ని తలపించేవి. ఉపాధ్యాయుల తిట్లే ఆశీర్వాదాలుగా భావించేవారు అప్పట్లో దానితో అతి చిన్నచిన్న విషయాలను గురించి విపరీతంగా ఆలోచించే ధోరణికి ఆస్కారం ఉండేది కాదు. కానీ నేటి పరిస్థితుల్లో పిల్లలకు పాఠశాలల్లో ఏది తప్పో, ఏది ఒప్పో గట్టిగా మందలించే ఆస్కారం కూడా లేదు. ఇది నాణేనికి ఓ వైపు. ఇంకోవైపు ఇటు వైవు సమాజాన్ని లాగినపరిణామాలను పరిశీలిస్తే ఓర్పు నశించిన కొందరి ఉపాధ్యాయుల విపరీత క్రమశిక్షణ పద్దతులు దీనికి దారితీస్తాయని అనుకోవచ్చు. లాలిత్యం, ఆత్మీయత ధ్వనించాల్సిన వాతావరణంలో అతిక్రమశిక్షణ ఏలుతున్న ప్రవృత్తి దానికి ప్రత్యమ్నాయంగా వచ్చిన పోకడలే 'మ్యాన్ వెర్సస్ మెషిన్' ట్రెండ్‌కి దారితీసింది. 12 ఏళ్ల వయసు నుండి ఇరవై ఏళ్ల వయసు వరకు మాయాలోకం ఈ వయసులో శారీరకంగా వచ్చే మార్పులు పిల్లల మనఃస్థితిపై కూడా తీవ్రంగా ప్రభావం చూపిస్తాయి.

ఆ సమయంలో సరైన దిశానిర్దేశం లేకపోతే గాడితప్పే ఆలోచనలు వ్యక్తులనేకాదు సమాజాన్ని సర్వనాశనం చేస్తాయి. ఆ దశలో పిల్లలు తమ మనసులోని భావాలను నలుగురితో పంచుకోవడానికి సిగ్గుపడతారు. తమ మనసులో ఊగిసలాడే సందేహాల్ని ఎలా ఛేదించాలో తెలియక సతమతమయ్యే ఈ దశలో మానవ స్పర్శ కరువైతే తప్పొప్పుల విచక్ష పిల్లలు కోల్పోతారు. సరైన విద్య అందించకపోతే మాధ్యమాలే గురువులు అవుతాయి వారికి. సినీ మాయజాలం ఓవైపు.. సోషల్ నెట్‌వర్కింగ్ ఇంకోవైపు వారిని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. బ్లూవేల్ ఉదంతాలకు మూలం కూడా ఈ మానవస్పర్శ కొరవడిన విద్యవల్లే. ఒంటరితనం, వయసు ఉక్కిరిబిక్కిరి, మాధ్యమాల వెల్లువ వీటితో సహవాసం చేసే ఈ ప్రారంభ యవ్వనదశ పిల్లల్ని క్రమక్రమంగా పైశాచిక ప్రవృత్తి వైపుకు మళ్లేలా చేస్తుంది. మొదట పెంకితనం, మొండితనంతో మొదలయ్యే ఈ ధోరణులు తర్వాత పైశాచికత్వానికి దారితీస్తాయి. ఆ తరహా పైశాచిక ధోరణులే చివరికి అసమానత్వ స్థితికి దారి తీస్తాయి. ఒకరిపై ఒకరు యాసిడ్లతో, కత్తులతో తెగబడేలా చేస్తాయి. ఓ మనిషి సంపూర్ణ వ్యక్తిత్వం బాల్యంలోని బీజాలతోనే మొదలవుతుంది. ఇప్పుడు ఇంకో ప్రశ్న ఉదయించవచ్చు. మరి ఇంతకు పూర్వం టెక్నాలజీ ఇంత అభివృద్ధి చెందనప్పుడు ఇటువంటి అకృత్యాలు జరగలేదా అని. కానీ చాలావరకు జరిగిన అరాచకాలన్నీ మాధ్యమ ప్రేరేపితాలే అన్నది మాత్రం వాస్తవం. టెక్నాలజీతో మాధ్యమాల దూకుడు జెట్ స్పీడ్‌ను అందుకున్నాయి. ఓ మంచి పని చేయాలన్నా లేకపోతే ఓ మారణకాండకు పాల్పడలన్నా ఓ మోటివ్ అయితే కచ్చితంగా ఉంటుంది. మానవస్పర్శ వల్ల మనిషిలో ఎదుటి వ్యక్తి జీవితంలో సాధ్యాసాధ్యాలు, అనుకూలాలు, ప్రతికూలాలు అర్థం చేసుకునే ప్రజ్ఞ, పరిణితి అలవడతాయి. ఆ క్రమంలో 'నాది..నాకే సొంతం కావాలి, లేకపోతే ఇంకెవరికి దక్కకూడదు..' అనే విపరీత ధోరణికి దూరంగా ఉంటారు. ఎప్పుడైతే విద్య మానవీయ కోణం మనిషిలో సంస్కారంగా రూపొందుతుందో అప్పుడు మానవత్వంతో మరో ప్రపంచం వైపు సృష్టి పయనిస్తుంది. అదేవిధంగా ప్రతి ఒకరి మధ్య తెరగా నిలబడుతున్న విపరీతమైన ఇండివిడ్యువాలిటీ అందరి మధ్య పెద్ద గ్యాప్‌ని సృష్టిస్తుంది. ఒక్కసారి ఆ తెరను దించేసి ఓ ఆత్మీయ స్పర్శతో ముందడుగు వేస్తే చాలు. మిగిలిన సుధీర పయనం దానంతటదే ప్రకృతితో సాగుతుంది. మొదటి అడుగు విద్యదైతే వసుధైక కుటుంబ స్ఫూర్తితో నిండదా సృష్టి!



# స్వయం రక్షణే స్త్రీకి సౌందర్యం

అనగనగా ఓ ఆరడుగుల హీరో, కాలేజీలో ఓ అందమైన అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. క్లాసులు ఎగ్గొట్టి, సినిమాల్లో, పార్కులలో చెట్టాపట్టా లేసుకుంటూ 'నువ్వు లేకపోతే నేను బతకలేను' అన్న డైలాగులు చెప్పుకుంటూ ఇంటర్వెల్ దాకా గడిపేస్తారు. ఆ తర్వాత తల్లిదండ్రులు ఒప్పుకోకపోతే ఒప్పించి మరీ పెళ్లి చేసుకుంటారు. ఏదో ఒకానొక క్షణంలో అదృష్టం డైరెక్టర్‌ను, సినీ యూనిట్లను వరిస్తే తప్ప ప్రయోగాత్మకంగా ప్రేమ కథలకు భిన్నంగా వచ్చే సినిమాలు జనాదరణ పొందడం అన్నది అరుదైన అంశం. అసలు సినిమా అంటే ఏమిటి? ఓ ఊహాప్రపంచం. ఆ ఊహాప్రపంచంలో మనల్ని మనం ఇముడ్చుకునే ఊహానాయకత్వ నాటకీయత ఉండాలి. దానితోపాటు తర్వాత సంఘటనలను ఊహించడం, అవి ఊహకు భిన్నంగా ఉండటం.. థ్రిల్‌గా ఫీలవ్వడం.. ఇవన్నీ ప్రేక్షకుని సినిమా స్పందన తాలుకు భావోద్వేగాలు. ఓ సమస్యను తెరకెక్కించడం అన్నది ఇప్పటికే ఎన్నో సినిమాల్లో చంపేసాం. కానీ అబ్‌సర్డ్ పద్ధతిలో స్త్రీ పుట్టిన దగ్గరి నుండి ప్రతి దశలో ఎదుర్కొనే లైంగిక వేధింపుల అంశంగా సినిమాను చిత్రీకరించడం మాత్రం ఇదే

మొదటిసారి అని చెప్పవచ్చు. దీనికి నిదర్శనమే తాజాగా విడుదలైన 'అ' సినిమా. ప్రపంచసాహిత్యంలో ఎందరో అబ్సర్డిటీని కథా సంవిధానంగా చేసే కళాఖండాలను సృష్టించారు. కాఫ్కా, శామ్యూల్ బెకే, కామూ, లూయిస్ కారెల్, డానిల్ ఖర్మ్ ఆదే తెగ. నిరుపయోగమైన చేష్టల పాత్రలతో, సాంప్రదాయేతర నిర్మాణంతో, కథను ఆంతర్లీనంగా ప్రవహించే సాంద్రతాత్వికతతో నడపడం రచనలో కొంచెం కష్టంగానైనా సాధ్యమే కానీ.. దాన్ని యధాతథంగా దృశ్యంగా మార్చడం మాత్రం అంత సులువు కానేకాదు. తెలుగు కథకుల్లో త్రిపుర ఈ శైలిని ఎంచుకున్నాడు. యండమూరి కొన్ని కథలు రాసాడు. అనువాదాలు చాలా వచ్చాయి. రచనలో ఆమోఘం అనిపించే ఈ నిర్మాణాన్ని దృశ్యరూపంలోకి తేవడం దాదాపు అసాధ్యమే. అందుకే తెలుగు సినిమాల్లో ఆ ప్రయత్నం ఎవరూ చేయలేదు. కానీ 'అ' సినిమాతో తెలుగులో ఈ ప్రయోగానికి నాంది పడింది. ఏమీ అర్థం కావడం లేదనిపిస్తూనే ప్రతి సన్నివేశంలో ఉత్కంఠని నింపుతూ, అయోమయంగా ఉన్నట్టుగా ఉంటూనే ఆసక్తిని పుట్టించాడు దర్శకుడు. ఎదుగుతున్న ప్రతిదశలో లైంగిక వేధింపులకు గురై మగజాతిపట్ల ద్వేషంతో మరో యువతినే పెళ్లి చేసుకోవడానికి సిద్దపడ్డ ఓ అమ్మాయి కథే 'అ'. ప్రతి మనిషిలో ఎన్నెన్నో భావోద్వేగాలు ఉంటాయి. ఒక్కోపరిస్థితిలో ఒక్కో సందర్భం బట్టి ఒక్కో భావోద్వేగం బయటపడుతుంది. కానీ కొన్నిసార్లు భయం, సిగ్గు, బిడియం వల్ల కొన్ని సహజ భావోద్వేగాలను అణచివేసి ఓ కృత్రిమ ఉద్వేగలోకంలో ఉండే పరిస్థితులు మనందరికీ తారసపడుతూనే ఉంటాయి. అటువంటి ఒక్కో భావోద్వేగానికి ఒక్కో పాత్రతో ప్రాణం పోయడమే ఈ సినిమా. 'మల్టిపుల్ పర్సనాలిటీ డిజార్డర్ అనే మానసిక అపసవ్యతతో బాధపడే అమ్మాయి మనసులోని అన్ని కోణాలను ఆవిష్కరించే కథ ఇది. తల్లితండ్రి ప్రేమకు దూరమై వాళ్లను బతికిచుకునేందుకు కాలాన్నే తిరగరాయాలని తపనపడే ప్రయోగవాది కథ. ప్రేమ అజరామరం, అనంతరం అని చెప్పే కథ. బతకడం కోసం ఎంతకైనా సిద్ధపడే సగటు సెల్ఫిష్ త్యాగమూర్తి కథ.

జీవితంలో దెబ్బతిని మార్గంలో ఆ గాయాలకు మాదకద్రవ్యం అనే మందును పూద్దామనే మంచి మనసున్న పిరికి యువత కథ. మనుషుల వెధవాయిత్వాల నడుమ చెట్లూ చేపా ఎంతో స్వచ్ఛమైనవని చెప్పే కథ. దేవుడే అందరి కంటే గొప్ప మెజీషియన్ అని తేల్చిచెప్పే కథ. ఈ కథలన్నింటిలోని

పాత్రలన్నీ వేర్వేరు కావని ఒకేఒక మనిషిలోపలి విభిన్న భావోద్వేగాల రాగద్వేషాల రూపాల నీడలని చెపుతూనే..ఈ వాస్తవాల్నీ సూటిగా చెప్పని అసలు కథ. స్త్రీ అసలు ఈ సృష్టిలో లేదు. ఆమె కేవలం ఎందరో అభిప్రాయాల జాడ్యాలతో, స్వీయభయాలతో, స్వానుభవాలతో మలచబడింది. జీవితంలోని ప్రతిదశలో ఆమె అనుభూతించే లేదా భరించే కొన్ని స్పర్శల వెనుక దాగి ఉన్న అమానుషత్వ ప్రవృత్తిని ఆమె. బయటకు వ్యక్తపరచకపోయినా ఆమెకు అంతర్లీనంగా అన్ని తెలుసు. అలా అన్ని సందర్భాల్లో సర్దుకుపోయే పరిస్థితులను ఆమె దాటడం ఎన్ని శతాబ్దాల తర్వాత మొదలవుతుందో కాలానికే ఎరుక. శారీరక అత్యాచారాన్ని మాత్రమే నిజమైన తప్పుగా, బాధ పెట్టే అంశంగా భావిస్తూ సాగిపోతున్న ఈ తరుణంలో సినిమాలాంటి మాధ్యమం ద్వారా ప్రతిదశలో మగువ మనోగతాన్ని వాస్తవికంగా ఆవిష్కరించడం కచ్చితంగా హర్షనీయ చర్య. స్త్రీ సాధికారత నిజంగా పురుడుపోసుకునేది కొందరు స్త్రీల గొప్ప చరిత్రల వల్ల మాత్రమే కాదు, ప్రతి స్త్రీ ధైర్యంగా అన్ని ఎదుర్కొంటూ, మనసులో కుమిలిపోయే విషపు నీడల నుండి తననుతాను కాపాడుకున్నప్పుడే. స్త్రీల పట్ల సమాజం ఏర్పరచుకొన్న దృష్టికోణంలో మార్పుతోపాటు, స్త్రీ సమాజం పట్ల పెంచుకున్న భయం, సందిగ్ధత వంటి అంశాల్లో కూడా వ్యక్తిగతంగా మార్పు రావాలి. అప్పుడే స్త్రీ సమానత్వ సౌందర్యంతో శోభిల్లుతుంది.



# వాలంటైన్స్ డే వరమా? శాపమా?

మనిషి జీవితంలో ప్రేమ ఒక అనుభూతి, ఒక తపన, ఒక ఆర్తి, ఆవేదన. మనకంటూ ఒక మనిషి కావాలనే తపనే ప్రేమ. తను ప్రేమించిన మనిషి కోసం ప్రేమికులు ఏదైనా చేస్తారు. ప్రేమతో ఏదైనా చెబితే అది శాసనమే. ప్రేమించిన మనిషి కోసం కన్నవారిని కూడా వదిలి వచ్చేస్తున్నారంటే అది ఎంత బలమైందో అర్థమవుతుంది. ప్రేమ ఒక గొప్ప శక్తి. అది మనిషికి ఓ ఇన్స్పిరేషన్. జీవాన్ని, జీవితాన్ని ఇస్తుంది. జీవితంలో ఏదో ఒక దశలో ఎవరినైనా ప్రేమించని మనిషంటూ ఉండడు. ఈ లోకం ప్రేమతోనే నడుస్తుంది. నిజం చెప్పాలంటే ప్రేమ అనేది దైవత్వం, అది అజరామరం. లవ్ ఈజ్ ఫరెవర్. ప్రేమ దేవుడంత మహోన్నతమైంది. అలౌకికమైన అద్భుత ప్రేమ సౌందర్యం. ప్రేమను పొందడం వరం. ఎవరి ప్రేమకూ నోచుకోకపోవడం అంతులేని విషాదం. ప్రేమలేని మనిషి లేడు, ప్రేమ లేని జీవితం లేదు. ప్రేమలేని జీవితం లోకంలో లేదు. మృదుమధురమైన ప్రేమ ఒక గొప్ప శక్తి. సృష్టిలో ప్రతి ఒక్కటి పరిణామక్రమంలోనే పునరుజ్జీవనం చెందుతూ ఉంటుంది. ప్రేమ అంటే పైన చెప్పినంత పవిత్ర భావన. ఓ 15-20 ఏళ్ల పూర్వం ఉండేది పై తరహా ప్రేమ, కానీ నేడు ఆ ప్రేమ అదే భావనతో లేదన్నది

వాస్తవం. గ్రీటింగ్ కార్డులు, గులాబీ గుత్తులు, గిఫ్టులు.. పార్కులు సినిమా హాలులు బైక్ మీద షికార్లు.. వేలంటైన్ డే అంటే ఇంతకు మించి ఏమున్నది నేడు? ప్రేమ అనుభూతిని తెలుసుకునే లోపలే బ్రేకప్‌లు కొత్త ప్రేమ కోసం వెతుకులాటలు. .నేడు వేలంటైన్స్ డే ప్రేమను అనుభూతికి ఆస్వాదించే రోజా లేకపోతే కొత్త ప్రేమల వెతుకులాటకై పరితపించే రోజా? ఒక వ్యక్తితో ఎన్ని అపార్థాలు తలెత్తినా, ప్రేమతో పరస్పరం అర్థం చేసుకొని, ఆ జ్ఞాపకాలను మధురానుభూతులగా తలచుకొంటూ సాగాల్సిన వేలంటైన్స్ డే.. నేడు నిజంగా వరమా? శాపమా? ప్రేమిస్తే జరిగేవి రెండే. ఒకటి ప్రేమించిన వ్యక్తిని పెళ్లి చేసుకొని జీవితం పంచుకోవడం. లేకపోతే ఆ వ్యక్తిని మర్చిపోయి ఇంకో వ్యక్తితో కొనసాగడం. పూర్వం తాము ప్రేమించిన వ్యక్తిని ఏవైనా కారణాల వల్ల పెళ్లి చేసుకోలేని పరిస్థితి ఏర్పడితే విడిపోయి ఉండేవారు. కానీ నేడు అది ఒక ఉన్మాదంగా కూడా మారిపోయింది. ప్రేమించిన తర్వాత ఏవైనా అడ్డంకులు ఏర్పడి ప్రియురాలు దక్కని పరిస్థితి ఏర్పడితే ఆమెని చంపడానికి కూడా వెనుకాడడం లేదు. అది మితిమీరిన పైశాచిక ప్రేమ కోణం. ఇది నాణేనికి ఓ వైపు. ఇంకో కోణంలో చూస్తే నేటి యువత ప్రతీ విషయంలోనూ కొత్తదనాన్ని కోరుకుంటున్నారు. అది వస్తువులకే పరిమితం కాకుండా మనుషులకి కూడా విస్తరించడం శోచనీయం. ప్రేమతో ఒక వ్యక్తితో ఉన్నాక, ఆ వ్యక్తి గురించి పూర్తిగా తెలిసాక, ప్రేమతో వారిలోని లోపాలను అంగీకరించి దానికి తగ్గట్టుగా వెలిగే ప్రేమ స్పర్శ నేటి ప్రేమల్లో కొరవడుతుంది. ఈ వ్యక్తి లేకపోతే ఇంకొకరు అన్నది ఓపెన్ కల్చర్ అనుకోవాలో, యువతలో స్థిరత్వాన్ని స్తంభింపజేస్తున్న వినాశనం అనుకోవాలో అన్నది సమాజంపై, కుటుంబాలపై, వ్యక్తులపై పడే ప్రభావాన్ని బట్టి ఎవరికీ వారు అభిప్రాయానికి రావాల్సిన అంశం. ఎప్పుడైతే సోషల్‌నెట్ వర్కింగ్ సైట్స్ ఫేస్ బుక్, వాట్సప్, ఇన్‌స్టాగ్రామ్ లాంటివి వెలుగులోకి వచ్చాయో అప్పుడే 'ప్రేమను వినిమయ వస్తువుగా' పరిగణించే సంస్కృతి కూడా పెరిగిపోయింది. నేడు వాట్సప్, ఫేస్ బుక్ అలాగే కొన్ని పత్రికల్లోనూ ఈ ప్రేమల మీద వచ్చే జోకులు దాని ప్రభావమే. ఓ గర్ల్ ఫ్రెండ్ ఉండాలంటే – ఆమెకు గిఫ్ట్‌లు ఇవ్వాలి, షాపింగ్ చేయించాలి, సినిమాలకు తీసుకువెళ్లాలి. ఇవన్నీ చేస్తేనే ఆ అమ్మాయి నాతో ఉంటుంది అనే వస్తువిషయ తాపత్రయ కోణంలోనే నేటి ప్రేమలు కొనసాగడం వల్ల ఇచ్చిపుచ్చుకోవడాల్లో భేదాలు

వచ్చినప్పుడు ప్రేమలు ముగుస్తున్నాయి. ప్రేమ అనేది ఓ భావన, ఓ అనుబంధం అన్న సంస్కృతి నుండి క్రమేపీ వస్తు వినిమయ అంశంగా పరిణమించాక దాన్ని దీర్ఘకాల ప్రేమగా నిలుపుకోవాలన్న భావన ప్రేమికుల్లో అంతం అవుతుంది. నేడు దీనివల్లే ప్రేమ ఓ పరోక్ష వ్యాపారంగా మారేంత విషతుల్యంగా వైఫల్యదశలో పయనిస్తుంది. నేటి యువత ప్రేమను 'పవిత్రబంధం' అన్న కోణంలో కాక వస్తువుగా పరిగణించడానికి కారణాలు ఏమిటి?

విచ్ఛిన్నమైన కుటుంబ వ్యవస్థ, సింగిల్ పేరేంటింగ్ సిస్టమ్‌లాంటి పోకడలవల్ల యువతకు తల్లిదండ్రులతోనో, బంధువులతోనో రోజుకి కొంత సమయం గడిపే అవకాశం కూడా ఉండటం లేదు. తమ కంటే పెద్దవారి మాటలు వినే వాతావరణం లేకపోవడం వల్ల వారికి అనుబంధాల విలువ తెలియకపోవడం వల్ల కూడా ప్రేమను ఒక యాంత్రిక ప్రక్రియగా పరిగణించడం జరుగుతుంది.

"ప్రేమ ఒక సక్రియాత్మక శక్తి. మనిషికీ, సమాజానికీ మధ్య సమన్వయాన్ని ఏర్పరచే ఒక సాధనం వైయుక్తికతని పరిరక్షిస్తూ ఒంటరితనం నుంచీ, పరాయితనం నుంచీ వ్యక్తుల్ని విముక్తం చేసే ఒక ప్రక్రియ ఇద్దరు వ్యక్తులు ఒక్కటై కూడా తిరిగి ఎవరికి వారు మిగిలివుండగల అవకాశానికి అందమయిన ఒక అభివ్యక్తి. సమాన హృదయాల సంవేదనల మధ్య ఒక సున్నితమయిన సర్దుబాటు. నమ్మకం, నిజాయితీ, నిబద్ధత, సహనం, సమానత్వం, సహజీవనం హక్కులు, బాధ్యతల సంయుక్త సమాగమం. ఇద్దరు వ్యక్తులు తమ అస్తిత్వాలను పణంగా పెట్టి 'నేను' నుంచి 'మనం' దిశగా ఇంద్రియ చైతన్యంతో చేసే ఒక అద్వైత శిఖరారోహణం. పరస్పర సంఘర్షణని పరిహరించే ఒక నైతిక పర్యావరణం. ప్రజాస్వామ్యం ప్రేమ అంతిమ సారాంశం" అన్నది ఓ ప్రముఖ రచయిత అభిప్రాయం. ప్రేమకు అంత విస్తృతి ఉన్నది. ఇంకా లోతుగా పరిశీలిస్తే ప్రేమకు నిర్వచనం ఇవ్వడం కొన్నిసార్లు అసాధ్యం కూడా. ఎందుకంటే అది అందరి మధ్య ఒకేలా ఉండదు. 'మనం ఒక ప్రేమబంధం నుండి ఏం ఆశిస్తామన్నది ప్రేమ' మీద ఆధారపడి ఉండదు. మన మనస్తత్వం మీద ఆధారపడి ఉంటుంది. కొందరికి ప్రేమ అంటే ఎప్పుడూ కలిసి ఉండడం, మరికొందరికి ప్రేమ అంటే ఇద్దరు అన్ని విషయాల్లోనూ ఒకేలా ఆలోచించడం, ఒకే అభిరుచి కలిగి ఉండడం. ఇంకొకరికి ప్రేమ అంటే ఎప్పుడూ కలిసి

ఉండడం, మరికొందరికి ప్రేమ అంటే ఇద్దరు అన్ని విషయాల్లోనూ ఒకేలా ఆలోచించడం, ఒకే అభిరుచి కలిగి ఉండడం. ఇంకొకరికి ప్రేమ అంటే ఒకరి కోసం మరొకరు త్యాగాలు చేయడం. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. నిజానికి ఇవేవీ ప్రేమ సమగ్ర స్వరూపాలు కావు. ప్రేమ ఎప్పుడూ సాపేక్షమైన విలువే. అందుకే తరచుగా స్త్రీ, పురుషులు "నాకు నీమీద ఉన్నంత ప్రేమ నీకు నా మీద లేదు' అని నిందలు వేసుకుంటుంటారు. ప్రేమకు ఎవరి కొలమానాలు వారివి. కానీ ప్రేమ గురించి ఒకటి మాత్రం నిజం. అది చచ్చిపోతే మళ్లీ బతికించలేం. బలవంతంగా బతికించాలని ప్రయత్నిస్తే అది 'ఇన్ డిఫరెన్స్'గా మిగిలిపోతుంది. సోమర్సెట్ మామ్ అన్నట్లు 'ఇన్డిఫరెన్స్' అన్నది ప్రేమకు అసలైన చావు. ద్వేషం కంటే కూడా బాధాకరం. ఎందుకంటే అది శాశ్వతం. మరైతే ప్రేమను నిలుపుకోవడానికి ఏం చేయాలి? దీనికి కూడా శాశ్వత పరిష్కారాలు, చిట్కాలు లేవు.. కానీ, ఒకరి నుంచి ఒకరు ఎక్కువ ఆశించడం మానెయ్యాలి. 'ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం ఎంత ఉండాలో ఒకరికొకరు స్పేస్' ఇచ్చుకోవడం కూడా అంతగానూ ఉండాలి. అలా స్పేస్ ఇచ్చుకున్నప్పుడు అవిశ్వాసాలు, అనుమానాలు, ఈర్ష్యలు తలెత్తవు. నేటి యువత ప్రేమను హృదయ సంబంధ అంశంగా భావించడం, స్థిరత్వంలో ఆ బంధాన్ని నిలబెట్టుకోవడం అన్న ఆలోచనా పరిధిలోకి మళ్లితేనే ఆరోగ్యకరమైన ప్రేమ ఎప్పటికీ నిజమైన వ్యాలంటైన్‌గా ఉండిపోతుంది. ఒక వ్యక్తి పట్ల గాఢమైన ఇష్టానికి లోనవ్వడం, ఆ వ్యక్తి సాన్నిహిత్యంలో ప్రేమ, కులం, మతం, డబ్బు, హోదాలాంటి వాటికి తావులేకుండా, ఏ నిబంధనలు, అడ్డుగోడలు, పరిధులు లేని ప్రేమ పునాదిగా విలసిల్లే సమాజం ఏ దేశానికైనా అవసరం, ఆరోగ్యకరం. అటువంటి సున్నిత స్పర్శతో కూడిన ప్రేమ సమాజం నేటి యువత స్పర్శతో మరల నిర్మించబడాలని ఆశిద్దాం.



# సాధికారత వట్టిమాటేనా!

రాత్రి ఒంటిగంటప్పుడు తన పెదవులకు ఏదో తగిలినట్లనిపిస్తే చప్పున నిద్ర నుంచి లేచి చూసింది ఆమె. ఒకతను ఆమెను ముద్దుపెట్టుకోబోతున్నాడు. ఆమె అతడిని గట్టిగా పట్టుకుని, చెయ్యి మెలితిప్పుతూ, లైటు వేసి బోగిలోని మిగతా ప్రయాణికుల్ని అలర్ట్ చేసింది. "ప్లీజ్.. దీన్ని ఇష్యూ చేయకండి", అని అతను బతిమాలుతున్నాడు.

ఇదంతా గమనిస్తూ కూడా.. బోగీలోని ఒక్కరూ ఆమెకు అండగా రాలేదు. అతడిని ఏమీ అనలేదు! చోద్యం చూస్తున్నట్లుగా ఉండిపోయారు. చివరికి అతడిని పోలీసులకు అప్పగించడం జరిగింది.

తెల్లారే మీడియాకు విషయం చెబుతూ, ఆమె ఎంతో బాధపడింది. ఇదే విషయాన్ని నేను ఫేస్‌బుక్‌లో పెట్టి ఉంటే 'ఐయామ్ విత్ యూ' అని కామెంట్లు పెట్టేవారు. వాళ్ల డిస్‌ప్లే పిక్‌లను కూడా నాకు మద్దతుగా మార్చుకునేవారు కానీ ఇదంతా సోషల్ మీడియా వరకేనా? నిజ జీవితంలో ఎవరూ బాధితులకు అండగా నిలబడే ధైర్యం చేయలేరా? రాత్రి జరిగిన ఘటన ఈ సమాజం పైన నాకు నమ్మకాన్ని పోగొట్టింది" ఆవేదన చెందింది ఆమె. ఆమె ఎవరో కాదు

మలయాళీ సినీనటి సమాష. సమాజంలో ఓ 'సెలబ్రిటీ స్టేటస్' ఉన్న ఓ మహిళ ఎదుర్కొన్న చేదు అనుభవం ఇది. తమను ఇబ్బంది పెడుతున్నా పరువు, మర్యాదలకు భంగం వాటిల్లుతుందేమో అని భయపడే రోజుల నుండి నిర్భయంగా సమాజానికి వెల్లడిస్తున్న స్థాయికి మగువ ఎదగడం నిజమైన స్త్రీ సాధికారతకు నిదర్శనమా? లేక ఆమె నిర్భయంగా అడుగులు ముందుగా వేస్తున్నా సంఘం ఆమెతో కలిసి ఒక్క అడుగు వేయడానికి కూడా సిద్ధంగా లేకపోవడం స్తంభిస్తున్న సమాజ స్పర్శకు చిహ్నామా?

ఆమెకు మేనత్త ఓ సంబంధం తీసుకుని వచ్చింది. బాగా ఆస్తిపరులు, అబ్బాయికి సర్కారు కొలువు. బంధువుల పెళ్లిలో అమ్మాయిని ఆ అబ్బాయి చూశాడు. మనసు పారేసుకున్నాడు. ఆమెనే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. అదీ ఆ మేనత్త రాయబారం. పెళ్ళి వయసా దానిది? సమస్యే లేదు' పిల్ల తండ్రి కళ్లెర్రజేసాడు చెల్లి మీద. అయినా ఆమె ప్రయత్నం వీడక తన తల్లి ద్వారా విషయాన్ని ముందుకు కదిల్చింది. 'నువ్వు కట్నకానుకలిచ్చే పరిస్థితుల్లో లేవు. దాని వెనుక ఇంకా ఇద్దరు ఆడపిల్లలున్నారు. వారసుడి కోసం ముగ్గురు ఆడపిల్లలను కంటివి. ఈ ముగ్గురికీ చదువులు, కట్నాలు ఇచ్చి పెళ్లి చేయగల స్థితిలో ఉన్నావా? నా మాట విని చెల్లెలు తెచ్చిన సంబంధానికి సరే అను' అని పోరింది అమ్మాయి నాన్నమ్మ. మొత్తానికి బలవంతంగా ఆ తండ్రి ఎమోషనల్ బ్లాక్‌మెయిలింగ్‌తో కూతురిని పెళ్లి పీటల మీద కూర్చోబెట్టాడు. కళ్లనిండా నీళ్లతో తలవంచి తాళి కట్టించుకుంది ఆ అమ్మాయి. భవిష్యత్ కలలు, లక్ష్యాలన్నిటినీ పమిట చెంగుకు కట్టేసుకొని మౌనంగా కాపురానికి బయలుదేరింది. ఏమి తెలియని ఆ అమ్మాయిని ఏవేమో అడిగాడు ఆమెకన్నా సగం వయసు ఎక్కువ ఉన్న భర్త. బిక్క మొహం వేసింది ఆ అమ్మాయి. కొట్టాడు, భరించింది. కాపురం చేయడం చేతకాదని చీత్కరించాడు అంటే ఏంటో అర్థం కాని ఆ అమ్మాయి తప్పు తనదే కావచ్చని నోర్మూసుకుంది. దాదాపు రోజూ లైంగికంగా దాష్టికమే. పెళ్లయి ఆర్నెల్లయినా గర్భం రాలేదని అత్తగారి పోరు ప్రారంభమైంది. ఆ వంకతో అత్త, భర్త చేయిచేసుకున్నారు. మనసుకు, శరీరానికి తగిలిన గాయాలతో పుట్టిల్లు చేరింది. ఆ అమ్మాయిని చూసి తల్లి మనసు తరుక్కుపోయింది. ఇక్కడ మళ్లీ మేనత్త, నానమ్మ పెత్తనం తీసుకుని 'అత్తింట్లో అవన్నీ మామూలే, సర్దుకోవడం నేర్పించు పిల్లలకు' అని అమ్మాయి తల్లికి చెప్పి, ఆ అమ్మాయిని తిరిగి అత్తింటికి పంపించారు. అక్కడా

షరా మామూలే. ఈసారి పిల్లలు పుట్టడం కోసం మందులు, మాకులు ఇప్పిస్తామని నాటువైద్యుల చుట్టూ తిప్పారు. పిల్ల ఆరోగ్యం చెడిపోయింది. పుట్టింటికి పంపారు. ఆరునూరైనా సరే వెళ్లనని భీష్మించుకుంది ఆ అమ్మాయి చదువుకుంటానని తండ్రి కాళ్లు పట్టుకుంది. తల్లిదండ్రులకు బిడ్డ పరిస్థితి అర్థమైంది. కోర్టుకు వెళ్లాలనుకున్నారు. బాల్యవివాహం కింద వీళ్లకూ అక్షింతలు పడతాయని బంధువుల్లో ఒకరు వారించడంతో కుల పెద్దలను కూర్చోబెట్టి సమస్యను పరిష్కరించుకున్నారు. ఇప్పుడు ఆ అమ్మాయి అత్తింటికి వెళ్లకుండా కాలేజీకు వెళ్లడం మొదలుపెట్టింది. ఇది నిజంగా జరిగిన సంఘటన. ఎక్కడో మారు మూల పల్లెల్లో కాదు హైదరాబాద్‌లోనే 'ఆడపిల్లలకు శారీరకంగానే కాదు మానసికంగా కూడా పరిపక్వత చాలా అవసరం. ఇప్పటి పిల్లలు చాలా ప్రేమగా పెరుగుతున్నారు. పద్దెనిమిదేళ్లొచ్చినా ఇంకా అమ్మానాన్నను పట్టుకునే ఉంటున్నారు. పైగా అప్పటికి వారి చదువు ఇంటరే. లోకం తెలియని వయసు. అంతేకాదు వాళ్ల జీవితంలోకి వచ్చేకొత్త వ్యక్తిని అంగీకరించలేరు. కాబట్టి 21 ఏళ్లు అనేది అమ్మాయిల పెళ్లికి సరైన వయసు. అప్పటికీ ఓ డిగ్రీ వస్తుంది. వాళ్ల జీవితాన్ని వాళ్లే నడుపుకునే శక్తి వస్తుంది. డిగ్రీ వరకు చదువుకుంటే పెళ్లి తర్వాత ఏవైనా సమస్యలు వచ్చినా ధైర్యంగా బతకగలరు. కాబట్టి కుటుంబపరంగా సమాజపరంగా.. పెళ్లికి సరైన వయసు 21 అని ప్రముఖులు అభిప్రాయ పడుతున్నారు. ఓ వైపు ధైర్యంగా జీవితంలో నిలబడి విజయం సాధించిన మగువలకు సమాజం నిస్సహాయత, ఆ నిస్సహాయతను ఆయుధంగా మలచుకొనే కీచకుల నుండి ముప్పు ఇంకోవైపు కన్నవారే కసాయిలుగా మారి ఆడపిల్లల కలల్ని కన్నీటిగా మారుస్తున్న వైనాలు వెలుగులోకి వస్తున్నాయి. అడుగులు వనితలవైనా.. ముందడుగు సమాజానిది, కుటుంబానిది కూడా అయితే స్త్రీ సాధికారత అన్న పదం తన అస్థిత్వాన్ని వాస్తవంలో చూసుకో గలుగుతుంది.



# లైంగిక బాధితులకు ఆసరా

'టైమ్ ఈజ్ అప్' అనే కొత్త మూవ్‌మెంట్ హాలీవుడ్‌లో మొదలైంది. 'మీ టూ' ఉద్యమానికి ఇది ఒక కార్యాచరణ రూపం! 'మీటూ' ఇంతవరకు లైంగిక వేధింపుల పైనే సాగింది. 'టైమ్స్ అఫ్' మాత్రం అమెరికాలోని అన్ని రంగాల్లో ఉన్న లైంగిక బాధితుల కోసం న్యాయపోరాటం చేస్తుంది. నటీమణులు, రచయిత్రులు, మహిళా డైరెక్టర్లు, ఇతర రంగాల్లోని ప్రముఖ మహిళలందరితో కలిసి మొత్తం 300 మంది టైమ్స్ అప్‌లో సభ్యులుగా ఉన్నారు. వర్క్ ప్లేస్.. అది హాలీవుడ్ ఆయినా, అగ్రికల్చర్ ఫీల్డ్ అయినా, పనిచేస్తున్నవారు సుప్రసిద్ధులైనా, సామాన్య మహిళలైనా వాళ్ల కంప్లైంట్ తీసుకుని న్యాయబద్ధంగా పోరాటం చేయడం, దోషులకు వీలైనంత త్వరగా శిక్ష వేయించడం టైమ్స్ అప్ లక్ష్యం. ఇందుకు అవసరమైన ఖర్చుల కోసం ఇప్పటికే ఈ ప్యానెల్ 13.4 మిలియన్ డాలర్ల విరాళాలను సేకరించగలిగింది. టార్గెట్ అమౌంట్ 15 మిలియన్ డాలర్లు. కేట్ బ్లాంచెట్, ఆష్లీజడ్, నటాలీ పోర్ట్‌మెస్, మెరిల్ స్ట్రీప్, రషీదా జోన్స్ వంటి ఉద్ధండ మహిళలు ప్యానెల్‌లో ఉన్నారు. 'లైంగికంగా వేధిస్తున్న మగవాళ్లను బయటకులాగకపోవడం వల్లనే.. వేధింపులకు అంతం లేకుండా పోతోంది. ఒక మామూలు మహిళ వెనుక కూడా పెద్ద సైన్యమే

ఉందన్న భయం అంటూ ఒకటి ఉంటే చెయ్యి వెయ్యడానికే కాదు, మాట అనడానికి కూడా మగాళ్లు భయపడతారు' అనే అర్థంతో జనవరి 1న 'టైమ్ ఈజ్ అప్' అనే ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటన 'డియర్ సిస్టర్స్' అనే మాటతో మొదలై.. 'సాలిడారిటీ' అనే పదంతో పూర్తయ్యింది. సాలిడారిటీ అంటే 'మేమున్నాం' అని ధైర్యమివ్వడం. ఇది హాలీవుడ్ 'స్త్రీ శక్తి' చిత్రం. స్త్రీలను

'ఆకాశంలో సగభాగం' అని చైనా విప్లవ నాయకుడు మావో అన్నారు. స్త్రీ, పురుషుల మధ్య అసమానతలను నిరసిస్తూ బిబిసి చైనా ఎడిటర్ క్యారీ గ్రేసీ ఇప్పుడు తన నిరసన గళం వినిపించారు. ప్రభుత్వ కార్యాలయాల్లో, ప్రైవేటు సంస్థలలో స్త్రీల కన్నా పురుషులకు ఎక్కువ జీతాలు ఇవ్వడం నేరం అని ఈ జనవరి 1న ఐస్‌ల్యాండ్ కొత్త చట్టాన్ని అమల్లోకి తెచ్చింది. హాలీవుడ్ నిర్మాత హార్వీ వైన్‌స్టీన్ లైంగిక వేధింపులకు నిరసనగా జనవరి 8వ గోల్డెన్ గ్లోబ్ అవార్డు ఫంక్షన్‌కు అంతా నల్లదుస్తులు ధరించి వచ్చారు. ఇప్పుడు బిబిసి చైనా ఎడిటర్ క్యారీ గ్రేసీ రాజీనామా వార్త ప్రపంచవ్యాప్తంగా ప్రకంపనలు సృష్టిస్తోంది. చూస్తుంటే ఈ ఏడాది 'మహిళా విప్లవం' ఏదో రాబోతున్నట్లే ఉంది. శుభపరిణామమే. బిబిసి చైనా ఎడిటర్ క్యారీ గ్రేసీ రాజీనామా చేశారు! లక్ష్యా ఎనభైవేల పౌండ్ల జీతాన్ని వదులుకొని లండన్ తిరిగి వచ్చేశారు. 'న్యూస్ రూమ్‌లో చిన్న ఉద్యోగం ఇవ్వండి చాలు' అని అన్నారు. బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్‌కి ఊహించని పరిణామం ఆది. రాజీనామా లేఖొచ్చి టేబుల్ మీద పడగానే బోర్డు రూమ్ ఉలిక్కిపడింది. బీసీసిలో సీనియర్ జర్నలిస్టు గ్రేసీ 30 ఏళ్ల అనుభవం. 'ఈక్వల్ పే' లేదని ఈ అకస్మాత్తు రాజీనామా చేశారు. తనకు లేదని కాదు. అసలు బిబిసిలోనే లేదని! 'డబ్బు ముఖ్యం కాదు నాకు సమానత్వం కావాలి. నాకొక్కదానికే కాదు. బీబీసిలో పనిచేస్తున్న మహిళలందరికీ కావాలి' అని గ్రేసీ బహిరంగ లేఖ రాశారు. వెంటనే ఆమెకు మద్దతుగా 130 మంది ఉన్నతస్థాయి బీబీసి జర్నలిస్టులు ఒక ప్రకటన విడుదల చేశారు. అవార్డు విన్నింగ్ జర్నలిస్టు గ్రేసీని తిరిగి చైనా ఎడిటర్‌గా మరల నియమించాలని ఆ ప్రకటన డిమాండ్. అలా చేయాలంటే, బీబీసి 'ఈక్వల్ పే' విధానాన్ని అమలు చేయాలి. స్త్రీ, పురుష సిబ్బందికి సమాన వేతనాలు ఇవ్వాలి. ఒకే హోదాలో ఉన్నప్పటికీ స్త్రీల కన్నా, పురుషులు యాభైశాతం అధికంగా జీతాలను పొందుతున్నారని, అదంతా రహస్యంగా జరిగిపోతోందని తన దృష్టికి వచ్చిన వెంటనే గ్రేసీ బయటికి వచ్చేసారు. ప్రస్తుతం ఆమె జీతం ఏడాదికి లక్షాముప్ఫై వేల పౌండ్లు. ఆ మొత్తాన్ని లక్షా ఎనభైవేల పౌండ్లకు పెంచేందుకు గత

అక్టోబర్‌లోనే బిబిసి పేపర్లు కూడా తయారుచేసింది. కానీ గ్రేసీ వద్దన్నారు. అందరికీ పెంచాలి' అని కండిషన్ పెట్టారు. 'ఈక్వల్ పే' కోసం గత జూలైలో సిబ్బంది నుంచి బీబీసి పై ఒత్తిడి వచ్చినప్పుడు అత్యున్నత స్థాయిలో జీతాలు ఎలా ఉన్నాయన్నదీ ఆ సంస్థ ఒక నివేదికను విడుదల చేయవలసి వచ్చింది. అప్పుడే గ్రేసీ తన అభ్యంతరాలను వ్యక్తం చేశారు. అప్పుడే ఆమెకు జీతం పెంచడానికి బీబీసి సంసిద్ధత వ్యక్తం చేసింది. అప్పుడే గ్రేసీ తనకొక్కదానికే జీతం పెంచడంపై విముఖతను వ్యక్తం చేశారు. ఇప్పటికి ఆరు నెలలు గడిచాయి. ఎక్కడి జీతాలు అక్కడే ఉన్నాయి. మహిళలు ఎక్కడివారు ఆక్కడే ఉన్నారు. పురుషులకు ధీటుగా పనిచేస్తున్నప్పటికీ పురుషులకన్నా తక్కువ జీతాలు పొందుతున్నారు. ఇది గ్రేసీని బాధించింది. ఆగ్రహం తెప్పించింది. రిపోర్టింగ్ ఎడిటర్‌గా రోజూ చచ్చిబతికే పరిస్థితులుండే చైనాలో సైతం ఎడిటర్గా పనిచేయడానికి నాలుగేళ్ల క్రితమే సిద్దపడి వచ్చిన క్యారీ గ్రేసీ చివరికి మనసు చంపుకుని మాత్రం ఆ హెూదాలో పనిచేయలేకపోయారు. చైనాలో నిక్కచ్చి ఎడిటర్‌గా పని చేయడం నిత్యం డ్రాగన్లతో పోరాటమే. పాలకుల బెరింపులు ఉంటాయి. పోలీసుల వేధింపులు ఉంటాయి. ఎడిటరే స్వయంగా రిపోర్టింగ్‌కి వెళతేనేగానీ సమాచారం సేకరించలేనంత గుంభనంగా, పకడ్బందీగా చైనా యంత్రాంగం ఉంటుంది. ఆ కష్టాలేవీ ఇప్పుడు రాజీనామా చేశాక గ్రేసీ ఏకరువు పెట్టడం లేదు.

"చీకటి మీద వెలుగును ఫోకస్ చేసే గొప్ప వృత్తిలో ఉన్నప్పుడు మన దగ్గర చీకటిని చూడలేకపోతే సమాజాన్ని వేలెత్తి చూపే నైతిక హక్కు మనకు ఎలా ఉంటుంది?" అని గ్రేసీ ప్రశ్నిస్తున్నారు. నిజాలు దాస్తుందని చైనాకు పేరు. ఎడిటర్‌గా ఇంతకాలం ఉన్న గేసీ ఆ నిజాలను బయటకు రప్పించారు. బీబీసికి జీతాలను దాచే అలవాటుందని తెలిశాక ఆమె బయటకు వచ్చారు. క్యారీ గ్రేసీ బయటకు రావడం అంటే అసమానతలను బయటకు తేవడమే! ఇవన్నీ ప్రపంచవ్యాప్త స్త్రీ సాధికారత వెలుగులు.

ఆధ్యాత్మికత, దేశభక్తి, మహిళల భద్రత ఇలా ఎన్నో అంశాలపై గజల్స్ రాసి ఆలపిస్తున్న కేసిరాజు శ్రీనివాస్ అలియాస్ గజల్ శ్రీనివాస్ లైంగిక వేధింపుల కేసులో అరెస్టయ్యాడు. తాను బ్రాండ్ అంబాసిడర్ గా పనిచేస్తున్న సంస్థలోని ఉద్యోగినినే వేధించాడు. బాధితురాలు పక్కా సాక్ష్యాలతో పోలీసులకు ఫిర్యాదు చేయడంతో ఆయన బాగోతం బయటపడింది. పలుకుబడి ఉన్న వ్యక్తులకు భయపడి లైంగిక వేధింపులను పెదవి బిగించి ఓర్చుకుంటున్న

స్త్రీలు ఎందరో. వారందరికి ఆమె ఆదర్శం. అంతేకాదు ఓ చిరు ఉద్యోగిని అయినా, మరో స్త్రీ ప్రలోభపెట్టినా, బెదిరింపులు ఎదురైనా కీచకుడికి బుద్ధి చెప్పడం కోసం స్టింగ్ ఆపరేషన్ చేసి మరి తన ఆత్మగౌరవాన్ని నిలుపుకుని నిలబడిన ఆమె నిజమైన స్త్రీ శక్తి సాక్షాత్కారమే. ఈ ఉదంతంలో ఇద్దరు స్త్రీలున్నారు. పలుకుబడి, వెనుక అండ గమనిస్తే ఇద్దరూ బలహీనులే. ఒకరు పార్వతి, మరొకరు బాధితురాలు. పార్వతి లొంగిపోవడంతో ఆ మాదిరే బాధితురాలిని కూడా సహకరించాలని వేధించాడు అతను. లేదంటే ఉద్యోగం నుండి తీసేస్తానని, ఎక్స్‌పీరియన్స్ సర్టిఫికేట్ ఇవ్వకపోవడంతోపాటు మరెక్కడా ఉద్యోగం రాకుండా చేస్తానని బెదిరించేవాడు. పార్వతి సైతం అతనికి అనుకూలంగా వ్యవహరిస్తూ బాధతురాలిపై అనేకసార్లు ఒత్తిడి తీసుకువచ్చింది. "నేను చేస్తున్నట్లే సార్‌కు చెయ్యి. అప్పుడే మంచి జీతంతోపాటు సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగం ఇప్పిస్తాడు. ఆయన చాలా పెద్దోడు. నాకు చేసినట్లే నీకు పెళ్లి కూడా చేస్తాడు" అని పార్వతి కూడా బాధితురాలపై ఒత్తిడి తీసుకువచ్చేది. ఈ వేధింపులు తారాస్థాయికి చేరడంతో అనేకసార్లు తిరస్కరించిన బాధితురాలు కొన్ని సందర్భాలలో పార్వతితో కలిసి రెండుమూడు గంటల పాటు అతని కాళ్లు నొక్కేది.. దీంతో మరింత రెచ్చిపోయిన ఆ కీచకుడు ఆ గదిలో నగ్నంగా, అర్ధనగ్నంగా ఉండి బాధితురాలిని పార్వతి ద్వారా పిలిపించుకునేవాడు. ఆమెను బలవంతంగా ఆలింగనం చేసుకోవడం, చేతులతో అభ్యంతరకరంగా తడమటం చేసేవాడు. వీటిని భరించలేక బాధితురాలు హెచ్చరిస్తే బెదిరింపులకు దిగేవాడు. ఫోన్ ద్వారా, వాట్సాప్ చాటింగ్ ద్వారానూ హింసించేవాడు. ఇన్ని ఓర్పుగా భరిస్తూనే ఆ కీచకుడు బెడ్‌రూమ్‌గా వినియోగిస్తున్న రూమ్‌లో రహస్య కెమెరాలు ఏర్పాటే చేసింది. ఇందులో అతని రాసలీలలు రికార్డయ్యాయి. బాధితురాలి దృక్కోణం నుండి చూస్తే నిజంగా స్త్రీ ఎంత ధైర్యంగా తెలివితో సమస్యను పరిష్కరించుకోవచ్చో, ఇటువంటి దుర్మార్గులకు ఎలా బుద్ధి చెప్పవచ్చో అర్ధమవుతుంది. ముందు చెప్పి, తరువాత హెచ్చరించి, ఆ తరువాత ఆ కీచకుడి కుటుంబ సభ్యుల దృష్టికి కూడా తీసుకువెళ్లి ఆ తరువాత స్టింగ్ ఆపరేషన్ చేపట్టిన ఆమె ధైర్యం.. క్యారీగ్రేసీ లాంటి అంతర్జాతీయ స్త్రీ శక్తి తాసులో నిలబడుతుంది. ఏది ఏమైనా 'టైమ్ ఈజ్ అప్' మూవ్‌మెంట్ ఓ పక్క, క్యారీ గ్రేసీ నిరసన ఇంకోపక్క; గతి తప్పిన గజల్‌కు గుణపాఠం నేర్పిన ధీరవనితతో ఇటు భారతదేశం మొత్తానికి అంతర్జాతీయంగా 'స్త్రీ' శక్తి స్వరూపిణిగా మారి, తనను తానే కాపాడుకునే కోణం వచ్చింది అనుకుంటా!



# ఆత్మగౌరవాన్ని అంతమొందించే పోరాటాలెందుకు?

శ్రీరెడ్డి మొన్నటి ఆవేశం, నిన్నటి చర్య, నేటి అమర్యాద! సమస్య కోసం ఉద్యమించిన ఎందరో నాయకులు, నారీమణులు మనందరికి సుపరిచితమే. సమస్య వ్యక్తిగతమైనప్పుడు నాయకత్వ లక్షణాలు ప్రదర్శించాల్సిన అవసరం లేదు. అది వ్యక్తి ఇష్టాలకు, అభిప్రాయాలకు, స్వేచ్ఛకు మాత్రమే పరిమితమైన అంశం అవుతుంది. దాని ప్రభావం గురించి కూడా పట్టించుకోవాల్సిన అవసరం కూడా అంతగా ఉండదు. కానీ సమస్య సమాజంలోని ఓ వర్గాన్ని ప్రతిబింబించేది అయినప్పుడు ఆ వర్గ ఆత్మగౌరవాన్ని నిలబెట్టాల్సిన బాధ్యత నాయకులపై పడుతుంది. తెలుగమ్మాయిల ఆత్మగౌరవాన్ని, ఉనికిని నిలపడానికే తను ఉద్యమిస్తున్నానని, తనకి ఈ విషయంలో రాణి రుద్రమదేవి, లక్ష్మీబాయిలే ఆదర్శం అంటూ నినదించిన శ్రీరెడ్డి తన అర్ధనగ్న ప్రదర్శనతో నటనలోకి అడుగుపెట్టాలనుకునే తెలుగమ్మాయిలకు ఇచ్చే సందేశం ఏమిటి? కాస్టింగ్ కౌచ్ అనే అంశాన్ని వ్యతిరేకించి అవకాశాల కోసం దేనికైనా సిద్ధం అని వీడియోల ద్వారా తెలపడం ద్వంద్వప్రవృత్తికి నిదర్శనం కాదా? పోటీ ఉన్న చోట సమానత్వం అన్న ప్రశ్నకు అర్ధం లేదు. బిజినెస్‌లో లాభం గురించి ఆలోచిస్తారు తప్ప తక్కినవి కావు. ఇక్కడ ప్రతిభ, నటన, ప్రేక్షకుల ఆదరణ

మాత్రమే కొలమానాలు. సౌందర్యం వాటిలో ఓ పాత్ర పోషిస్తుంది అంతే. అయేషా టకీయా (సూపర్ సినిమా కథానాయిక), అమృతరావ్ . (అతిథి కథానాయక), బిపాషాబసు (టక్కరిదొంగ నాయిక) ఇలా ఎంతోమంది నాయికలు మన ప్రాంతంవారు కాకపోయినా అందం ఉన్నప్పటికీ, ప్రేక్షకుల ఆదర్శన లేదని వెంటనే గ్రహించి తమకు సరిపడే తెరను ఎన్నుకున్నారు. కోట్ల మీద సాగే బిజినెస్ సినిమా. ఇక్కడ ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, హీరోల ఇష్టం కన్నా ప్రేక్షకుల ఆదరణకే ఓటు. ప్రేక్షకుల మెప్పు, ఆదరణ పొందాలంటే ఎటువంటి పాత్రలను ఎంచుకోవాలి? ఇమేజ్‌ను ఎలా నిలబెట్టుకోవాలి? అన్నది నటుల విజ్ఞతకు సంబంధించిన అంశం. ప్రేక్షకుల ఆదరణ 'స్కిన్‌షోతో వచ్చేది కాదు. అదే నిజమైతే పోర్న్ ఒక్కటే థియేటర్లలో దర్శనం ఇవ్వాలి, అసభ్యంగా ఉన్న సినిమాలు విజయవంతమైన దాఖలాలు సినిమా ఇండస్ట్రీలో అరుదు. తెర వెనుక జరిగే భాగోతాలు అసభ్యకరమైనవే అయి ఉండవచ్చు. కానీ వాటిని ఎదుర్కోవాల్సిన ఆయుధం తిరిగి దాన్ని ప్రోత్సహించడమే అయితే ఆ పోరాటానికి అర్థం ఏముంది?

స్త్రీ ఆత్మగౌరవం నిలబడాలి అని పోరాటం చేస్తూ బహిరంగంగా స్త్రీ శరీర గౌరవాన్ని అంగటి బొమ్మలా ప్రదర్శించడం అన్నది అదే ఆత్మగౌరవాన్ని అంతమొందించదా? శ్రీరెడ్డి పోరాటంపై స్పందించి కొంతమంది డైరెక్టర్లు ఆమెకు చేయూతను ఇస్తానని ముందుకు వచ్చిన వారిని పట్టించుకోకుండా తన స్వార్థపూరిత కోరికలు నెరవేర్చుకోవడం కోసం తనొక్కతే తనకు తోచిన పద్ధతిలో సాగడం ఎంతవరకు సమర్థనీయం? తన దగ్గర ఆధారాలున్నాయంటూ యూట్యూబ్‌లో ఆమె పెట్టిన వాట్సప్ ఛాటింగ్స్‌లో ఎక్కడ కూడా ఆమె ఎదుటివారి ఉద్దేశ్యాలను వ్యతిరేకించిన దాఖలాలే లేవు. అటువంటప్పుడు అవి పరస్పర ఇష్టం కిందకి వస్తాయి కానీ వేధింపులు ఎందుకు అవుతాయి? సినీరంగం అన్నది ప్రభుత్వ కొలువు కాదు. రిజర్వేషన్ ఉండడానికి, మన హక్కుల గురించి మాట్లాడేటప్పుడు బాధ్యతల గురించి ఆలోచించాల్సిన బాధ్యత కూడా మనదే. తెలుగు సినిమాల్లో తెలుగు వారికే అవకాశాలు హక్కుండాలి అనేది నినాదం అయితే, ఒక్క తెలుగు పరిశ్రమలోనే నటిస్తాం అనే వ్యక్తిగత బాధ్యతను తీసుకోవాల్సింది నటులే. అవకాశాల పరంగా పరిశ్రమలు మారే దృక్పధాన్ని ప్రదర్శిస్తూ, వ్యక్తిగత నైతిక బాధ్యతలను విమర్శిస్తూ కేవలం హక్కుల గురించే

మాట్లాడటమేనా నిజమైన పోరాట స్ఫూర్తి? అంశం మీద స్పష్టత లేకుండా, పబ్లిసిటీ స్టంట్లతో కొనసాగితే సమస్యలు పరిష్కరించబడతాయి, సినిమాల్లో అవకాశాలు వస్తాయనుకుంటే నేడు సినిమా ఇండస్ట్రీలో ఎంతో మంది రచయితలు, ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, నటులు సంవత్సరాల తరబడి బ్రేక్ కోసం ఎదురుచూస్తూ శ్రమించాల్సిన అవసరం లేదు. అన్ని రంగాల్లో ఉండే వ్యక్తిగత సౌలభ్యం సినిమా రంగంలో ఉండదు అన్న వాస్తవాన్ని అంగీకరించాలి. వ్యక్తిగత ప్రతిభ ఆధారిత స్థానం సినీరంగంలో ఉండదు. ప్రేక్షకుల ఆదరణే నిర్ణయాలకు గీటురాయి. నేటి శ్రీరెడ్డి ఉద్యమం తెలుగమ్మాయిలకు సినిమా అవకాశాలు రావడం లేదనో, తనకి అవకాశాలు రావడం లేదనో, లేక టాప్ హీరోయిన్స్ కు అవకాశాలు వచ్చాయనో ఉక్రోషం వలనో, లేక తన 'మా మెంబర్షిప్' కోసమో, లేక బ్లాక్ మెయిలింగ్ వ్యూహమో..ఆమె వేసే ప్రతి అడుగు సందిగ్ధతను, విశృంఖలత్వాన్ని రూపొందించేలా ఉన్నాయే తప్ప సమస్యను పరిష్కరించే నాయకురాలైన నారీమణి లక్షణాలు మాత్రం మనకు ఎక్కడా కనపడవు. స్త్రీ ఆత్మగౌరవం ఆమె సమస్యల్ని పరిష్కరించుకునే ధైర్యంలో ఉంటుంది తప్ప దిగజారుడుతనంలో ఉండదు. అటువంటి స్త్రీశక్తి అతి త్వరలోనే గళం విప్పాలని ఆశిద్దాం.



# సంకుచితత్వం తృంచి... సమిష్టినే పెంచి

సమానత్వాన్ని ఒక పదంలో నిర్వచించాలంటే 'సంతోషం' మానవ పరిణామక్రమం నిర్మాణాత్మకంగా ప్రగతిపథంలో ముందుకు సాగాలంటే స్త్రీ, పురుషులిద్దరూ బాధ్యతలో సగభాగాన్ని పంచుకుంటూ అదే వారసత్వాన్ని ముందు తరాల వారికి అందివ్వాలి. 'వ్యక్తిగత సమానత్వం' అనే అంశాన్ని ప్రశ్నించేముందు సమిష్టి సమానత్వం' గురించి లోతుగా ఆలోచించాలి. "ఎందుకంటే సమాజం నీడ కింద ఏర్పడిన కుటుంబ వ్యవస్థ వ్యక్తిగతమైనది కాదు ఓ సమిష్టి వ్యవస్థలో ఉంటూ వ్యక్తిగతంగా మాత్రమే ఆలోచించడం సంకుచిత్వధోరణి. స్త్రీ సమానత్వం అనగానే నేడు స్త్రీల మీద జరుగుతున్న అత్యాచారాలు గుర్తుకొస్తాయి. అవే దాడులు పురుషుల మీద స్త్రీలు చేయడం లేదు కదా! దీనంతటికి కారణం పురుషులతో సమంగా స్త్రీని చూడకపోవడమే అనే ఓ రకమైన ధోరణి అస్పష్టంగా మనసులో ఏర్పడుతుంది. కానీ కాస్త పరిశీలించి చూస్తే నాణేనికి రెండువైపులు బొమ్మే ఉండాలంటే కుదిరే అంశం కాదు. బాధ కూడా సంతోషానికి ఓ పరిణామక్రమమే. కాకపోతే ఆ పరిణామం 'ఓ సమస్యకు పరిష్కారం వెతికే క్రమంలో ఇంకో సమస్యను కొని తెచ్చుకునే అస్పష్టమైన ఉద్విగ్నత నుండి జనిస్తుంది.' మానసిక శాస్త్రం లేదా తత్వశాస్త్రం

దేని ప్రకారం చూసినా ఓ మనిషిలో ఎదుటి వ్యక్తిని బాధ పెట్టి సంతోషపడాలనే పైశాచిక నైజం ఎందుకు అలవడుతుంది? సంతోషం విషయంలో అసంతృప్తి ఏర్పడటం వల్లే కదా! ఇంకా సింపుల్ గా చెప్పాలంటే అందరూ సంతోషంగా ఉంటే ఏ విధమైన ఘోరాలు జరగవు కదా! ప్రపంచంలో సమస్య ఏదైనా సంతోషమే నిజమైన అత్యుత్తమ పరిష్కారం. ఇప్పటికి 21వ శతాబ్దంలో కూడా 'సమానత్వవాదం' పరిపూర్ణరూపంగా పరిపుష్టం అవ్వకపోవడానికి కారణం ఈ వ్యక్తిగత సమష్టి కోణాల మధ్య ఏర్పడే అస్పష్టత, అసమతుల్యత, దీనివలన ప్రపంచంలో ఒంటరితనాన్ని ఏకాంతంగా మలచుకొని యోగులుగా మారి ప్రపంచాన్ని ప్రభావితం చేసినవారు కూడా కుటుంబ వ్యవస్థలో భాగమై, బాధ్యతలు నిర్వర్తించాకే ఏకాంత దర్శనంలోకి ప్రవేశించారు. అలా మారిన తర్వాత కూడా వారు సమిష్టి విలువల్ని ప్రోత్సహించే విధంగానే సమైక్యత, సమానత్వం ఉండాలనే ఆత్మను కలిగి ఉన్నారు వారు. ఓ ఆత్మీయస్పర్శకు, వెన్ను తట్టి ముందుకు నడిపించే ప్రోత్సాహానికి, మనఃస్పూర్తిగా పెదాలపై విరిసిన చిరునవ్వుకు, ఎదుటివారు గెలుపును అసూయతో కాకుండా ప్రశంసాస్పూర్తిగా చూసే దృక్పధానికి నోచుకున్నవారు ఎంతమంది ఉన్నారు? ఇవన్నీ కుటుంబ వ్యవస్థలో లోపించినపుడు మనుషుల ఆలోచనాశైలి ఏ రీతిలో సాగుతుంది? గట్టిగా చెప్పాలంటే ఇవన్నీ మన చుట్టూరా ఉన్నవారికి, మిత్రులకు, కుటుంబానికి మనం ఎక్కడ ఉంటే అక్కడ వెల్లివిరిసేలా చేయడమే సమానత్వమంటే! సమానత్వం అంటే మనమంతా ఒకే కుటుంబం' అనే సంఘీభావం. సమానత్వం అనేది ఇంత విస్తృత పరిధి ఉన్న అంశం. అయినప్పుడు దానిని వ్యక్తికో, ఓ వ్యక్తిగత అంశానికో పరిమితం చేయడం అనేది పరిష్కారానికి బహుదూరంగా నిలబెట్టే భావజాలానికి దారితీస్తుంది. అక్కడ సమిష్టి సంతోషం. అనే అంశానికి బహుదూరం నిలబడి ఓ వ్యక్తి గురించో, ఓ అంశం గురించో మాత్రమే ఆలోచించే కింది మెట్టులో ఉంటాం. అమ్మ, నాన్న, నాయనమ్మ, తాతయ్య, పిల్లలు ఇందరూ కలిస్తేనే కుటుంబం. అదే ఇప్పుడు అమ్మ, నాన్న, పిల్లలకు కుదించబడింది. అంటే దానర్థం అమ్మ, నాన్నల బాధ్యత పెరిగింది అని. కానీ ఇంటా, బయట అన్ని బాధ్యతలు నిర్వర్తించలేక కొన్ని కొత్త విలువలను వెలుగులోకి తెచ్చారు. పుస్తకాలు, ప్లేస్కూలు, గాడ్జెట్లు ఇవే కుటుంబ మాధుర్యాన్ని ఆస్వాదించడానికి పిల్లలకు ఇవ్వబడిన ప్రత్యామ్నాయాలు. మనుషులతో మెలిగితేనే కదా మానవ స్పర్శ తెలిసేది. అప్పుడే కదా మానసిక ప్రజ్ఞ, మానవ సంబంధాలు, ఎదుటివారి

మనసు నొప్పించకుండా మెలగడం, ఏదీ తప్పు? ఏదీ ఒప్పు? వంటి విషయాలు తెలిసేవి. మీరే ప్రాణం లేని వస్తువులతో కాలం గడుపుతున్నప్పుడు నిజంగా ప్రాణమున్న మనుషులుగా, స్పందించాలని ఆశించడం ఎంతవరకు సబబు? విత్తు ఒకటైతే ఫలం ఇంకోటి ఎలా వస్తుంది? ఆ విషమ ఫలమే సమాజంలో చీడపురుగుగా మారి దాష్టీకాలకు కారణం అవుతుంది. మూలాన్ని ఖండించడం మాని బాధితులైనవారు బాధను పోగొట్టుకునే క్రమంలో ఇంకొకరికి బాధను కలిగిస్తుంటే వారినే తప్పు పడుతూ పోతే, ఈ పరంపర ఎక్కడ ఆగుతుంది? సమానత్వం అంటే సమానంగా డబ్బు సంపాదించడం కాదు, సమానమైన హోదాలు కలిగి ఉండటం కాదు. నిజమైన సమానత్వం అంటే మన తదుపరి తరానికి 'సంతోషమనే' విలువలతో సమాజానికి అందించడం. దానికయ్యే శ్రమలో సమభాగం బాధ్యత తీసుకోవడం. డబ్బుతోనో, హోదాతోనో మాత్రమే సమానత్వ ఉనికిని నిలుపుకోవాలంటే అది ఎంతకాలం నిలబడుతుంది? మనల్ని వ్యక్తిగా గౌరవించలేని వారు మనం చంద్రుని మీదకు వెళ్లి వచ్చినా సత్కరించరు. అటువంటివారి గుర్తింపు కోసం ఓ ముసుగులో బతకడం దండగ. జీవితాన్ని సమగ్రచిత్రంగా చూడటం ప్రధానమైన అంశం. ఆ సమగ్రచిత్రంలో ఒక వ్యక్తి కాదు ఉండేది, ఓ తరం, ఓ సమాజం, ఓ దేశం. సమిష్టి సంతోషమే ధ్యేయంగా ముందుకు సాగుతున్న క్రమంలో ఎక్కడైనా వ్యక్తిగత వివక్ష తలెత్తితే అప్పుడు అందరూ సమిష్టిగా ఆ సమస్యకై నిలబడి పరిష్కారాన్ని సాధించడం ఉత్తమం. అంతే కానీ సమిష్టిగా సంతోషాన్ని, విలువల్ని పక్కన పెట్టేసి అదే సమిష్టి సమాజంలో బతుకుతూ కేవలం వ్యక్తిపరమైన సంకుచిత పోరాటాలు చేయడం దీర్ఘకాలంలో మానవహృదయ చిత్రాన్ని పూర్తిగా తల్లకిందులు చేస్తాయి. ఓ గొప్ప ఆశయం ఫలించాలంటే –

ఎందరో శ్రమించాలి. ఎన్నో త్యాగాలకు సిద్దం కూడా కావాలి. కానీ ఆ 'ఆశయం ఆత్మ' ఏమిటి అనే స్పష్టత లేకుండా ఆవేశపూరిత విన్యాసాలు ఎన్ని చేసినా అది నిజమైన ప్రభావాన్ని ఎవరి పైనా చూపదు. ఓ వాదం అది సమానత్వమే కాదు అది ఏదైనా సరే వెలుగులోకి వచ్చినపుడు అందరూ దాన్ని ఆమోదించకపోయినా కనీసం దాని గురించి ఆలోచింపజేసేలా ఉండాలి. అలా లేనప్పుడు సమాజాన్ని, సమిష్టి బాంధవ్యాన్ని వీడిన ముడి ఎక్కడో ఉందన్నమాటే! సమిష్టి సంతోషం, ధృఢపరిచే అనుబంధాలు, ఆత్మవిశ్వాసంతో సాగే ముందు తరాలు ప్రతీకలుగా సమానత్వం రెపరెపలాడాలని ఆశిద్దాం!



# అవగాహన లోపమే సమస్యలకు మూలం

సమస్య ఉన్న ప్రతిచోటా పరిష్కారం ఉంటుంది. స్త్రీలలో సమస్యలతో సతమతమయ్యే చాలామంది అవగాహనా, దూరదృష్టితో ఆలోచించలేకపోవడం వంటి వాటివల్లే ఎక్కువగా బాధితులు అవుతున్నారు. స్త్రీ మనసులో అస్పష్టంగా వుండే ఎన్నో ఆలోచనలకు, ప్రశ్నలకు అక్షర రూపాల్ని ఇచ్చిన రచయిత చలం. ఆయన రాసిన 'ఆర్గ్యుమెంటు' కథ ఆయన నిశిత పరిశీలనాశక్తికి తార్కాణం. అందులో అబార్షన్ ప్రయత్నపూర్వకంగా చేసిందనే అభియోగంపై ఓ స్త్రీపై కేసు పెడతారు. ఆ పాత్ర ద్వారా చలం సమాజాన్ని అడిగిన ప్రశ్నలు నిజంగానే హృదయాన్ని ద్రవించేలా చేస్తాయి. స్త్రీలు వేరు 'సంఘం' వేరు, స్త్రీ పట్ల ఈ రెండు విభిన్న ధోరణులు కలిగి ఉన్నాయి అని స్పష్టం చేయడమే ఈ కథ ఉద్దేశ్యం. జడ్జితో ఆమె వాదన ఇలా కొనసాగుతుంది. 'అవును, బిడ్డ పుట్టకుండా నేను గర్భం తీసేసుకున్నాను. అదెట్లా నేరమో చెప్పు? మీరు మరి–నేను మొదట చేసింది తప్పంటావా? అది నువ్వు చేస్తున్న పనే. భర్తలేనిది చేయడం తప్పంటావా? భర్త వుండి కడుపు వచ్చినా, కడుపు తీసుకోవడం నేరమేగా? అదిగాక కడుపు రాకుండా ఏం చేసినా తప్పు లేదూ? వస్తే మొదటి నుంచి అంతా తప్పే! కడుపు రావడం నా తప్పుకాదు కదా? పెళ్లానికి పిల్లలు పుట్టకపోతే

అది ఆమె తప్పుగా చూస్తే మీరు, నాకు కడుపు రావడం తప్పంటారా? గర్భం కలిగిన తర్వాత ఎందుకు తీసేసుకున్నావంటారు? నాకు అనేక కారణాలున్నాయి. నన్ను పోషించేవాడు వదిలేస్తాడు. ఎట్లా బ్రతకను? నాకింకేమీ కష్టం పని చేసుకుని బతకడం చేతకాదు. కూలి చేసుకోరాదా? వంట. చేసుకోరాదా అని సులభంగా అంటారు. అందమైన కూలీదాన్నిగాని, వంటదాన్నిగాని బతకనిస్తారా మొగాళ్ళు? ఇక్కడ ఉన్న వాళ్లందరూ అట్లాంటి మహానుభావులే. కోట్లూ, తలగుడ్డలు పెట్టుకుని వెకిలినవ్వులు కార్చుకుంటో, మీసాలు మెలేస్తో నావంక అతితీవ్రంగా చూస్తూ కూచుంటే సరా? మీ సంగతి ఎవరికి తెలీదు? మొగాళ్ళు బలవంతం చేస్తేనే నీతి ఏమయిందంటావు? తమకి లోబడకపోతే తమ పెళ్లాలతో సాడీలు చెప్పి పనిలోంచి తీసేయిస్తారు. ముందు మొగుళ్ల మీదనే చెప్పితే మొగుళ్లతో పోట్లాడినా, చివరికి ఆడవాళ్లు నన్ను పొమ్మంటారు మర్యాదగా? నేనూ బతకాలి, ఎందుకు  లోబడినా అందరూ తిట్టేవాళ్లే! మీ భార్యల్ని అట్లా గదుల్లో దాచుకోకుండా, కాన్పే లేకుండా, నాకు మల్లే వీధుల్లో పారెయ్యండి. వితంతువులు కాగానే ఏ బంధువుల ఇళ్లల్లోనో చాకిరీలకు దిలేస్తారే? అభిమానమున్నదాన్ని గనక ఆ నీచత్వం కన్నా ఈ స్వతంత్రమే నయమనుకున్నాను. గర్భం రాగానే ఆయన నన్ను వదిలేశాడు. ఆకలెక్కు వయింది. ఒంట్లో బాగా లేదు. మందులు కావాలి. ఏం చేయ్యను? మేము గుమ్మాల్లోకి వస్తే తరుముతారు. అవునా? పతివ్రతలు మీ భార్యలు, గుమ్మాలు కడుక్కుంటారు. మైలపడ్డామని నా నీడ తాకినచోట పాడ్జీలు చల్లీ శుద్ధిచేస్తారు. బిడ్డను కంటాననుకోండి. దాన్ని నువ్వు పెంచుతావయ్యా? పోనీ దాని పోషణకి ఖర్చు ఇస్తావా? శరణాలయాలున్నాయి, కానీ నీతియుక్తంగా కన్నపిల్లలకి తల్లిదండ్రులు చస్తే తీసుకుంటాయట ఆ శరణాలయాలు. వెధవ ముండాకొడుకు ఏడిస్తే ఎవరు ఓదారుస్తారు? నీ పిల్లలతో ఆడుకోనిస్తావా? నన్ను పోషించడమే మా ఆయనకి ఇంత కష్టంగా ఉంది. రోజుకి మూడుసార్లు పొమ్మంటారు. నేనైతే మండి చస్తాను. వాణ్ణి ఎట్లా చంపుకోను. వాడి బాధ చూడలేక వాణ్ణి ఏ బావిలోనే తోసి నేను చావాలి. పేపర్లో చదువుతారు. ఒక స్త్రీ పిల్లాడిని చంపి తాను చచ్చిందని, దీనికేం పుట్టిందని తిట్టుకుంటారు. పేపరు మడిచి దీపమార్పి పడుకుంటారు. మరి ఆ 'లా'ని ఏర్పరచిన వాళ్లు, మీరో మీ తాతలో, నాకు అవమానం కలుగకుండా నా బిడ్డకు అమర్యాద రాకుండా కాపాడతారా? ఆ సంగతి మీకేమీ తెలీదు. మీకు తెల్సిందల్లా నన్ను ఖైదులో పారెయ్యడమే. అవును నాకు వేరే గతిలేక ఆ దిక్కుమాలిన పిల్లకి

ప్రాణమిచ్చి ఏడిపించడానికి కాఠిన్యం తక్కువై, తల్లిని గనక యీ పని చేశాను. మీ అభ్యంతరమేమిటి? మొదటిది ప్రాణం తీశానన్నారు.

అది నాలో భాగమా వేరే ప్రాణమా? నాలో భాగం అయితే దాన్ని తీసేసుకుంటే మీకేం? వేరే ప్రాణమా? నాది కాదా? అయితే నా లోపల దాన్నెవరు ప్రవేశించమన్నారు. నా అనుమతి లేనిది లోపల ప్రవేశించి నన్ను బాధించమన్నదెవరు? మీ అనుజ్ఞలేకుండా మీ యింట్లోకి ఎవరన్నా వస్తే మీరేం చేస్తారు? అట్లానే నేనూ బైటికి తరిమేశాను.. చస్తే నేనేం చేయను? నేను రప్పించానా? లేదు. నాకు బిడ్డ పుట్టాలని యే మాత్రమూ లేదు. నాలోకి వచ్చి నా ఆరోగ్యం, నా సౌందర్యం చెడగొట్టి, నా మానం తీసేస్తే బాగానే వుందీ? నేనేందుకు దాన్ని కాపాడాలి? దాని కోసమా? అవును మీ కోసములాగే వుంది. మీరందరూ దాన్ని తిట్టి వెక్కిరించి మీ పతివ్రతల్ని మీ పిల్లల పవిత్రపు పుట్టుకల్ని సమర్థించుకునేందుకు. నా యిష్టం వచ్చిన మందు నేను. మింగుతాను. దాన్ని చావమన్నదెవరు? మీ పొట్టలో పాములు ఉంటే అవి చావడానికి బాగానే మందులు తాగుతారు. దానికసలు ప్రాణమున్నదని మీకెట్లా తెలుసును? భూమి మీద పడింది వూపిరన్నా నిలవదు. ప్రాణమున్నదని నీకేం తెలుసు? నువ్వెప్పుడైనా కడుపుతో వున్నావా? జడ్జి నీకేం తెలుసు? పుట్టిన బిడ్డ తిండిలేక మాడి చస్తే నీ ప్రాణం సుఖంగా ఉంటుందా? నీ కళ్లు చల్లగా వుంటాయా? మరి ప్రాణం తీసిన వారికి మరణశిక్ష కదా! అది వెయ్యరేం నాకు? అంటే పూర్తిగా మరో ప్రాణం కాదన్నమాట. అరప్రాణం, పావు ప్రాణం ఉంటుందా? అర ఆత్మ, పావు ఆత్మ వుంటాయా? నిండు ఆత్మలు మీకున్నాయా? వుంటే నన్నెందుకిట్లా యేడిపిస్తారు? మిమ్మల్ని చంపిన తప్పులేదు అయితే! కోడి గుడ్డుకి ఎన్నో వంతు ప్రాణం. గొర్రెకి వాటికి ఆత్మ వుందా లేదా? అట్లా చూస్తారే? నీకేం తెలుసునని కూచున్నావు నన్ను శిక్షిస్తానంటూ? నా ఆరోగ్యం చెడిపోతూ చెడిపోతుందంటారా? కాఫీ హోటల్లో చెడ తినేవారిని, పని భార్యలకోసం మందులు తినే ముసలివాళ్లనే దండించరేం? నలభైయేళ్లకే మూలశంకలూ, అతిమూత్రాలు తెచ్చుకునే జడ్జీలను దండించరేం? దిక్కుమాలినదాన్ని నేను దొరికానా? నా ఆరోగ్యం పోతే ఎవడికేం? నా ప్రాణం పోతే ఎవడికేం? దుర్మార్గంలోపడి ఇట్లా చచ్చినదానిని నన్ను చూసుకు సంతోషంతో కడుపు నింపుకుంటారు మీ భార్యలు. దీన్ని చంపినందుకు లోకంలో మనుషులు తక్కువ వుతారంటారా మీరందరూ? పుణ్యాత్ములు మీరున్నారు చాలదూ? కనకుండా వున్న ప్రతి ఆడదాన్ని శిక్షించండి, వితంతువులందర్ని కాల్పించండి

బలవంతంగా! మీ జనసంఖ్య పెరగడానికి ఇంకో జీవాన్ని నన్ను మోయమనడానికి మీరెవరు? సృష్టిసాగదంటారా? నాకేం? నేను సృష్టి సాగిస్తానని పూచీకత్తు నిచ్చానా? అసలు నన్ను కనవద్దని సంఘం ఆజ్ఞాపించిందిగా. 'లా' కనమంటోంది. కంటే సంఘం, కనకపోతే 'లా' శిక్షిస్తాయి. మరి సంఘమే 'లా'ని ఏర్పాటుచేసింది. సృష్టి నాలో ఇంకో జీవాన్ని పెట్టింది. దాన్ని తీసుకునే శక్తిని ఇచ్చింది. మధ్య మీకెందుకు? ఏమంటావు, నన్ను వదులుతావా? నీ ఉద్యోగం పోతుందని భయమా? నీ ఉద్యోగం కోసం నన్ను నిర్ధోషిని, శిక్షిస్తావా? ఇదేనా నీతి, ఇదేనా పుణ్యం, చెప్పు జవాబు.

ఈ కథాంశం 1922 పరిస్థితుల్లోది మారి సంస్కరణలు అయితే వచ్చి ఉండవచ్చు. కానీ ఆలోచనల్లో, సమాధానాల్లేని ప్రశ్నలతో సతమతమయ్యే వాతావరణం అయితే సమసిపోలేదు. దారుణంగా పెరిగిపోతున్న అత్యాచారాల ఉదంతాలు ఓవైపు, నమ్మి మోసపోతున్న కథలు ఇంకోవైపు.. ఆ సమస్య బాధ తీవ్రత కొన్ని రోజుల్లో తగ్గుతున్నట్టు అనిపించినా 'సంఘం' 'లా' ఓ పరిష్కారం వైపుకి తీసుకువెళ్లే దిశలో ఇంకాస్త బాధ తీవ్రతను పెంచుతూనే ఉన్నాయి. కాకపోతే ఇప్పుడు పరిస్థితులు మారాయి. ఎందుకంటే టెక్నాలజీ యుగం కదా! ఇప్పుడు అనుమానాలతో భర్తలు ఇంట్లోనే సిసి కెమెరాలు పెడుతున్న ఎన్నో సంఘటనలు వెలుగులోకి వస్తున్నాయి. ఒకప్పటి తాపీ ధర్మారావు, 'ఇనుప కచ్చడాల' పరిస్థితులు ప్రత్యక్షంగా కనబడకపోవచ్చు. కానీ పరోక్ష వేదన తీవ్రత మాత్రం ఒకటే. ఇటూ సంఘాన్ని అటూ నాయస్థానాల్ని ఎదుర్కొలేక చీకటిలో మగ్గిపోతున్న బాధితులెందరో! బాధితురాలికి దక్కే ఓదార్పు కన్నా హేళన, తిరస్కారభావాలే ఎక్కువ. ఒకవేళ ఇదే 'సమూలంగా మారి పోవాలన్నా 'స్త్రీ' ని 'శరీరం'గా కాక 'ఓ ఆలోచనల వ్యక్తి స్వరూపంగా చూడగలిగే మానసిక ప్రవృత్తి అందరిలోనూ అలవడాలి. ఈ ఆలోచన స్త్రీలలో కూడా అలవడాలి. బిడ్డగా ఉన్న నీ కోసం ఎన్నోమార్లు... ఎదిగిన తర్వాత సోదరుడివైన నీకై కరుగుతూ... ఊతమందించినా భర్తవైన నీ ఉన్నతి కోసం... నేలకైనా ఒదిగినంత మేరు పర్వతమంత... స్త్రీ ఔన్నత్య భావపరిమళం అందరి మెదడుల్లో పుష్పించే రోజు రావాలని ఆశిద్దాం!

**– భావరాజు పద్మిని (ఇంటి దేవత)**



# చట్టం కన్నా కట్టుదిట్టమైన అమలు ముఖ్యం

'లింగ సమానత్వం కేవలం లక్ష్యం మాత్రమే కాదు.. సమాజంలోని యావత్ సమస్యల పరిష్కారానికి అదొక ముందు షరతు' –కోఫీ అన్నన్, ఐక్యరాజ్యసమితి మాజీ ప్రధాన కార్యదర్శి.

ముస్లిం మహిళలపై వివక్ష చూపుతున్న తలాక్ పద్ధతి చెల్లుబాటు కాదని సుప్రీంకోర్టు తీర్పునిచ్చి నాలుగు నెలలు కావొస్తుంది. ఈ విషయంలో ముసాయిదా బిల్లును సిద్ధం చేసింది. కేంద్ర మంత్రివర్గం డిసెంబరు 15న ఆమోదించిన ఆ బిల్లును ప్రస్తుత పార్లమెంటు శీతాకాల సమావేశాల్లో ప్రవేశపెట్టబోతున్నట్టు కేంద్ర న్యాయశాఖమంత్రి రవిశంకర్ ప్రసాద్ చెప్పారు. మన రాజ్యాంగం పౌరులందరినీ సమానంగా చూడాలని,. కుల, మత, లింగ ప్రాతిపదికగానే..వుట్టిన ప్రాంతాన్ని బట్టిగానీ వివక్ష చూపరాదని చెబుతోంది. అయినా ఏదో రూపంలో అన్నింటా ఇలాంటి వివక్ష కొనసాగుతూనే ఉంది. మహిళల పట్ల ఇది మరింత ఎక్కువగా ఉంటోంది. ముస్లింలలో కొద్దిమందే ఆచరిస్తూ ఉండొచ్చుగానీ, మూడుసార్లు . తలాక్ చెప్పడం ద్వారా విడాకులిచ్చే విధానం మనదేశంలో అమలు . చేస్తున్నవారు, అందువల్ల ఇబ్బంది పడుతున్న

మహిళలు ఉన్నారు. అలాంటి మహిళలు అయిదుగురు సుప్రీంకోర్టును ఆశ్రయించబట్టే ఆ విధానం చెల్లుబాటు కాదని సర్వోన్నత న్యాయస్థానం తీర్పునిచ్చింది. తలాక్‌కు సంబంధించి అమలులో ఉన్న నిర్దిష్ట విధానాలను కూడా తోసిరాజని ఇష్టానుసారం అమలు చేయడం కూడా పెరిగింది. ఫోన్, ఎస్ఎంఎస్, వాట్సాప్, మాధ్యమాల ద్వారా చెప్పేవరకూ వెళ్లింది. తలాక్ విధానం చెల్లదని మొన్న ఆగస్టులో 3–2 మెజారిటీతో అయిదుగురు సభ్యుల బెంచ్ తీర్పు ఇచ్చినప్పుడు అప్పటి చీఫ్ జస్టిస్ ఖేహార్, మరో న్యాయమూర్తి జస్టిస్ అబ్దుల్ నజీర్లు దాంతో ఏకీభవించకుండా 1,400 ఏళ్ల నుండి అమలవుతున్న విధానంలో జోక్యం చేసుకోవడం మతపరమైన స్వేచ్ఛకు హానీ కలుగుతుందని రాజ్యాంగంలోని 25(1) అధికరణకు విరుద్ధమని అభిప్రాయపడ్డారు. పెళ్లనేది ఇద్దరి జీవితాలతోపాటు రెండు కుటుంబాలను ఏకం చేసే వ్యవస్థ. పెళ్లంటే ఆడామగా మధ్య ఏర్పడే భార్యాభర్తల సంబంధం మాత్రమే కాదు. విస్తృతార్థంలో ఇద్దరూ కలిసి ఉమ్మడిగా పౌరసమాజం పట్ల నెరవేర్చవలసిన బాధ్యత. సమాజంలో స్త్రీ, పురుష సమానత్వం లేనప్పుడు అది వివాహ వ్యవస్థలోనూ ప్రతిఫలిస్తుంది. వివక్ష ఆధిపత్య ధోరణులు సంసారాల్లోకి జొరబడతాయి. అత్యధిక సందర్భాల్లో మహిళలనే బాధితులుగా మారుస్తాయి. రాజ్యాంగమైనా, చట్టాలైనా ఇలాంటి వివక్షనూ, ఆధిపత్య ధోరణులనూ అంగీకరించవు. మన చట్టాలు భిన్న మతాలకంటే వైయుక్తిక చట్టాలను (పర్సనల్ లా) గుర్తించాయి. కానీ అవి రాజ్యాంగం నిర్వచించిన చట్టాలు నిర్దేశించిన నిబంధనలకు లోబడి మాత్రమే అమలు కావాలన్నది తలాక్ విధానంపై వెలువడిన మెజారిటీ తీర్పు భావన. అయితే ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం తీసుకురాదల్చుకున్న చట్టం ఆ భావనకు అనుగుణంగా ఉంటుందా? ఈ పిటిషన్ పై మీ అభిప్రాయమేమిటని సుప్రీంకోర్టు ప్రశ్నించినప్పుడు లింగ సమానత్వాన్ని, మహిళల గౌరవాన్ని దెబ్బతీసే ఆచారాలు రాజ్యాంగ విరుద్ధమని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. దానికి లోబడి చట్టం తీసుకురాదల్చుకుంటే తలాక్ ద్వారా వివాహబంధాన్ని రద్దు చేసుకోవడం చెల్లుబాటు కాదని ప్రకటిస్తే సరిపోతుంది. కానీ ఇప్పుడు కేంద్రప్రభుత్వం ఇంకొంచెం ముందుకెళ్లింది. దాన్ని శిక్షార్హమైన నేరంగా పరిగణిస్తూ బిల్లును రూపొందించింది. ముస్లిం మహిళల వివాహ హక్కుల పరిరక్షణ బిల్లులోని అంశాలేమిటన్నది మంత్రి శివశంకర్ ప్రసాద్ వివరంగా చెప్పకపోయినా ఎలాంటి ముందస్తు సమాచారమూ లేకుండా అకస్మాత్తుగా

మూడుసార్లు తలాక్ చెప్పడం 'చట్టవిరుద్ధం, చెల్లుబాటుకానిది' అని బిల్లు నిర్దేశిస్తున్నట్టు వివరించారు. దీన్ని ఆచరిస్తే మూడేళ్లు జైలుశిక్ష, జరిమానా ఉంటాయని అన్నారు. తలాక్ చెల్లదని సుప్రీంకోర్టు చెప్పాక దానికింద విడాకులివ్వడం భర్తలకు సాధ్యం కాదు. పెళ్లనేది భార్యభర్తల మధ్య ఏర్పడే సివిల్ ఒప్పందం. తాజా తీర్పు తర్వాత ఆ ఒప్పందాన్ని ఉల్లంఘించడం భర్తకు సాధ్యం కాదు. అలా చేస్తే దాంపత్య హక్కుల్ని పరిరక్షించుకోవడానికి భార్య న్యాయస్థానాన్ని ఆశ్రయించవచ్చు. తలాక్ మాటున భార్యను వేధించినా, హింసించినా, ఆమెకున్న హక్కుల్ని కాలరాసినా అది గృహహింస చట్టం పరిధిలోకొస్తుంది. ఇలాంటి అవకాశాలున్నప్పుడు మూడుసార్లు తలాక్ చెప్పడాన్ని దానికదే శిక్షార్హమైన నేరమనడం ఎంతవరకు సబబు? ఇందువల్ల రాజీ మార్గాలు మూసుకుపోవా? దాన్ని శిక్షార్హమైన నేరంగా మార్చి, భర్తను జైలుకు పంపితే ఆ భార్యాభర్తలు మళ్లీ కలిసే అవకాశం ఉంటుందా? విడిపోవడానికి సిద్ధపడిన మహిళకు సైతం ఇలాంటి పరిణామాలు ప్రశాంతతనిస్తాయా? సుప్రీంకోర్టు కూడా శిక్షార్హమైన నేరంగా పరిగణించాలని సూచించలేదు. అయితే ఆ తీర్పు వెలువడ్డాక ఇంతవరకూ ఇలాంటి 67 కేసులు తన దృష్టికొచ్చాయని కేంద్రం అంటున్నది. తీర్పు వెలువడినాకో, చట్టం చేసినా వెనువెంటనే అందరికీ వాటిపై అవగాహన ఏర్పడుతుందనుకోవడం సరికాదు. అందుకు సమయం పడుతుంది. అఖిల భారత ముస్లిం పర్సనల్ లాబోర్డు (ఏఐఎంపీఎల్‌బీ) అకస్మాత్తుగా విడాకులిచ్చే పద్ధతికి వ్యతిరేకంగా మొన్న ఏప్రిల్‌లో తీర్మానం చేసింది. ఈ విధానాన్ని పాటించేవారిపై సాంఘిక బహిష్కరణ అమలుచేయాలని పిలుపు నిచ్చింది. అటువంటి సంస్థలు, ముస్లిం వర్గాల్లో పలుకుబడిగల ప్రముఖుల సాయంతో తాజా తీర్పుపై అందరిలో అవగాహన కల్పించడానికి ప్రభుత్వం ప్రయత్నించాలి. ఆ ప్రయత్నాల అనంతరం పరిస్థితులేమిటో సమీక్షించి బాధిత మహిళలతో, మహిళా హక్కుల సంఘాలతో, మత సంస్థలతో చర్చించి బిల్లు రూపొందించి ఉంటే బావుండేది. నిర్భయ ఉదంతం తర్వాత ఏర్పాటైన జస్టిస్ జేఎస్ వర్మ కమిటీ పని చేసిన తీరును ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. బిల్లుపై పార్లమెంటులో ఎటూ చర్చ ఉంటుంది. కానీ అంతకన్నా ముందు భిన్నవర్గాలతో మాట్లాడితే ప్రభుత్వానికి ఈ సమస్యపై మరింత స్పష్టత ఏర్పడేది. న్యాయం కలుగజేయాలన్న ఆత్రుత మంచిదే. కానీ ఆ ఆత్రుతలో మౌలిక ఉద్దేశమే దెబ్బ తినకూడదు.



# మెరిసే తారలు

స్త్రీకి సినిమాకు ఉన్న సంబంధం జీవన్మరణ యుద్ధం లాంటిది. ప్రతి ఒక్కరికి తమ వృత్తిలో అంచెలంచెలుగా ఎదగాలని ఉంటుంది. గ్లామర్ రంగం అందుకు మినహాయింపు ఏమీ కాదు. సినిమాకు, మిగిలిన వృత్తులకు ఓ కొట్టొచ్చే తేడా ఉంది. ప్రతి వృత్తిలోనూ మేధస్సు, సామర్థ్యాల ఆధారంగా ఎదుగుదల ఉంటుంది. కానీ సినిమాలో మాత్రం మేని మెరుపులే ప్రామాణికం. బాల్యం, కౌమారం, యవ్వనం, వృద్ధాప్యం. ఈ దశలు ప్రతి వ్యక్తి అనుభూతించి అనుభవించాల్సిందే. ఇది ప్రకృతి ధర్మం. దీనికి ఎవరికి మినహాయింపు లేదు. అదే ఆరోగ్యకరం కూడా. కానీ 'తెరపై తారలా మెరవడం' అన్నది ఎక్కువశాతం స్త్రీ సౌందర్యానికి గుర్తింపే అవడం అన్నది ఎందరో సినీతారల జీవితాల్ని మధ్యలోనే ముగిసేలా చేసింది. ఒక్కసారి ప్రత్యేక గుర్తింపు, ప్రత్యేక హోదా, ప్రత్యేక అభినందనలు వెల్లువెత్తాక, మామూలుగా జీవించడం చాలా నిస్సారంగా తోస్తుంది. కానీ ఈ తెరపై వెలుగులు ఎంతకాలం శోభిస్తాయో ఎవరికీ అంతుపట్టని అంశమే.

ఇవన్నీ పైకి కనిపించే జిలుగులే. కానీ ఈ పూరేకుల పరిమళం కోసం జీవితంలోని మిగిలిన పార్శ్వాలు పక్కన పెట్టాల్సిన అవసరాలు నిత్యం

తలెత్తుతాయి. ఎన్నో వదంతులు షికారు చేస్తాయి. జీవితంలో చిచ్చు పెడతాయి. పైకి ఆరాధన అనే ముసుగు లోలోపల అసభ్య ఆలోచనల పరంపర ఇటువంటి ద్వంద్వ మనస్తత్వ వైఖరులతో ఓర్పుగా నెట్టుకురావాల్సిన పరిస్థితులు. ఇది సమాజ స్పందనలోనే ఓ కోణం. అవసరాలను అవకాశంగా మలచుకొని దిగజార్చాలని చూసే విషసర్ప నీడ ఇంకోవైపు! ఇన్ని భరించి ఎలాగో నిలదొక్కుకుంటే కొత్త తారలు జిగేల్మంటే పాతముఖాలు వెలవెలపోవాల్సిందే. ఇన్నిటి మధ్యా.. ఎన్నో అసాధ్యాల మధ్య.. సాధ్యానికి సంకేతంగా నిలిచిన అతిలోక సుందరి ఆమె. నాలుగవ ఏటే బాలనటిగా సినీతెరకు పరిచయమైన ఆమె రెండు తరాల నాయకులతో నటించి సంచలనం సృష్టించింది. బాలీవుడ్, కోలీవుడ్, టాలీవుడ్‌ను తన ముగ్ధత్వ సౌందర్యంతో, నటనతో మంత్రముగ్ధుల్ని చేసింది. తొలి మహిళా సూపర్ స్టార్ గా బాలీవుడ్‌లో కొత్త చరిత్ర సృష్టించింది. ఆమె బ్రహ్మ సౌందర్య దృష్టికి, అద్భుత సృష్టికి నిదర్శనమైన దివంగత నటి శ్రీదేవి. నిత్యయవ్వనంతో విలసిల్లిన ఆ దేవీ నేడు దేవలోకాలకు వెళ్లిపోయినా ఆమె స్మృతులతో చిరకాలం మనసుల్లోనే ఉంటుంది అభిమానులకు. ఈ సందర్భంలో స్త్రీ తెరరంగ ప్రవేశం పరిణామాలు ఏ ప్రామాణికతకు నిదర్శనాలో అన్నది వ్యక్తిగత వివేకానికే వదిలేసే అంశం. 1970వ దశకం నుండి 21వ దశాబ్దం వరకు టెక్నాలజీ, మానవ సంబంధాల్లో మార్పు వచ్చినా అన్ని 'అందం నిలుపుకోవటం' అన్న ప్రాతిపాదిక పునాదిగా సాగినవే. నేటి శ్రీదేవి మరణం కూడా ఈ కోణంలో ఆవిష్కరింపదగినదే! 'ఆధునిక హీరోయిన్లకు తీసిపోనంత నాజూగ్గా కనిపించేందుకు ఆమె కఠినమైన ఆహార నియమాలు పాటించేవారు. గతంలో ముక్కు ఆపరేషన్ చేయించుకున్నారని వార్తలు వచ్చాయి. ఈ మధ్య బరువు నియంత్రించడానికి లైపొసెక్షన్ ఆపరేషన్ చేయించుకున్నారు. ఇలాంటి వాటివల్ల హార్మోన్ల అసమతుల్యత ఏర్పడుతుందని పలుపరిశోధనలు వెల్లడించాయి. అలాగే లైపోసెక్షన్ చేయించుకున్న వారిలో 76 శాతం ఆత్మహత్యలకు పాల్పడ్డారని అమెరికాలో చేసిన పరిశోధనలో తెలిసింది. దీనిని బట్టి ఆమె చాలాకాలంగా తీవ్రమైన మానసిక ఒత్తిడి, ఆందోళన, డిప్రెషన్‌తో బాధపడుతున్నదని భావించాల్సి వస్తున్నది. అన్నీ కలిసి ఆమెను గుండెపోటుకు గురి చేసి ఉంటాయి' ఇది కొందరి నిపుణుల అభిప్రాయం. ఆయితే ఇటీవల దుబాయ్ వైద్యులు ఆమె మృతదేహానికి చేసిన పోస్టుమార్టం రిపోర్టులో ఆమె గుండెపోటు కాదు, నీళ్లటబ్బులో మునిగి, ఊపిరాడక మరణించారని తేల్చారు.

మరణానికి ముందు ఆమె మద్యం సేవించినట్లు, ఆమె రక్తం నమూనాలో తేలినట్లుగా ప్రకటించారు. అసలు వాస్తవం ఇంకా తెలియాల్సి ఉంది. ఇది అతిలోకసుందరి గాధ మాత్రమే కాదు. ఇంతకుముందు ఆర్తీ అగర్వాల్ కూడా ఈ అందం నిలుపుకునే ప్రయత్నంలోనే ప్రాణాలు పణంగా పెట్టింది. ఓ సినిమా కోసం శరీరంపై ప్రయోగం చేసిన అనుష్క కూడా పూర్వపు ఆరోగ్యాన్ని తిరిగి పొందలేకపోయింది. ఓ స్త్రీ కూతురిగా, భార్యగా, సహోదరిగా, తల్లిగా, అత్తగా, నానమ్మగా ...ఇలా జీవితంలోని దశలను బట్టి ఒక్కో పాత్రను పోషించాల్సి ఉంటుంది. ఓ అనుబంధంలో ఎక్కువ సౌకర్యం ఉందని అక్కడే ఉండిపోతానంటే ఓ కుటుంబమే నాశనం అవుతుంది. అలాగే 'తెరపై తార అన్నది కేవలం ఒక దశకు సంబంధించినది మాత్రమే' అనే నిజాన్ని అంగీకరించలేక ఓ కృత్రిమ లోకాన్ని సృష్టించే క్రమంలో పరిస్థితులు వికటించి మానసిక అశాంతిని, అనారోగ్యాన్ని, అసంతృప్తిని క్రమక్రమంగా పెంచుతూ ఉంటాయి. ఈ తెర గుర్తింపు ఎందరో వ్యక్తుల్ని జీవితంలోకి తీసుకువస్తుంది. ప్రతీ వ్యక్తికి జీవితంలో చిన్నాచితక ఇబ్బందులు, పొరపొచ్చాలు ఉంటాయి. వాటి ప్రభావం వల్ల స్వాంతన కావాలి అని కోరుకునే సందర్భాలు రావచ్చు. అలాంటి బలహీన క్షణాలే దీర్ఘకాలంలో సమస్యల వలలోకి నెట్టేస్తాయి. వ్యక్తిగత జీవితానికి కూడా విస్తరించే ఈ తెర జిలుగులు సామాజిక గుర్తింపు కోసమే తప్ప వ్యక్తిగత బాధ్యతలు, అనుబంధాలకు వర్తించవు అనే విషయాన్ని స్పష్టంగా క్రమబద్దీకరించుకోవాలి. తెరపై మెరిసే ప్రతి తార తాను సాధారణ మనిషిగా అంటే విపరీతమైన గుర్తింపు లేని వ్యక్తిగా ఉండే జీవితాన్ని కూడా ఆస్వాదించేలా తనను తాను సిద్ధం చేసుకోవాలి. ఈ రెండు జీవితాలకు మధ్య ఉండే చీలికను అర్థం చేసుకొని ముందుకు సాగితేనే హాయిగా బతకవచ్చు. గుర్తింపునే ప్రాణవాయువుగా భావించి పయనిస్తే అందరి ఆమోదం కోసం ప్రకృతికి విరుద్ధంగా శరీరం వికటించేలా ప్రయోగాలు చేయాలనే తపన దాని దుష్పరిణామాల గురించి ఆలోచించకుండా చేసేలా ప్రేరేపిస్తుంది. అటువంటి ప్రలోభాలకు దూరంగా ఉండి వాస్తవమైన శరీరం (వయసుకు తగ్గట్టు)తో ఉంటూ ఆరోగ్యంగా ఉండే దశ ఉంటే చాలు అనే భావనతో సాగితేనే తెరపై మెరిసే తార నిజజీవితంలో కూడా మెరుస్తుంది. 'నటన–గుర్తింపు' జీవితంలో ఓ భాగమే తప్ప అవే జీవితం కావు అనే భావనను ఆమోదించి, ఆహ్వానించే తారలలోకం వెల్లివిరియాలని ఆశిద్దాం!



# మేధోశక్తిని మించింది లేదు

సినిమా రంగంలో 'కాస్టింగ్ కౌచ్' మీద రోజుకో వివాదం వెలుగులోకి వస్తుంది. తాజాగా శ్రీరెడ్డి చేస్తున్న వ్యాఖ్యలు, ఆమె అన్ని విషయాలు బయటపెట్టడం అన్నది మొదట మెచ్చుకోవాల్సిన అంశంగా అనిపించినప్పటికీ, క్రమేపీ అది పబ్లిసిటీ స్టంట్‌గానే పరిణమించింది. ఆత్మగౌరవం, హుందాగా ప్రవర్తించడం, ఇతరుల గౌరవాన్ని చూరగొనడం వంటి అంశాలు పూర్తిగా ఓ వ్యక్తి ప్రవర్తన మీద మాత్రమే ఆధారపడి ఉంటాయి. ఆ గీత చెరిపేసిన నాడు గౌరవాన్ని ఆశించే హక్కు ఎవరికి ఉండదు. అది స్త్రీలకైనా, పురుషులకైనా సరే! తెలుగు హీరోయిన్లకు అవకాశాలు ఇవ్వడం లేదని, పూర్తిగా ఇతర రాష్ట్రాల హీరోయిన్ల వైపే ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు మొగ్గుచూపుతున్నారని, ఈ విషయంలో వారు ఆ దృక్పథం మార్చుకోని నేటివిటికీ పట్టంకట్టాలని ఆమె మాట్లాడిన తీరు అందరి దృష్టిని ఆకర్షించింది. తెలుగు హీరోయిన్లకు అవకాశాలు రాకపోవడానికి కారణం వారు 'కాస్టింగ్ కౌచ్'కు ఒప్పుకోకపోవడమే అని ఆమె తేల్చేసింది. అప్పటిదాకా ఆమె నిలుపుకున్న హుందాతనం ఆమె మీద అందరికి గౌరవం కలిగేలా చేసింది. 'కాస్టింగ్ కౌచ్' కారణంగానే తెలుగు

సినిమా రంగంలోకి హీరోయిన్లగా తమ బిడ్డలను పంపడానికి ఏ తల్లిదండ్రులు ఇష్టపడటం లేదని కూడా ఆమె నిక్కచ్చిగా చెప్పేసింది. కానీ మొదట్లో ఓ అంశం గురించి, అది సమస్యగా మారి ఎంతమందిని ఇబ్బంది పెడుతున్నదో ధైర్యంగా ఓ వర్గం తరపున నిలబడిన ఆమె తర్వాత దాన్ని తన న్యూనతను, వ్యక్తిగత ఇబ్బందులను వెల్లగక్కే వేదికగా సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లను, మీడియాను మలచుకుంది. ‘‘ఒళ్లంతా చూపించడానికి నాకు సిగ్గు లేదనుకుంటున్నారా? నేను హాట్‌గా లేనా? మై బాడీ ఈజ్ మై వెపన్, బ్యాంక్ బాలన్స్ అయిపోతే ఏం చేయాలి? అవకాశాల కోసం దేనికైనా రెడీ. ప్రముఖ ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు అవసరం తీరాక ముఖం చాటేస్తారు’ అని సంచలన వ్యాఖ్యలు చేసింది. ఆమె అంతటితో ఆగలేదు. ‘ఫిజిక్ కాపాడుకోవడానికి మేము ఎంతో కష్టపడతాం. కడుపు నిండా తినడానికి కూడా లేదు. ఇంట్లో భార్యలు మాలాగా శరీరాకృతిని కాపాడుకోలేరు. అందుకే ప్రేక్షకులు మమ్మల్ని చూడటానికే థియేటర్లకు వస్తారు’ అని కూడా అనేసింది. ఈ మొత్తం క్రమాన్ని గమనిస్తే స్త్రీ తనను తానే శరీరంగా ప్రకటించుకుంటే ఆమె హుందాతనం, ఆత్మగౌరవం ఏ మేరకు నిలబడుతుంది? అదే శ్రీరెడ్డి ‘మై బాడీ ఈజ్ మై వెపన్’ బదులు ‘మై బ్రెయిన్ ఈజ్ మై వెపన్’ అనే పంథాలో కొనసాగి ఉంటే ఆమె మీద గౌరవం రెట్టింపయ్యేది. సమానత్వం అనేది స్త్రీ, పురుషులిద్దరికీ సంబంధించిన అంశం. అది స్త్రీకి మాత్రమే పరిమితమైనది కాదు. సినిమా రంగంలో స్త్రీల కష్టాలు బహిర్గతమవుతాయి. కానీ పురుషుల కష్టాలు ఎక్కువ వెలుగులోకిరావు. ఆ రంగం అలాంటిది. అది కోట్ల ప్రజల ఇష్టాఇష్టాలు, అభిప్రాయాల ఆధారంగా జరిగే బిజినెస్. అంతమందిని మెప్పించడం అంత సులభం కాదు. అలాంటప్పుడు కష్టాలు, స్థిర ఆదాయం లేకపోవడం కూడా మామూలే. స్త్రీలకు ఎక్కువ కష్టాలు, పురుషులకు తక్కువ కష్టాలు అనే డిస్కౌంట్లు ఏవీ ఉండవు ఇక్కడ. అలాంటప్పుడు అది ఒక స్త్రీలకు మాత్రమే పరిమితం చేయడం ఎంతవరకు సమంజసం? ఈ సమాజంలో స్త్రీ తనను తాను శరీరంగా మాత్రమే ప్రకటించుకున్నంత వరకూ ఎవరూ ఆమెకో ఆత్మగౌరవ కిరీటాన్ని కట్టబెట్టలేరు. ఎందుకంటే వయసు పెరిగినప్పుడు శరీరంలో మార్పులు రావడం సహజం. అప్పుడు ఆ న్యూనత ఏ స్థితికైనా స్త్రీని తీసుకువెళ్లవచ్చు. కనుక స్త్రీ

తనను 'తన ప్రతిభ రూపంగా' చూసుకోవాలి. అప్పుడే నిజమైన గౌరవం, హుందాతనం ఇచ్చే దిశలో సమాజం కదులుతుంది. శరీరం అన్న స్టిగ్మాకు స్త్రీ బానిస కాకుండా ఉండాలంటే ఆమె సామర్థ్యాలపై ఆమె నమ్మకం పెంచుకోవాలి. ఆ సామర్థ్యాలను, నైపుణ్యాలను పెంచుకోవడానికి ఆమె ఎల్లప్పుడూ తపన పడాలి. ఇంటి నుండి బయటి వరకు అందరూ తన ప్రతిభను, హుందాతనాన్ని చూసి గౌరవించాలి అనే కోరికను కూడా దృఢపరచుకోవాలి. తను వేసే అడుగును బట్టే తన గౌరవం నిలబడుతుందని, మానసిక సౌందర్యం ఆ గౌరవానికి మెరుగులు దిద్దే ఆభరణం అని ప్రతి స్త్రీ గుర్తించుకోవడం వలన ఏ సమస్య అయినా పరిష్కరించబడుతుంది. స్త్రీగా ఉంటూనే పురుషుల్ని గౌరవించే పంథాను అలవర్చుకోవాలి.



# నిజాయితీయే నిలబెడుతుంది

ఓ స్త్రీ వ్యక్తిగతంగా వచ్చి తన సమస్యల గురించి చెప్పుకోవడానికి, ఓ వర్గం తరపున పోరాడడానికి చాలా తేడా ఉంది. వ్యక్తిగతంగా మాట్లాడినప్పుడు భావ ప్రకటన స్వేచ్ఛ ఎక్కువగా ఉంటుంది. కానీ బాధిత వర్గానికి నాయకత్వం వహించడానికి వచ్చినప్పుడు ఆ బాధితుల బాధలను పరిష్కారాలను . చూపే దిశలో వారి ఆత్మగౌరవానికి భంగం కలుగకుండా హుందాగా ప్రవర్తించాలి. శ్రీరెడ్డి పోరాటం ఇప్పుడు ఏమైందో ఎవరికీ అర్థం కానీ పరిస్థితి. మీడియా ముందు అసభ్యకరంగా మాట్లాడినా, అర్ధనగ్న ప్రదర్శన చేసినా, ఆమెకు మద్దతు పలికినవారు కూడా ఉన్నారు. సమస్య తీవ్రతే ఆమెను అంత విపరీతంగా ప్రవర్తించేలా చేసిందని అందరూ అనుకున్నారు. ప్రజా సమస్యలపై పోరాడే వ్యక్తులకు ప్రజలు కచ్చితంగా మద్దతిస్తారు. తప్పులున్నప్పటికీ ఆ వ్యక్తి వెలుగులోకి తీసుకువచ్చిన సమస్యకు విలువనిచ్చి ఆ వ్యక్తి బలహీనతలను, దౌర్బల్యాల్నీ కొంతమేరకు క్షమిస్తారు. ఎందుకంటే అవన్నీ నైతికత, హుందాతనం పాటించని చర్యలు అయినప్పటికీ, లక్ష్యం గొప్పది కనుక. కానీ నిజాయితీ లోపించి ప్రలోభాలకు లోనై రోజుకో మాట మారుస్తూ సమాజంలో ఎంతో

కష్టపడి ఓ స్థాయికి చేరుకున్న వ్యక్తులందరి మీద నిందలు మోపుతూ దాన్నే ఉద్యమ అజెండాగా మారిస్తే మాత్రం ప్రజలు సరైన గుణపాఠం నేర్పుతారు. దీనికి ఉదాహరణే శ్రీరెడ్డి. హాలీవుడ్, బాలీవుడ్‌లో ఎన్నో దశాబ్దాల కిందల నుంచే వేళ్లులుతున్న క్యాస్టింగ్ కౌచ్ వ్యవహారాన్ని, తెలుగు ప్రజలకు చెంపపెట్టులా పరిచయం చేసిన ఘనత శ్రీరెడ్డిదే. టాలీవుడ్‌లో క్యాస్టింగ్ కౌచ్ ఉందంటూ సాక్ష్యాధారాలతో శ్రీరెడ్డి బయటపెట్టడం సంచలనం సృష్టించింది. వేషాలు ఇప్పిస్తామంటూ అమ్మాయిలపై భారీస్థాయిలో లైంగిక దోపిడీ. జరుగుతోందని, దీనికి అడ్డుకట్ట వేయాలని బాధితులే కాకుండా మనసున్న అందరూ కోరుతున్నారు. కానీ సమస్య కోసం పోరాడే దిశలో వ్యక్తులను టార్గెట్ చేయడం ఉద్యమాన్ని పక్కదోవ పట్టించి ఇప్పుడు ఆ అంశమే పూర్తిగా కనుమరుగయ్యేలా చేసింది. సినిమాల్లో క్యాస్టింగ్ కౌచ్ మూలాలు తెలుసుకుంటేనే సమస్య తీవ్రతపై స్పష్టత వస్తుంది.

19వ శతాబ్ది చివరి దశకంలో చలనచిత్రాలు మొదలయ్యాయి. మొదట్లో ఆడవాళ్ల పాత్రలను మగవాళ్లే పోషించారు. 'పరువైన ఆడవాళ్లు' ఆ వైపు చూసేవారుకాదు. కానీ మారుతున్న కాలం, అభిరుచుల ఫలితంగా మహిళలు ఈ రంగంలోకి దిగక తప్పలేదు.. సినీపరిశ్రమ వ్యాపారంగా మారిపోవడంతో సినిమాల తయారీ సంఘటిత పరిశ్రమగా మారిపోయింది. స్టూడియోలు పుట్టుకొచ్చాయి. హాలీవుడ్ నుంచి మద్రాసు వరకు లెక్కలేనన్ని స్టూడియోలు సందడి చేశాయి. కాస్త కనుముక్కుతీరు, వాచకం, అభినయం ఉన్న అమ్మాయిలకు అవకాశాలు కల్పించాయి. తారల సంఖ్య పెరిగింది. వేషాలేమో పరిమితం. చక్కని నటీమణులు సైతం క్యారెక్టర్ పాత్రలకు పరిమితం కావాల్సిన పరిస్థితి. 'ఏం చేసైనా సరే సినిమాల్లో నటించాలి. పేరు తెచ్చుకోవాలి. జనంతో ప్రశంసలు కురిపించుకోవాలి' అని పంతం పట్టిన అమ్మాయిలు స్టూడియోల చుట్టూ తచ్చాడేవారు. నిర్మాతలు, దర్శకుల దగ్గర్నుంచి మేకప్ ఆర్టిస్టు వరకు అందర్నీ బతిమాలుకునేవారు. అక్కడే క్యాస్టింగ్ కౌచ్ పకడ్బందీగా మొదలైంది. ఇది కేవలం వేషం కోసం వచ్చే అమ్మాయిలకే పరిమితం కాకుండా వారి తల్లులు, అక్కచెల్లెళ్లపైనా లైంగికదాడులకు దారితీసింది. 80 ఏళ్ల సుదీర్ఘ చరిత్ర ఉన్న తెలుగు సినీపరిశ్రమలో క్యాస్టింగ్ కౌచ్‌కూ అంతే చరిత్ర ఉంది. అయితే

తొలినాళ్లలో తీవ్రత తక్కువ. వంచన తక్కువ. కనుక బాధితులు కూడా తక్కువే. పైగా నిర్మాత, దర్శకుల్లో అత్యధికం మానవీయ విలువలు, స్త్రీలను గౌరవించే బిఎన్ రెడ్డి, గూడవల్లి రామబ్రహ్మం వంటి రచయితలు, సంస్కర్తలు ఉండడం వల్ల కౌచ్ వ్యవహారాలు పెద్దగా ఉండేవి కావు. రానురాను సినిమాల ఉత్పత్తి పెరగడంతో తారలు పోటీపడ్డారు. కౌచ్ తీవ్రత పెరిగింది. శృంగారం మానవసహజాతం. లైంగికదాడి దాని వికృతరూపం మానవజాతికే పరిమితమైన ఘోరం. అవకాశాల కోసం యువతులను తనువును అర్పించాల్సిన పరిస్థితి ఉన్నంతవరకు ఈ ఘోరం కొనసాగుతూనే ఉంటుంది. చట్టాలు, కమిటీలు ఎన్ని వేసినా ఫలితం ఉండకపోవచ్చు. అయితే దీనిపై విస్తృతంగా ప్రచారం చేయడం వల్ల, దోషులను గుర్తించి, శిక్షించే చర్యలు తీసుకోవడం వల్ల కేసుల సంఖ్యను తగ్గించవచ్చు. ప్రస్తుతానికి ఇంతకుమించి చేసేదేమీ లేదు..!



# చీకటి నుండి వెలుగులోకి

'సప్తవర్ణాల కంకణాలతో
సప్తస్వరాల కింకిణులతో
ప్రతిదినం దీపాలు వెలిగిస్తూ
భద్ర మహిళలు నడయాడే
మంగళ ప్రపంచం కోసం
కలలు కంటూ చీకట్లో కూచున్నాను'

**–జ(డా.దాశరథి)**

సమాజంలో ఏ సమస్య అయినా అందరికి ఒకేలా అనిపించదు. స్త్రీ రూపంలో దీని వైరుధ్యం ఇంకొంచెం ఎక్కువే. దీనికి కారణం కులం, మతం పేరిట స్త్రీలకు ఏర్పరచే వివిధ రకాల వాతావరణాలు. కనుక ఇక్కడ ఏ సమస్యను 'అందరికి చెందినది' అని వర్గీకరించలేము. కానీ ఎన్ని వైరుధ్యాలు ఉన్నా 'పరిష్కారం' అనే చోటుకి వచ్చేసరికి సమైక్యత గోచరిస్తుంది. 'నిర్బంధిస్తే పిల్లి అయినా పులి అవుతుంది' అనే సామెత అందరికి తెలిసిందే. ప్రతీసారి ఓ అతిగా పరిణమించిన పరిస్థితే యోగ్యమైన వాతావరణానికి ప్రేరణ అవుతుంది.

ఎన్నో ఏళ్ల నుండి మేలిముసుగు కింద మగ్గిపోయారు వారు. మదర్సాలలో నేర్పించే అరబిక్ లాంటివీ తప్ప ప్రపంచాన్ని శాసించే విద్యకు చాలా దూరం వారు. 'తలాక్..తలాక్..తలాక్..'అని భర్త ఎప్పుడు అంటాడో తెలియని భయం. భర్తకు బహుభార్యత్వం ఉన్నా భరించాలి. బయటకు వెళ్లకూడదు. వెళ్లినా ముసుగుతోనే ఉండాలి. భరించారు. . భరిస్తూనే ఉన్నారు. కానీ 'పులి' అయినా ఆమె ఈ సమస్యకు సంపూర్ణ పరిష్కారం కోసం పోరాడదాం అని అనుకుంది. సమస్యను సుప్రీంకోర్టు దాకా తీసుకువెళ్లింది. ఆమె సైరాభానో! విజయం సాధించింది చివరకు. ఇది ఓ రకమైన వాతావరణం. ఇంకొకవైపు చూద్దాం. ఆమె కళాశాలలో ఓ ప్రొఫెసర్, భర్తతో విభేదాల వల్ల విడిపోయింది. కానీ భర్త ఆమెను వదల్లేదు. 'మంచి సంపాదన' ను తెచ్చే భార్యను వదులుకోవడం అతనికి ఇష్టం లేదు. ఆమె మీద ఎన్నోసార్లు హత్యాయత్నాలు చేశాడు. రక్షకభటులకు మొరపెట్టుకుంది. పోరాడింది చివరిదాకా. ఆఖరికి నడిరోడ్డుమీద ఆమె మీద యాసిడ్ పోశాడు ఆ కీచకుడు. సుమారు నలభైరోజులపైన ఆసుపత్రిలో పోరాడి ప్రాణాలు విడిచింది. ఆమె. ఆమే జరీనా. అందర్నీ ఒకే గొడుగు కింద తీసుకురాలేం. కానీ ఓ మంచి మార్పు కోసం, వ్యక్తిగత ప్రగతి కోసం ప్రయత్నమే, పోరాటమో చేస్తున్నప్పుడు దాన్ని ఎదుర్కోలేని ప్రత్యర్థి వర్గం పైశాచిక ధోరణిని అవలంభిస్తుంది. తన సమస్యకు తానే పరిష్కారం వెతుక్కునే దిశలో స్త్రీ ముందుకు కదిలినందువలన దీనిని 'సమానత్వం' 'ప్రగతి', అనాలా! ఆ ప్రయత్నంలో 'సమిధి' అయిపోయినందుకు 'ఓటమి' అనుకోవాలా?. 'సమాన సంపాదన' సమానత్వం కాకపోవచ్చు. సమానత్వం అంటే కలిసి సమానంగా సంతోషాన్ని అనుభవించడం. ఆ సమాన సంతోష పరిధికి స్త్రీ పురుషులిద్దరూ సమన్వయరీతిలో నిర్వహించలేకపోవడానికి మూలాలు ఏమిటి? కుటుంబ సంబంధాలు, సమాజ సంబంధాలు కన్నా ఆర్థిక ప్రగతి ముఖ్యమైనది అని అనుకోవడం వలనా? 'మానవ స్పర్శను మరిచిన ప్రతి ఒక్కడు చివరికి మృగమే అవుతాడు' ఆ స్పర్శ నేడు క్రమక్రమంగా అంతరించిపోవడానికి కారణాలు ఏమిటి? నిర్భయ చట్టం లాంటివి వచ్చాక కూడా అత్యాచారాలు ఆగలేదు. ఇంకా దారుణమైన అంశం ఏమిటంటే 'ఒక దారుణం చేసినా.. ఎన్ని దారుణాలు చేసినా ఒకటే శిక్ష అయినప్పుడు ఒకదానితో ఎందుకు ఆగడం?' అనే పశుప్రవృత్తి కూడా మనిషిలో ప్రవేశించడం. 'సుడిగుండాలు' సినిమాలో చిన్నపిల్లలుగా ఉన్నప్పుడే పశుప్రవృత్తి ప్రవేశించడానికి గల

కారణాలను చూవడం జరిగింది. కుటుంబ సంబంధాల్లో కొరవడిన 'మానవ స్పర్శే' పిల్లల్ని ఇంకో ప్రత్యామ్నాయం వెతుక్కునే ప్రక్రియలో మృగాలుగా మారుస్తుందని చెప్పడమే ఈ చిత్రం ఉద్దేశం. ఇలా వృత్తాంతాలు ఎన్ని చెప్పుకుంటూ పోయినా తిరిగి మామూలు కుటుంబం దగ్గరికి వచ్చి ఆగిపోతాయి.

ఆత్మీయ సంబంధాలు మినహా ఏ పరిష్కారం కూడా దీర్ఘకాలంలో నిలబడదని చెప్పకనే నిదర్శనాలుగా నిలబడతాయి. చీకటి నుండి వెలుగులోకి ప్రయాణం సాగిస్తున్న క్రమంలో కొన్నిసార్లు వెలుగు కిరణాలు ప్రసరిస్తున్నా.. 'కొంతవెలుగు' తిరిగి చీకటికి దాసోహం అవుతూనే ఉంది. ఈ క్రమంలోనే కనుమరుగైన మూలాల్ని గుర్తించి వాటిని ధృడపరచాల్సిన అవసరం ఉంది. ఒకే పరిష్కారం అన్ని సమస్యలకు పనికిరాదు. ఎందుకంటే సమస్య తీవ్రత అన్ని వాతావరణాల్లో ఒకేలా ఉండవచ్చు. కానీ సమస్య సృష్టించబడిన వాతావరణాలు వేరువేరుగా ఉంటారు. అప్పుడు ఎదుర్కోవలసిన ప్రత్యర్థుల ధోరణులు కూడా మారుతూ ఉంటాయి. వీటన్నింటిని ఎదుర్కుంటూపోవడం అంటే సమస్యల్ని పెంచుతూ, మళ్లీ ఇదే పరిష్కారాలలో సాగిపోవడమే! నిజమైన వెలుగులో ప్రపంచం ప్రజ్వరిల్లాలంటే పరిష్కారం ఓ తాత్కాలిక ప్రమాణాల ఆధారంగా నిర్మించబడింది కాకుండా దీర్ఘకాలంలో అదే పరిస్థితి ఉత్పన్నం అయినప్పుడు ఓ శాశ్వత సరిహద్దు రేఖను గీసేలా ఉండాలి. అలా జరగాలంటే 'మరమనుషులు' 'మానవ స్పర్శ మనుషులు'గా పరిణామక్రమం పొందడం అనేది మానసికంగా మొదలవ్వాలి. సాంకేతిక ప్రగతి మానవ సంబంధాల్ని శాసించినంత కాలం మానవస్పర్శ అనేది క్రమక్రమంగా కనుమరుగు అవుతూనే ఉంటుంది. చీకటిలో ఉన్నప్పుడు వెలుగు దీనికన్నా చాలా మెరుగ్గా ఉంటుందని అనిపిస్తుంది. కానీ చీకటిలోనే మగ్గుతూ దానికే అలవాటు పడిపోయి దాన్నే వెలుగు అనుకుంటే ఇక చీకటి, వెలుగు అనే తేడాలు కూడా ఉండని స్తబ్ధత ఏర్పడుతుంది. చీకటి వెలుగుల దోబూచులాటలో నిజమైన వెలుగును 'పరిష్కార దిక్సూచి'గా చేసే రోజు రావాలని ఆశిద్దాం!



# జవాబులేని ప్రశ్నలు

స్పష్టత, కార్యాచరణ ఉన్న ప్రణాళికలే ఏ వాదానికైనా నిజమైన బలాలు. చరిత్ర ఎప్పుడూ ఒకేలా ఉంటుందని మనం అనుకుంటాం. కానీ వర్తమానంలో మన దృక్పథానికి అనుగుణంగా చరిత్ర మనకు ఒకోరకంగా కనపడుతుంది. అలా మారిన దృక్కోణమే భవిష్యత్తును నడిపిస్తుంది. చరిత్ర ఎప్పుడు పునరావృతం కాదు. కానీ అదే చరిత్రను బూజుచేసి చూపిస్తూ నేటి తర అస్థిత్వాన్ని ప్రశ్నార్థకంగా మారుస్తూ సాగుతున్న సైద్ధాంతిక వాతావరణం దాదాపు అన్ని రంగాల్లోనూ కనపడుతుంది. స్త్రీ ఇందుకు మినహాయింపు ఏమీ కాదు.. దళితులు కులవ్యవస్థను, కమ్యూనిస్టులు వ్యక్తిగత ఆస్తిని, స్త్రీవాదులు పితృస్వామ్య వ్యవస్థను ఇలా ఒక్కొక్కరు ఒక్కో చట్రాన్ని ఎన్నుకొని ఎన్ని శతాబ్దాలు గడిచినా వాటినే ప్రధాన అంశాలుగా చిత్రీకరించి సమకాలీన పరిస్థితులు, పరిణామక్రమంలో రూపుదిద్దుకోవాల్సిన కొత్త ఆలోచనలను ఆహ్వానించకుండా తమ తరువాతి తరాన్ని కుహనావాదాలతో మభ్య పెట్టడం మనకు కొత్తమీ కాదు. 19వ శతాబ్దంలో కందుకూరి వీరేశలింగం పంతులు లాంటి వారు వెలుగులోకి వచ్చేవరకు స్త్రీ అస్తిత్వం, సమానత్వం వంటి అంశాల గురించి ఎవరు లోతుగా

ఆలోచించలేదు. తర్వాత గురజాడ ఇంకా ఎందరో స్త్రీకి కావాల్సిన కనీస స్వేచ్ఛ గురించి ఉద్యమాలు చేసి మరో స్త్రీకి ఓ కొత్త కవాటాన్ని తెరిచారు. క్రమేపీ 21వ శతాబ్దం వచ్చేసరికి దాదాపు స్త్రీలందరూ ఎంతో సంతోషకరమైన జీవితాన్ని గడుపుతున్నారు. ఇది ఓ నిర్దిష్ట అభిప్రాయం కాదు. కానీ లోతుగా తరచి చూస్తే పెరిగిన వాతావరణం, ఆర్థిక పరిస్థితులు – ప్రమాణికత అనేవి ఆడైనా, మగైనా ఎవరినైనా ప్రభావితం చేస్తాయి. వృత్తిపరంగా చూసుకుంటే కర్ణాటక వంటి రాష్ట్రాల్లో బస్సు డ్రైవర్లుగా కూడా 50 శాతం స్థానం ఇచ్చేందుకు ప్రభుత్వం ఆమోదం స్త్రీలకి తెలిపింది. కాకపోతే ఇంకా జరుగుతున్న స్త్రీలపై అత్యాచారాలు అన్న కోణం నుంచే ఆలోచించి 'సమగ్ర చిత్రమైన స్త్రీ సమానత్వాన్ని' మరల రెండు శతాబ్దాల వెనుక చరిత్రలో కుచించివేయడం సమంజసం కాదని కాస్త శాస్త్రీయకంగా ఆలోచిస్తే, బోధపడుతుంది. 'స్త్రీలపై అత్యాచారాలు నశించాలి. స్త్రీకి సమానత్వం కావాలి' అని గొంతెత్తి అరిచే వాదాల సిద్ధాంతకర్తలు నిజంగా ఆ అత్యాచారాలు నశించాలంటే ఏం చేయాలి? ఇలా చేయడానికి కావాల్సిన కార్యాచరణ ప్రణాళిక ఏమిటి? ఇటువంటి ప్రశ్నలు అడిగి చూడండి. 'స్పష్టమైన సమాధానాలుండవు. ఏదో ఆవేశంలో మాటల ప్రవాహం పరుషంగా పొంగి పొర్లితే 'ఆహా.. ఓహో' అని ఆ క్షణాన అనిపించవచ్చు. కానీ కార్యాచరణ విషయానికి వస్తే చిత్తశుద్ధి ఎంతమేరకు అన్నది మనఃసాక్షికి మాత్రమే సంబంధించిన విషయం. ఇటువంటి వాదాలు చివరికి కాలప్రవాహాన్ని తిరోగమించేలా చేస్తాయి. సమస్యకు పరిష్కారం జరిగాక కూడా ఉత్పన్నమయ్యే దుష్పరిణామాలు ఎక్కడో సరిచేసుకోవాల్సిన పునాదుల్ని సూచిస్తాయి. లోతైన ఆలోచనా, కార్యాచరణపై స్పష్టత లేనివాళ్లు ఆవేశాన్నే అస్త్రంగా సంధించి విసిరే మాటల బాణాల ప్రభావం నిజంగా ఎంతమేరకు ఉంటుందంటే అది విన్నవారు ఆ ఉపన్యాసధోరణిని, భావోద్వేగాల్ని ఇష్టపడుతున్నారు, ఇంకో ఉపన్యాసం కోసం ఎదురుచూస్తున్నారు తప్ప ఆలోచించడం లేదు. ఆలోచనకు పురికొల్పే లోతైన స్పష్టత లేకపోవడం వల్లే ఓటికుండ శబ్దంలాగా ధ్వని చేసి మాయం అవుతుంది. ఏ కుటుంబ వ్యవస్థలోనైనా 'స్త్రీ' తన తరువాత తరాన్ని నడుపుతుంది. పిల్లల పెంపకం మొదలుకొని దాదాపు ఇంట్లోని అన్ని వ్యవహారాలను దక్షతతో నడిపేది ఆమె. అంటే కుటుంబంలోని వ్యక్తుల్ని ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. అంటే మార్పుని తీసుకురాగల శక్తి కూడా ఆమెలోనే ఉంటుంది. ఆ స్వయంశక్తిని గుర్తించి

ఆమె నిర్మాణాత్మకంగా  ఆచరణను అమలు పరిచినప్పుడు నిజమైన వ్యక్తిగత స్త్రీ సమానత్వం' వచ్చినట్టు. పురుషుడికి కూడా ఇంటి బాధ్యతల్లో భాగం ఉంటుంది. కానీ సంబంధాలు, అనుబంధాలని బలంగా నడిపించే భావోద్వేగాలు 'స్త్రీ'లో ఉన్నంత తీవ్రంగా పురుషుడి వ్యక్తీకరణలో కనపడదు. అంటే అంతర్లీనంగా 'మార్పు' అనేది ప్రశ్న. అయినా సమాధానం అయినా దాని ఉనికి 'స్త్రీ'యే. సమానత్వం, స్వేచ్ఛ అనేవి ఒక్కోసారి వ్యక్తిగత కోణంలోనూ, ఇంకోసారి సమాజకోణంలోను దర్శనం ఇచ్చే అంశాలు. ఇంత లోతైన అంశాల్ని, ఇంత విస్తృత పరిధి గల అంశాలను వ్యక్తిగత దూషణల, పాపులారిటీ మాస్కులుగా ఉపయోగించుకున్నంత కాలం అది ఓ 'మైక్ అంశం'గా మాత్రమే మిగిలిపోతుంది. సమాధానంలేని ప్రశ్నల్ని, స్పష్టమైన కార్యాచరణలేని వాదాల్ని 'పిడిగుద్దు 'గా పౌరుల మీద గుప్పించినంతకాలం సమాధానం లేని ప్రశ్నలాగే స్త్రీవాదం మిగిలిపోతుంది. పరస్పరం స్త్రీ పురుషులు ఒకరిమీద ఒకరు ఆధారపడడం సృష్టిసూత్రం. ఆ సూత్రం వేర్వేరు రూపాలు తీసుకోవచ్చు. కానీ సూత్రం మాత్రం మారదు. 'ఆధారపడటం' అనేది వ్యక్తిని తక్కువ చేసి, ఇంకొక వ్యక్తిని అధికంగా చూపే అంశం కాదు. జీవితాన్ని సులువుగా, ఆహ్లాదంగా గడపటానికి, మారాలి అన్న అవకాశం మాత్రమే. ఈ విషయం మీద పరిపూర్ణ స్పష్టత, అవగాహన లేనంతవరకు అసలైన వాదం ఎప్పుడూ వక్రీకరించబడుతూనే ఉంటుంది. అసలైన విషయం వక్రీకరణ కోణంలో సాగినంత కాలం అభివృద్ధి గమనం తిరోగతిగా పరిణమిస్తుంది. సమాధానాల్లేని ప్రశ్నలని, స్పష్టమైన లోతైన అవగాహనలేని అంశాలను పిడివాదాలుగా మన నెత్తిన రుద్దే కుహనా వాదులంతా ఇకనైనా మేల్కొంటే బావుంటుంది.



# కళాప్రదర్శనపై ఎందుకు కలవరం?

*'యత్ర నారస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః*

*యత్రేతాస్తున పుష్యంతే సర్వాస్తతాశురాః క్రియా'*

ఎక్కడ స్త్రీలు గౌరవింపబడతారో, మనుస్మృతి, ఎక్కడ స్త్రీలు వరదేవతలా భావించి పూజింపబడతారో, అక్కడ సర్వసంపదలూ ఉండడమే కాక రథ, గజ, తురగ పనాదులతో కూడిన లక్ష్మీదేవి అచంచలమై నిలబడుతుంది.

స్త్రీ ఔన్నత్యాన్ని నిలబెట్టడానికి నేడు ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, గుజరాత్ . ఇలా మొత్తానికి పాలక పెద్దలందరూ కలిసి 'పద్మావత్' పై కత్తిదూసి చారిత్రక పాత్ర ఉనికిని అగౌరవం వాటిల్లకూడదని చేస్తున్న ప్రయత్నాలు ఫలితాలు ఎవరికి దక్కుతాయి? ఇన్ని వివాదాలకు కేంద్రమైన ఈ చిత్ర ఇతివృత్తానికి ఆధారం చరిత్రలో చోటు చేసుకున్న ఒక ఉదంతాన్ని ఆధారం చేసుకుని పుట్టుకు వచ్చిన ఒక కాల్పనిక గాథ. 1250లో బెంగాల్లోని బీర్భూం జిల్లాలో పుట్టి 1216లో మరణించిన ఢిల్లీ సుల్తాన్ అల్లావుద్దీన్ ఖిల్జీ రాజస్థాన్లోని చిత్తోర్ రాజ్యంపై దండెత్తడం, దాని పాలకుడు రాణా రతన్ సింగ్ ఓటమి పాలవడం, రాజ్యం ఖిల్జే వశం కావడం చరిత్ర. ఈ యుద్ధం జరిగిన 224

ఏళ్లకు మాలిక్ మహమ్మద్ జయాసీ అనే ఒక ముస్లిం సూఫీ కవి ఈ కావ్యం రచనకు ఉపక్రమించాడు. మొదటిసారిగా అందులో రాణా రతన్ సింగ్ భార్య పద్మావతీ ప్రస్తావన వచ్చింది. అంతకుముందు లిఖిత, అలిఖిత చరిత్రలో ఎక్కడా పద్మావతికి సంబంధించిన ఆధారాలు లేవు. అల్లావుద్దీన్ ఖిల్జీ ఆస్థాన కవి అమీర్ ఖుస్రో చిత్తోర్ కోట ముట్టడి గురించిన రాసిన పత్రాల్లో ఎక్కడా పద్మావతి ప్రస్తావన లేదు. రాజస్థాన్ నుండి బెంగాల్ వరకూ దాదాపు 500 సంవత్సరాల వ్యవధిలో మాలిక్ కావ్యానికి ఉర్దూ, పర్షియన్ భాషల్లో అనేక అనువాదాలొచ్చాయి. అనువదించే కవుల సృజనాత్మక శక్తి మేరకు ఆ కావ్యంలో ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయి. చరిత్రను గౌరవించడం, కాపాడుకోవడం చాలా ప్రధానమైన అంశమే. కానీ సినిమా కథనాల గురించి ఏర్పడ్డ అపోహలను తొలగించడానికి భన్సాలీ చేసిన ప్రయత్నాన్ని కూడా సాగనివ్వకుండా రెండుసార్లు సినిమా షూటింగ్ ధ్వంసం చేసి, తీవ్రతరంగా బెదిరింపులు దాకా వెళ్లడం ఎంతవరకు సమంజసం? ఈ రోజు ఈ 'చారిత్రక పాత్ర గౌరవానికై దేశ వ్యాప్తంగా ఉద్యమిస్తున్న సంఘ్ పరివార్ సభ్యులు, రాజ్ పుట్ కులానికి చెందిన కర్ణి సేన సభ్యులు, రాజస్తాన్ ఎమ్మెల్యేలు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, గుజరాత్ పెద్దలందరూ మరీ ప్రాణం ఉండి వారి రాష్ట్రాల్లోనే అత్యాచారాలకు గురైన వేలమంది స్త్రీల గురించి ఇంతగా ఉద్యమించరెందుకో! రాజస్తాన్లో 2016 డిసెంబరు 24న చురూ జిల్లాలోని ఒక గ్రామంలో ఒక మైనర్ బాలికను గ్యాంగ్ రేప్ చేశారు. అంతటితో ఆగక ఆమెపై మోటార్ సైకిల్ ఎక్కించారు. దీంతో ఆమె వెన్నెముక విరిగిపోయింది. ఆ అమ్మాయి కన్ను ఒకటి పీకేసారు కూడా. రాజస్థాన్‌లో ఆడవారిపై అత్యాచారాలు అన్ని హద్దులు దాటిపోయాయి. అల్వార్ నుంచి జైపూర్ వచ్చిన ఒక అమ్మాయిపై ముగ్గురు యువకులతోపాటు ఆటో రిక్షాడ్రైవర్ కూడా కలిసి అత్యాచారం చేసి, ఆ తర్వాత బట్టలు లేకుండా ఆమెను ఎంఎస్ ఐటీ బయట విసిరేసి పరారైపోయారు. ఉత్తరప్రదేశ్‌లో ఓ యువతీ జగత్ పురాలో తన సోదరునితో ఉంటూ ప్రభుత్వం ఉద్యోగం కోసం సన్నద్ధమవుతోంది. ఉదయం ఆమె రైల్వే స్టేషన్లో దిగింది. జగత్‌పురాలోని తన అన్నయ్య గది దాకా వెళ్లేందుకు ఆటోలో కూర్చుంది. ఆ సమయంలో ఆటోలో మరో ముగ్గురు యువకులు కూడా ఉన్నారు. నిందితులైన యువకులు ఆటోను నిర్మానుష్యమైన ప్రదేశంలో ఆపివేయించి, అమ్మాయి నోటికి గుడ్డకట్టి ఆమెపై ఒక్కొక్కరుగా రేప్ చేశారు. రేప్ తర్వాత ముగ్గురు యువకులు అక్కడి

నుండి పరారైపోయారు. ఆపై ఆటోడ్రైవర్ కూడా ఆమెను రేప్ చేశాడు. ఇలా చెప్పుకుంటూ పోతే ఒకటా రెండా? రోజుకు ఎన్నో ప్రతిరాష్ట్రంలో వెలుగులోకి వస్తోంటే ఈ పాలకుల్లో ఒక్కరు కూడా అంత గట్టిగా ఉద్యమించలేదే? (!) రాజస్తాన్‌లో పోలీసుల గణాంకాల ప్రకారం 2008లో 568 రేప్ కేసులు నమోదు అయ్యాయి. గత ఏడాది 2016లో ఈ సంఖ్యా 3,769కి చేరింది. అలాగే 2015లో దేశవ్యాప్తంగా నేరాలు మొత్తం 37,413 కేసులు నమోదయ్యాయి. వీటిలో అత్యధికంగా మధ్యప్రదేశ్ (5,076), రాజస్తాన్ (3,769), ఉత్తరప్రదేశ్ (3, 467), మహారాష్ట్ర (3, 438) వంటి రాష్ట్రాలున్నాయి. మహానగరాల్లో చూస్తే ఢిల్లీ (1,813), ముంబై (607), చెన్నై (65), బెంగళూరు (104), కోల్‌కత్తా (36) కేసులు నమోదయ్యాయి. ఇవన్నీ గణాంకాల దాకా వచ్చినవి. రానివి దీనికి ఎన్నోరెట్లు ఎక్కువే ఉంటాయి. 2015లో ఉత్తరప్రదేశ్ అప్పటి ముఖ్యమంత్రి అఖిలేష్ యాదవ్ ఆ రాష్ట్రంలో గత 14 నెలల్లో జరిగిన రేప్ కేసుల్లో 29మంది పోలీసులు కూడా నిందితులుగా ఉన్నారని కూడా అసెంబ్లీకి తెలిపారు. ఓ పక్క ప్రాణం, జవసత్వాలు ఉన్న 'స్త్రీ' నిస్సహాయ స్థితిలో రోజుకో రీతిలో అత్యాచారాలకు గురవుతుంటే మౌనం వహించే పెద్దలు చరిత్ర గౌరవ ఉద్ధారణకై పాటు పడటం ఏమాత్రం క్రియాశీలకమో వారి అంతరాత్మలకే తెలియాలి. ఇటువంటి వివాదాలతో స్త్రీ భద్రత, స్త్రీ సాధికారత వంటి అంశాలకు మిక్కిలి ప్రాధాన్యం ఇస్తున్నట్టు కనిపించే ఈ చర్యలు నిజంగా స్త్రీ బతుకు చిత్రాన్ని మార్చేవి ఏమాత్రం కావు. మరి స్త్రీ ఔన్నత్య ఉద్ధరణకర్తలు 'దీపికా' పై చేసిన వ్యాఖ్యలు స్త్రీ గౌరవాన్ని కించపరిచేవి' అని ఎందుకు గుర్తించలేదో! భవిష్యత్తును ఉజ్వలంగా తీర్చిదిద్దలేని చరిత్ర ఎప్పటికీ నిలవదు. సుప్రీంకోర్టు 'పద్మావతి'కి అనుకూలంగా తీర్పు ఇచ్చిన ఈ వివాదం ఆగనేలేదు. 'భావప్రకటనా స్వేచ్ఛ అత్యంత పవిత్రమైనదని, ఆ హక్కులో ఆషామాషీ జోక్యం తగదని, చట్టపరిధిలో ఏ కళాకారుడైనా తనకు నచ్చిన రూపంలో తన భావాలను వ్యక్తపరచవచ్చని' సుప్రీంకోర్టు పిటిషనర్‌కు స్పష్టం చేసింది. వివాదాలతో వెలుగులోకి రావడం అన్నది నేడు నడుస్తున్న గొప్ప వ్యూహమే. యాంత్రిక దేశభక్తిని ప్రకటిస్తూ నిజమైన బాధితుల గురించి ముక్క కూడా మాట్లాడకుండా పటాలకు పూజ చేస్తూ, స్త్రీని చరిత్రలో పూజిస్తే ఒరిగేదేముంది? 'స్త్రీ' అంటే చారిత్రక చిత్రపటం గౌరవ ప్రదర్శన మాలిక కాదు.. ప్రాణం ఉన్న జీవిక! ఈ అంశాన్ని ఈ కోణంలో దర్శించే రోజు రావాలని ఆశిద్దాం!



# చట్టంపై అవగాహన ఉంటేనే పోరాడగలం

నేడు తెలుగు రాష్ట్రాల్లో సంచలనమవుతున్న ఉదంతాలన్ని లైంగిక వేధింపులకి సంబంధించినవే. సమకాలీన సమస్యాస్థితిలో లైంగిక వేధింపుల నిరోధక చట్టం గురించి ప్రతీ మహిళ తెలుసుకోవాలి. పని ప్రదేశాలలో లైంగిక వేధింపులు నిరోధించటం, ఫిర్యాదుల పరిష్కారం వంటి అంశాలతో వ్యవహరించేందుకు లైంగిక వేధింపుల నిరోధక చట్టం-2013ని అమల్లోకి తెచ్చారు. దీనిని అమలుపరిచే బాధ్యత సంస్థ కార్యాలయపు యజమాని లేదా అధికారితో బాటు జిల్లా మేజిస్ట్రేటు, అదనపు మేజిస్ట్రేటు లేదా కలెక్టరు కానీ లేదా డిప్యూటీ కలెక్టర్లపై ఉంటుంది. ఈ చట్ట ప్రకారం 'ఉద్యోగి' అనే పదం ఒక పని ప్రదేశంలో "శాశ్వతంగాగానీ, తాత్కాలికంగాకానీ, దినసరి కూలీగా కానీ, ఎలా పని చేస్తున్నా అందరికీ వర్తిస్తుంది. అలా పనిచేసే స్త్రీ ఆ సంస్థచే నియమించబడకుండా ఎవరైనా ఏజెంటు, కంట్రాక్టరు వంటి వారి చేత నియమించబడ్డా కూడా ఉద్యోగి కిందకే వస్తారు. సహ ఉద్యోగి, కాంట్రాక్టు ఉద్యోగి, ప్రొబేషనరు, ట్రయినీ, అప్రెంటీసు వంటి పేర్లతో ఎలా పిలిచినా వారంతా ఉద్యోగుల కిందకే వస్తారు." 'యజమాని' (ఎంప్లాయర్) అంటే ఏ

ప్రభుత్వ శాఖకానీ, ప్రభుత్వ రంగ సంస్థకాని, స్థానిక ప్రభుత్వానికి సంబంధించి కానీ, సహకార సంస్థకానీ, విద్యాసంస్థకానీ, పరిశ్రమకు సంబంధించి కానీ, వాటి ముఖ్యకార్యాలయం కానీ, ఏ బ్రాంచి అయినా లేదా పని ప్రదేశమైనా అక్కడి ముఖ్య అధికారి, మేనేజిమెంటు, బోర్డు వంటివి అన్నీ దీనికిందికి వస్తాయి. ఏ పని ప్రదేశంలో పనిచేసేవారైనా ఈ చట్టపరిధిలోకి వస్తారు. అసంఘటిత రంగప్రదేశం అంటే వ్యక్తిగతంగా ఒక వ్యక్తి నడిపే సంస్థ, వస్తువుల తయారీ, అమ్మకం వంటి ఏ రకమైన సేవలందించే వాటితో సంబంధమున్నదైనా, పదిమంది కంటే తక్కువ పనివారున్న సంస్థ కూడా ఈ చట్టం కిందికి వస్తుంది. ఇతర పరిస్థితులతో బాటుగా కింది విధంగా లైంగికపరమైన ఉద్దేశ్యంతో ఏం జరిగినా అది కూడా లైంగిక వేధింపు కిందికి వస్తుంది. 1.తన పనిలో ప్రాధాన్యత కల్పించేటట్లు చేస్తానని భ్రమ పెట్టడం, 2. తన పనిలో తక్కువస్థాయిలో పని కల్పించేటట్లు బెదిరింపుగా వ్యక్తీకరించటం, 3.ఉద్యోగిని ఉద్యోగం ప్రస్తుతం లేదా వర్తమాన స్థాయిపై ప్రభావం చూపటం 4.ఉద్యోగిని చేసే పనిలో జోక్యం చేసుకొని సాన్నిహిత్యం నెరపటం లేదా ఆమెని వేధించటం, తదితరాలు, 5. ఆమె ఆరోగ్యం, రక్షణలపై ప్రభావం చూపేట్లుగా బాధలకు గురిచేయటం వంటివన్నీ పని ప్రదేశంలో వేధింపుల కిందకే వస్తాయి. ఈ చట్టం ప్రకారం ప్రతీ యజమాని రాతపూర్వక ఉత్తర్వులతో 'అంతర్గత ఫిర్యాదుల కమిటి' పేరుతో లైంగిక వేధింపుల నిరోధానికి పని ప్రదేశంలో ఒక కమిటీని ఏర్పాటు చేయాలి. ఒక సంస్థ కార్యాలయం, పరిశ్రమ వంటివి అనేక ప్రదేశాలలో హెడ్ ఆఫీసు, బ్రాంచి యూనిట్ వంటివి వేరువేరు చోట్ల ఏర్పాటు చేసిన పక్షంలో ప్రతిచోటా ఈ కమిటీని ఏర్పాటు చేయాలి. ప్రతి కమిటిలోనూ ప్రిసైడింగ్ అధికారిగా అక్కడ పనిచేసే స్త్రీని నియమించాలి. ఒకవేళ ఆ యూనిట్‌లో ప్రిసైడింగ్ అధికారిగా నియమించదగ్గ మహిళ లేనిపక్షంలో అదే సంస్థకు చెందిన ఇతర యూనిట్‌లో ఉన్న మహిళను నియమించవచ్చు. ఒకవేళ ఇతర యూనిట్లలో కూడా అందుకు అర్హమైన మహిళ దొరకని పక్షంలో ఇతర ఉద్యోగిని లేదా కార్మికురాలిని నియమించాలి. ఈ ప్రిసైడింగ్ అధికారంతోబాటు అక్కడి ఉద్యోగులలో స్త్రీల సమస్యల పట్ల అంకితభావం ఉన్న లేదా సమాజసేవారంగ అనుభవం ఉన్న లేదా న్యాయశాస్త్రం తెలిసిన స్త్రీలను ఇద్దరిని కమిటీ సభ్యులుగా నియమించాలి. ప్రభుత్వేతర సంస్థల నుంచి లేదా మహిళా సంఘాలకు

సంబంధించి కూడా ఒకరిని నియమించాలి. వీరికి నిర్దేశించిన ఫీజు, అలవెన్సులు చెల్లించాలి. ఈ కమిటీలలో కనీసం సగం మంది స్త్రీలే సభ్యులుగా ఉండాలి. ఈ కమిటీ మూడు సంవత్సరాలకు మించని కాలానికి పనిచేస్తుంది. తర్వాత కొత్త కమిటీని ఎన్నుకుంటారు. ఈ సభ్యులు ఎవరూ ఏవిధమైన నేరారోపణలు ఎదుర్కొన్నవారై ఉండకూడదు. ఒకవేళ అనంతరకాలంలో వారు ఈ రకమైన నేరారోపణలు ఎదుర్కొన్న పక్షంలో వారిని తీసివేసి కొత్తవారిని ఎంపిక చేసుకోవాలి. ఒకవేళ పదిమంది కంటే తక్కువ పనిచేసేవారున్న చోట్లు అయితే అటువంటి వాటికి జిల్లాస్థాయిలోని అధికారి ఆధ్వర్యంలో 'స్థానిక ఫిర్యాదుల కమిటీ' ఏర్పాటవుతుంది. జిల్లాస్థాయి అధికారి ప్రతిమండలం, గ్రామీణ గిరిజన ప్రాంతాలలో ఈ కమిటీ బ్రాంచీలను ఏర్పాటు చేస్తారు. ఈ కమిటీలు పని ప్రదేశాలలో స్త్రీలపై జరిగే వేధింపుల గురించిన ఫిర్యాదులు స్వీకరించి వాటిని ఏడురోజులలోగా విచారణకై 'స్థానిక ఫిర్యాదుల కమిటీ'కి అందేట్లు చూడాలి. ఈ స్థానిక కంప్లయింట్ కమిటీకి స్త్రీల సమస్యల పట్ల అంకితభావమున , సామాజిక సేవారంగంలో నిష్ణాతురాలైన స్త్రీని, చైర్ పర్సన్‌గా నియమించాలి. ఆమెతో బాటుగా ఆ జిల్లాలోని సదరు మండలం, మున్సిపాలిటి వంటి వాటి చోట్ల పనిచేస్తుండే స్త్రీని ఒకరిని, మహిళల కోసం పనిచేసే ప్రభుత్వరంగ సంస్థల ప్రతినిధి ఒకరిని, లైంగిక వేధింపుల సమస్యలపై పనిచేసేవారుగా పేరొందిన మరొకరిని సభ్యులుగా నియమించాలి. ఫిర్యాదుల కమిటీ తన విచారణను పూర్తి చేసుకున్న తర్వాత ఒకవేళ నేరారోపణకు గురైన వ్యక్తి వల్ల దోషం లేనట్లు తేలితే, తనపై ఏ చర్య తీసుకోరాదని యజమానికి గానీ, జిల్లా అధికారికి గానీ తెలియజేయవచ్చు. సమాచార హక్కు చట్టంలో ఏముందనే దానితో సంబంధం లేకుండా బాధిత మహిళకు . సంబంధించి ఆమెను గుర్తించే విధంగా వివరాలు ఏవీపత్రికలు, టీవీలతో సహా ఎవరూ బయట పెట్టకూడదు. ఒకవేళ ఎవరైనా బయట పెడితే వారు జైలు శిక్షకు గురౌతారు. నేటి సమాజంలో సమకాలీన పరిస్థితుల దృష్ట్యా లైంగిక వేధింపుల చట్టం గురించి ప్రతి స్త్రీ తెలుసుకుంటేనే తన చుట్టూ ఉన్న వాతావరణంలో ఎటువంటి లైంగిక వేధింపును అయినా ఎదుర్కోవటానికి మానసికంగా సంసిద్ధతతో సన్నద్ధమవుతుంది. ఆ మానసిక సంసిద్ధత నిజమైన స్త్రీ సాధికరత!



# చట్టాలపై సంపూర్ణ అవగాహనే రక్షణ

ఎన్నికల్లో తన భార్యకు మద్దతు ఇవ్వలేదని ఓ వ్యక్తి ఒక కుటుంబంపై పగ పెంచుకుని దాష్టికానికి పాల్పడ్డాడు. ఆ కుటుంబంలోని 13 ఏళ్ల బాలికపై సామూహిక అత్యాచారానికి పాల్పడి కిరాతకంగా హత్య చేశాడు. ఈ ఘటన జార్ఖండ్‌లో సంచలనంగా మారింది. అసలేం జరిగిందంటే పాకూరు జిల్లా లిట్టిపారా గ్రామ పంచాయితీలో 'ముఖియా' పదవి కోసం కొన్నాళ్ల క్రితం ఎన్నికలు జరిగాయి. ప్రేమలాల్ హంసద అనే వ్యక్తి భార్య ఈ ఎన్నికల్లో పోటీ చేశారు. అయితే బాధిత కుటుంబ సభ్యులు మాత్రం ఆమెకు ఓటు వేయలేదు. దీంతో వారి మూలంగానే తన భార్య ఓడిపోయిందన్న కోపంతో ప్రేమ్‌లాల్ రగిలిపోయాడు. జనవరి 8వ తేదీన బహిర్భూమికని వెళ్లిన బాలికను తన సోదరుల సహకారంతో అపహరించాడు. ఆపై వారంతా కలిసి, ఆ బాలికపై అత్యాచారానికి పాల్పడి, ప్రాణాలు తీశారు. చివరకు బాలిక మృతదేహాన్ని సమీపంలోని బ్లైవాన్ అటవీ ప్రాంతంలో వేసారు. ఈ ఘటన అత్యాచారాల్లోని పైశాచికత్వం కోణానికి ఓవైపు.

సంక్రాంతి పండుగకు ఇంటికి వస్తానని చెప్పిన కుమార్తె అంతలోనే తిరిగిరాని లోకానికి చేరిందనే సమాచారం కన్నవారిని కుదిపేసింది. ప్రేమోన్మాది

తన కూతురిని బలి తీసుకున్నాడని తెలిసి తల్లడిల్లిపోయారు. చేదోడువాదోడుగా ఉంటుందనుకున్న కూతురు ఇకలేదని తెలిసి కుప్పకూలిపోయారు. శ్రీకాకుళం జిల్లా రాజాం మండలం శ్యాంపురం పంచాయితీ గుయ్యాన వలసకి చెందిన బోను జానకి (24) మూసాపేట ప్రాంతంలో జనవరి తొమ్మిదవ తేదీన రాత్రి ప్రేమోన్మాది చేతిలో హత్యకు గురైంది. ప్రేమ పేరుతో ఆమెను వేధిస్తున్న ఆనంద్ ఆమె గొంతు నులిమి, కత్తితో పొడిచి దారుణంగా హత్యచేశాడు. ఈ రెండు ఉదంతాలు నెలరోజుల వ్యవధిలో జరిగినవే. బాలికలు, పెళ్లికాని యువతులపై దారుణాలు రోజురోజుకీ పెరుగుతున్నాయే తప్ప తగ్గడం లేదు. అలా అని పెళ్లి అయిన స్త్రీలు, వయసు పైబడ్డ స్త్రీలు భద్రంగా ఉన్నారని కాదు.

భర్త ఇంటిముందు ఆమె 54 రోజులు న్యాయపోరాటం చేసి చివరికి విజయం సాధించింది. గృహహింస చట్టం కింద నమోదైన కేసు కొట్టేసేంత వరకు భర్త ఇంట్లో ఆమె ఉండేందుకు, న్యాయస్థానం అవకాశం కల్పించింది. ఐదేళ్ల క్రితమే తనను ఇంటి నుండి గెంటేస్తే న్యాయంగా పోరాడి కొంతవరకు గెలిచింది ఆమె. ఆమె పేరు సంగీత. ఇది హైదరాబాద్‌లో చోటు చేసుకున్న ఘటన.. ప్రేమోన్మాదానికి 20 రోజుల్లోనే ఒకే రాష్ట్రంలో ఇద్దరు బలి అయ్యారు. దేశవ్యాప్తంగా జరుగుతున్న అరాచకాలకు అంతేలేదు. లాలాగూడ ప్రాంతంలో సంధ్యారాణి, మూసాపేటలో జానకి, అలాగే దేశవ్యాప్తంగా అతివలపై ఇప్పటికి ఆగని ఎన్నో అరాచకాలు వాటి మానాన అవి లెక్కల్లో కనబడుతూ జెట్ స్పీడ్‌తో దూసుకుపోతూ ఉన్నాయి. 'నిర్భయ' లాంటి చట్టాలు అమలులోకి వచ్చినా ఇప్పటికీ అతివలు బలవుతూనే ఉన్నారు. అవగాహన లోపమే ఇందుకు ప్రధాన కారణంగా నిపుణులు పేర్కొంటున్నారు. చట్టాలు చేసిన యంత్రాంగం తమ పని అయిపోయిందన్నట్లు చేతులు దులుపుకొన్నాయి. ఫలితంగా 'నిర్భయ' అంటే ఏమిటి? అందులో ఏముంది? ఏ రకంగా రక్షణ ఇస్తుంది? ఎలాంటి పరిస్థితుల్లో ఈ చట్టాన్ని ప్రయోగించాలి? అనే అంశాలు మహిళలకే కాదు. చివరకు దర్యాప్తు అధికారులకూ, పోలీసులకూ స్పష్టమైన అవగాహన ఏ మేరకు ఉన్నదో తరచూ వెలుగులోకి వస్తున్న ఈ ఉదంతాలు చెప్పకనే చెపుతున్నాయి. ఈ అవగాహనా రాహిత్యమే తరచూ ఘోరాలు, ఘాతుకాలు చోటు చేసుకునేందుకు ఊతమిస్తున్నాయి. 2012 డిసెంబరులో ఢిల్లీలో చోటు చేసుకున్న నిర్భయ ఉదంతంతో యావత్ భారతావని గళం విప్పింది. ఈ

ఉద్యమంతో ఖంగుతిన్న కేంద్ర ప్రభుత్వం ఇలాంటివి పునరావృతం కాకుండా ఉండేందుకు 'వర్మ కమిటీ' ఏర్పాటు' చేసింది. ఆపై దీనిని పట్టించుకొని కేంద్రం ఆ కమిటీ సిఫార్సులను పొందుపరచకుండా 'ఉరి'తో కూడిన ఆర్డినెన్స్‌ను అమలులోకి తెచ్చింది. దీనిపై విమర్శలు వెల్లువెత్తడంతో పార్లమెంట్‌లో చర్చించి నిర్భయ చట్టం తీసుకువచ్చింది. 2013 ఏప్రిల్ 2 నుంచి అమలులోకి వచ్చిన ఈ యాక్ట్‌లో ప్రత్యేకించి ఏర్పాటు చేసినవంటూ పెద్దగా లేవూ. అప్పటికే ఐపిసిలో ఉన్న యాసిడ్ దాడులు, ఆత్మగౌరవానికి, స్త్రీ తత్వానికి భంగం కలిగించడం, అత్యాచారం, లైంగిక వేధింపులు తదితర మహిళా సంబంధిత నేరాలను క్రోడీకరించి ఒకే గొడుగు కిందికి తెస్తూ విస్తృతం చేశారు. ఒక్కో సెక్షనుకు క్లాజు చేరుస్తూ విపులీకరించారు. మహిళలపై జరుగుతున్న అఘాయిత్యాలకు అడ్డుకట్ట వేయడానికి, నిందితుల్ని కఠినంగా శిక్షించడానికి ఇది ఉపకరిస్తుందని కేంద్రం ప్రకటించింది. నిర్భయ చట్టంలోని కీలకాంశాలపై సాక్షాత్తు పోలీసు అధికారులకే అవగాహన ఉండట్లేదు. ఫలితంగా దీని పరిధిలోకి వచ్చే కేసుల్ని సైతం మూసధోరణిలోనే పాతసెక్షన్ల కిందే నమోదు చేస్తున్నారు. 'నిర్భయ'లో ఉన్న మూడు అత్యంత సున్నితాంశాల కారణంగా దీని కింద నమోదయ్యే కేసుల్లో శిక్షణలు, పడే అవకాశం అధికంగా ఉంటుంది. చట్టం కింద నమోదయ్యే కేసుల్లో వైద్యుల నివేదిక సైతం న్యాయస్థానంలో ఆధారంగా మారుతుంది. ఈ కేసుల దర్యాప్తును రెండు నెలల్లోనే పూర్తి చేసి అభియోగపత్రం దాఖలు చేయాల్సి ఉంటుంది. న్యాయస్థానం సైతం దీని విచారణను ఆరునెలల్లో పూర్తి చేసి తీర్పు ఇవ్వాలి.

సాధారణ కేసుల్లో నిందితులకు 'బెనిఫిట్ ఆఫ్ డౌట్ అనే అంశం కలిసి వచ్చి నిర్దోషులుగా బయటపడుతుంటారు. అంటే సదరు నేరం నిందితుడు చేశాడో? లేదో? అని న్యాయమూర్తి భావించడం. అయితే నిర్భయ చట్టం కింద నమోదైన కేసులకు మాత్రం ఇది వర్తించదు. బాధితురాలు చెప్తోంది కాబట్టి కచ్చితంగా నేరం చేసి ఉంటారనే అంశం పరిగణనలోకి వస్తుంది. సాంకేతికంగా దీన్ని ప్రీజెమ్షన్ అంటారు. వీటివల్ల ఈ కేసుల్లో శిక్షల శాతం పెరిగి మరోకరు నేరం చేయడానికి భయపడే పరిస్థితి ఉత్పన్నమవుతోంది. ఇన్ని అవకాశాలు ఉన్నా అవగాహన లేమి కారణంగా అనేక కేసులు 'నిర్భయ' కింద నమోదు కావట్లేదు.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం, విదేశీ సంస్కృతి మోజులో యువత దారితప్పడం, తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య సరైన సత్సంబంధాలు లేకపోవడం, మత్తుమందులు, వ్యసనాలకు బానిసలు అవుతున్న యువత, సినిమా, మాస్ మీడియాల్లో మితిమీరుతున్న అశ్లీల ప్రభావం, మహిళల్ని వ్యాపార వస్తువుగా చిత్రీకరిస్తున్న ప్రకటనలు, చదువుకునే వయస్సులో తల్లిదండ్రుల నిర్లక్ష్యం కారణంగా ఆకర్షణ, ప్రలోభాలకు లోను కావడం, విపత్కర పరిస్థితుల్లో యువతులు, మహిళలు ఆత్మవిశ్వాసం కోల్పోవడం వంటి అంశాలే అఘాయిత్యాలకు ప్రధాన కారణాలు. మహిళలపై జరుగుతున్న దారుణాల్లో సగం కూడా పోలీసు వరకు రావడం, రికార్డుల్లోకి ఎక్కడం జరగడం లేదు. దీనికి పరువు, కుటుంబ నేపథ్యం వంటి ఎన్నో కారణాలు ఉంటున్నాయి. బాధితుల మౌనంతో వస్తున్న ఈ ఉదాసీనత ముష్కరులు మరింత రెచ్చిపోవడానికి ఊతం అవుతుంది. ఈ అంశానికి సంబంధించి చట్టం, పోలీసులు బాధితులకు కొన్ని ప్రత్యేక అవకాశాలు కల్పించారు. మహిళలపై జరిగిన నేరాలకు సంబంధించి పరిధితో సమస్య లేకుండా ఎక్కడైనా ఫిర్యాదు చేయవచ్చు. ఎట్టి పరిస్థితుల్లోనూ బాధితుల పేర్లు బయటకు రాకుండా పోలీసులు జాగ్రత్తలు తీసుకుంటారు. అవసరమైతే నిందితుల అరెస్టు సంబంధించిన అంశాన్ని మీడియాకు తెలుపరు. ఇలాంటి కేసుల్లో వీలున్నంతవరకు మహిళా అధికారిణులకే దర్యాప్తు బాధ్యతలు అప్పగిస్తారు. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో బాధితులు పోలీస్ స్టేషన్‌కు వెళ్లాల్సిన అవసరం లేకుండా దర్యాప్తు అధికారులే బాధితుల వద్దకు వస్తారు. న్యాయస్థానం కూడా బాధితుల్ని ప్రత్యేకంగా పరిగణిస్తుంది. వాదోపవాదనలన్నీ ఇన్ కెమెరాలోనే జరుగుతాయి. కేంద్ర ప్రభుత్వం అత్యంత శక్తివంతమైనదని చెప్పుకున్న నిర్భయ చట్టం అమలులోకి వచ్చినప్పటికీ రోజురోజుకూ మహిళలపై అఘాయిత్యాలు పెరుగుతూనే ఉన్నాయి. 'నిర్భయ' పై అవగాహన కల్పించడంలో సర్కారు విఫలం కావడమే ఇందుకు కారణం మరో కారణం మిగిలిన అంశాలను పట్టించుకోకపోవడం సమస్యను లోతుగా అధ్యయనం చేసి అది పునరావృతం కావడానికి కారణాలను గుర్తించాలి. వాటిని సాధ్యమైనంత వరకు కూకటివేళ్లతో సహా పెకిలించడానికి ప్రయత్నం చేయాలి. ఈ కీలకాంశాలను పట్టించుకుని మార్పుకోసం ప్రయత్నం చేయాలి. ఈ కీలకాంశాలను పట్టించుకుని మార్పు కోసం యంత్రాంగాలు ప్రయత్నం చేయకపోవడం కూడా నిర్భయ తర్వాత కూడా అనేకమంది – బలికావడానికి కారణమవుతున్నాయి.



# బిడియపడకుండా బయటపడండి

"ఒక ఫ్రెండ్‌గా చెబుతున్నా.. పంటిబిగువున భరించింది చాలు. . ఇకనైనా బయటపడండి..మగాళ్లలోని మురికితనాన్ని ఎండగట్టండి..మీకెదురైన వేధింపుల్ని ప్రపంచం ముందు పెట్టండి" అని నటి అలేసా మిలానో ట్వీట్ చేసిన తర్వాత 'మీ టూ' కాన్వాసింగ్ బాగా ఊపందుకుంది. లైంగిక వేధింపుల అభియోగాలు ఎదుర్కొంటున్న హాలీవుడ్ ప్రొడ్యూసర్ హార్వే వెయిన్‌స్టీన్‌కు వ్యతిరేకంగా ఓపెన్ కాల్ ఉద్యమం అక్టోబర్ 15న మొదలైంది. ఎప్పుడైనా, ఎక్కడైనా ఆకతాయిల నుంచి ఎదురైన లైంగిక వేధింపులను సవివరంగా రాసి సోషల్ మీడియాలో పోస్ట్ చేయవచ్చు అన్నదే ఈ ఓపెన్ కాల్ ఉద్దేశం. హాలీవుడ్‌లో హార్వే వెయిన్‌స్టీన్ అనే ప్రొడ్యూసర్ గురించి న్యూయార్క్ టైమ్స్ పత్రిక చేపట్టిన సీక్రెట్ కథనం పెనుసంచలనాలకే తావిచ్చింది. ఎంతోకొంత స్టార్ హీరోయిన్లు సైతం ఇతని చేతిలో లైంగికంగా వేధించబడ్డారు అంటూ స్టేట్ మెంట్లు ఇవ్వడం పెద్ద రచ్చకే దారితీసింది. ఒకరా ఇద్దరా పదుల సంఖ్యలో హార్వే బాధిత హీరోయిన్లంతా దాదాపుగా టాప్ స్టార్ స్థాయిలో ఉన్నవారు. ఏంజెలానా జోలే, కేట్ వినేట్ వంటి హాలీవుడ్ అగ్రతారలే కాదు ఆఖరికి మన భారతీయ స్టార్ ఐశ్వర్యరాయ్‌ని కూడా పొందాలని ప్రయత్నించాడట ఈ సెక్స్

పర్వర్ట్. అయితే ఈ సందర్భంగా బాధింపబడిన చాలామంది సినీ సెలబ్రిటీలు టీవీ నటీమణులు 'మీ టూ' అంటూ ట్విట్టర్లో తమ అనుభవాన్ని పంచుకున్నారు. 'నేను కూడా ఎదుర్కొన్నాను' అంటూ కృతి కర్బందా, దీని గురించి విన్నాను అంటూ రాధికా ఆప్టే ఓపెన్ అయ్యారు. ఈ విషయంపై అమెరికాలోని ఓ ప్రోగ్రామ్‌లో మాట్లాడాల్సిందిగా హాలీవుడ్ హీరోయిన్‌గా ఎదుగుతున్న ప్రియాంకచోప్రాను అడిగితే, 'ఇలా వేధించే పర్వం ఇండియాలో కూడా ఉంది. మీరు సినిమా ఇండస్ట్రీలోనే ఉందని అనుకోవద్దు. ఏ రంగంలో లేదో చెప్పండి? అన్ని రంగాల్లోనూ కొందరు పురుషులు మహిళలను ఇలా వేధిస్తున్నారు. అయితే వారు కేవలం సెక్స్ కోసం అలా చేయట్లేదు. పవర్ కోసం చేస్తున్నారు. ఒక అమ్మాయిని బానిస చేసుకుంటే అందులో తృప్తిచెందే మగ అహంకారం కోసం అలా చేస్తున్నారు. దీన్ని అరికట్టాలి' అంటూ ప్రియాంక కామెంట్ చేసింది. గ్లామర్ ఫీల్డ్‌లో ఇటువంటి ఉదంతాలు కొత్తేమీ కాదు. వెలుగులోకి వచ్చినప్పుడు హృదయం ద్రవించేలా చేసే ఇటువంటి సంఘటనలు ఎందుకు జరుగుతూనే ఉన్నాయి? ఎందుకు ఆగడం లేదు? సంఘటనలు, బాధితులు నాణేనికి ఓవైపు మాత్రమే. నాణేనికి ఇంకోవైపు కూడా ఉంది. ఓ ఉద్యోగంలో కొత్తగా చేరేటప్పుడు శిక్షణాకాలం ఉంటుంది. మన బాధ్యతలను ఉద్యోగంలో సక్రమంగా నిర్వర్తించడానికి ఆ కాలం చాలా బాగా ఉపకరిస్తుంది. అదేరకంగా సినిమా రంగం కూడా ఓ వృత్తి కదా! స్క్రీన్ మీద ముద్దులు, కౌగిలింతలు, అసభ్యకరమైన సన్నివేశాలు కొన్నైనా లేకుండా వచ్చే సినిమాలే అరుదు. అటువంటప్పుడు ఆ భావాలు స్క్రీన్ మీద ప్రదర్శించేముందు ఫలానా హీరోయిన్ ఎంతవరకు ఆ పాత్రకు నప్పుతుందో అని పరీక్షించడానికి ఓ ప్రొడ్యూసరో, డైరెక్టర్ ఎవరో ఒకరు చేయి వేస్తామనో అలా చేస్తామనో సమాధానం ఇస్తే.. దాన్ని ఎంతవరకు తప్పు పట్టగలం? నిజాయితీగా.. నిజంగా నిజం వ్యక్తీకరించాలంటే 'బాడీ పొలిటిక్స్'తో నడుస్తున్న రంగం అని తెలిసినప్పటికీ ఆ రంగంలోకి ప్రవేశించేవారు తర్వాత దానిలో తప్పులు ఎంచడానికి ఎంతవరకూ అర్హులు అవుతారు? సంఘటన జరిగినప్పుడు బయటపెట్టేవారు తక్కువ. పరిస్థితులతో సర్దుకుని ఎలాగో సెటిల్ అయిపోదాం అనే భావంతో సాగిపోయేవారే ఎక్కువ. మనకు నచ్చనవి, మన ఆత్మగౌరవాన్ని, వ్యక్తిత్వాన్ని నాశనం చేసే అంశాలు ఉంటాయని పూర్తిగా తెలుసుకుని వెళ్లేవారంతా అంతా అయిపోయాక కొన్ని సంవత్సరాల వ్యవధి తర్వాత గొంతెత్తితే ప్రయోజనం ఏముంది? ఆ

రోజు సమస్యగా అనిపించనిది ఈ రోజు  ఎందుకు సమస్యగా పరిణమించింది?' ఈ ప్రపంచంలో ఒకే అంశం అందరికీ సమస్యగా పరిణమించకపోవచ్చు. ఎందుకంటే అది వ్యక్తిగత ప్రాధాన్యతలు, అభిరుచులకు సంబంధించిన అంశం కనుక. 'అడుసు తొక్కనేల కాలు కడగనేల' అన్నది సామెత కావచ్చు. కానీ ఈ పరిస్థితికి ఇది సరిగ్గా నప్పుతుంది. 'ఇది సహజం ఎదగడానికి, ఒక మెట్టు' అని అనుకుంటూ ఏదైనా అవకాశం వచ్చినప్పుడు మన బాధను బయటపెడదాం అనే మనస్తత్వం ఉన్నంతకాలం ఇలాంటి ఉదంతాలకు ముగింపు అనేది ఉండదు. ఇలాంటి విషయాల్లో 'స్త్రీ సమానత్వం, స్త్రీ సాధికారత' అనే అంశాలు ఎంతమేరకు వర్తిస్తాయి? ఏ కోణంలో వర్తిస్తాయి? సినిమా రంగంలో స్త్రీ ప్రాముఖ్యత ఏమిటి? స్త్రీ నిజమైన భూమిక ఏమిటి? ఆమె పాత్ర నిజంగా నాయిక ధీరత్వానికి తగినట్టు ఉంటుందా? ఏ కోణంలోనైనా కించపరచబడుతుందా? ఈ ప్రశ్నలన్నింటికి స్పష్టమైన సమాధానాలు తెలియకుండా సమాధానాలు రాబట్టకుండా, ఏ సమానత్వం గురించి ప్రశ్నిస్తాం? లైంగిక వేధింపులు ఎందుకు ఎదురవుతాయి? ఓ వ్యక్తి సమానపాత్ర పోషించలేకపోవడం వల్లా? అవసరానికి కచ్చితంగా చేసి తీరతారు అనే పైశాచిక ధోరణి ఆ సినీపెద్దల్లో ఎందుకు అలవడుతుంది? వెనుక దాగి ఉన్న ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు స్పష్టం కాకుండా ఉవ్వెత్తున విరుచుకుపడటం పరిష్కారాన్ని చూపదు. స్త్రీ పాత్రను మసాలా మార్కెట్లోకి దిగజార్చిన వ్యవస్థను రూపుమాపకుండా ఇలా తాత్కాలిక ఉపశమన చర్యలు ఎన్ని చేపట్టినా ఒరిగేదేముంది? అడగాల్సింది లైంగిక వేధింపుల గురించి మాత్రమే కాదు. స్త్రీ పాత్రను దీనంగా చిత్రీకరిస్తున్న దారుణ పరిస్థితులను కూడా. ప్రతి వృత్తిలో కొన్ని నిబంధనలు, పరిస్థితులు ఉంటాయి. వాటికి ప్రామాణికాలు ఉంటాయి. అవకాశాల కోసం కొంత అతిక్రమించి, అవి అందనపుడు ఉద్యమించడం చివరికి ద్వంద్వ ప్రవృత్తిలోనే మిగిలిపోతుంది. ఇష్టం, మనసు ప్రాధాన్యతలు, విలువలు, వ్యక్తిగత అంశాలే అయినా అవి వ్యవస్థలో మార్పును తీసుకువచ్చేవిగా పరిణమించినప్పుడు సమగ్రచిత్రంగా అంశాన్ని చూసిన తర్వాతే అభిప్రాయభేదాలకు రావడం మంచిది. 'మొక్కై వంగనిది..' అన్న రీతిలో సమస్య మొదలైనప్పుడు స్పందించకపోతే ముదిరాక పరిష్కరించేలోపు ఇంకోవైపు సమస్య పునరావృతం అవుతుంది. 'మాకు కూడా నాయకుడిలా ధీరత్వాన్ని ప్రదర్శించే పాత్రలు కావాలి' అని అడగడం నిజమైన సమానత్వం అవుతుంది కానీ అశ్లీలతను

స్క్రీన్ మీద ప్రదర్శిస్తూ, దానిలో మునిగిపోతూ. , దానిపై ఉద్యమించిన దానికి నిజమైన బలం ఉండదు. రియల్ లైఫ్, రీల్‌లైఫ్ ఒకటి కాకపోవచ్చు. కానీ ఆ పాత్రల ప్రభావం పాత్రధారులపై ఉన్నా లేకపోయినా ప్రేక్షకుల మనసుపై కచ్చితంగా ప్రభావం చూపుతుంది అనేది మాత్రం నిజం. పాత్రల ఔచిత్యంలో జాగ్రత్తలు లోపించడం కూడా ఈ వింత ధోరణులకు ఓ కారణం అయి ఉండవచ్చు. ఓ సమస్య ఉద్భవించింది అంటే కచ్చితంగా దాని మూలాలు సమస్య పుట్టిన వ్యవస్థ భావజాలాలలో ఎక్కడో ఓ మూల ఉంటాయి. ఆ భావజాల సారూప్యాన్ని నిర్మాణాత్మకంగా మార్చుకోగలిగితేనే నిజమైన పరిష్కారం దొరుకుతుంది. రంగస్థలం నుండి సిల్వర్ స్క్రీన్‌కి పరిణామం చెందిన క్రమంలో వచ్చిన మార్పులు ఆహ్వానించదగినవి. కానీ ఆ క్రమంలో 'పాత్రచిత్రణ'లో చోటు చేసుకున్న మార్పులు అనూహ్యంగా సినీజగత్తు రూపురేఖలు మార్చేసాయి. ఆ రూపురేఖలు మార్పు రంగుల లోకాన్నే మార్చేసింది. ఇన్నాళ్లుగా మౌనంగా ఉన్న గొంతులు ఇప్పుడు వాస్తవాల్ని పలకడం ప్రశంసనీయమే. కానీ ఈ చర్యలు ఎటువంటి నిజమైన, ప్రభావితమైన మార్పులు తీసుకువచ్చాయి? లేకపోతే ఈ అంశం ఎన్ని రోజులకు పాతపడిపోతుంది? ఆచరణాత్మక మార్పుతో సాగే స్వరాలు మరిన్ని వెలుగులోకి రావాలని ఆశిద్దాం!



# ఉద్యోగినికి సమిష్టి ప్రోత్సాహం అవసరం

ప్రపంచ శ్రమ గంటలలో మహిళలు మూడింట రెండొంతులు పనిచేస్తున్నారు. అయితే ఆదాయం మాత్రం పదిశాతమే. ప్రపంచంలో అనేక ప్రాంతాల్లో గర్భవతులుగా ఉన్నప్పుడు మహిళల మరణాలు భారీగా నమోదు అవుతున్నాయి. భారతదేశం, చైనాలలో లింగనిష్పత్తి తగ్గిపోతుంది. దారిద్ర్యం, దురాగతాల్లో మహిళలే బలవుతున్నారు. పురుషులతో సమానంగా హక్కులు, అవకాశాలు కలిగి ఉన్నామని ప్రపంచంలో ఎక్కడా మహిళలు చెప్పుకునే పరిస్థితి లేదు. ప్రపంచ ఆస్తిలో మహిళలకు ఒక్కశాతంపైనే హక్కు ఉంది. ప్రపంచ దేశాధినేతలలో మహిళలు 5శాతం కంటే తక్కువ సంఖ్యలో ఉంటున్నారు. 13 కోట్లమంది 6-11 ఏళ్ల వయసున్న బాలల్లో పాఠశాలలకు వెళ్లని వారిలో 60 శాతం మంది బాలికలే. భారత సమాజంలో స్త్రీ, పురుషుల మధ్య అసమానత అన్నిరంగాల్లో ఉంటుంది. అది ఆడ శిశువు జన్మించిన నాటి నుండి మహిళ చావు వరకు ప్రతిబింబిస్తోంది. కుమారుల కంటే కుమార్తెలను కుటుంబానికి భారంగా పరిగణిస్తున్నారు. ఈ క్రమాన్ని పరిశీలిస్తే స్త్రీ తనను తాను నిరూపించుకుని, అస్తిత్వాన్ని నిలబెట్టుకోవడం కన్నా ఆమె సమాజ ఆమోదం పొందడం అన్నదే కష్టతరమైనది. పొంచి ఉన్న ప్రమాదం అపరిచితుల నుండి వస్తుందో లేకపోతే ఆప్తుల నుండి వస్తుందో ఆమె పసిగట్టేలోపే ఆమె అకృత్యాలకు

బలైపోతుంది.

ఇది బాహ్య సమాజపు కోణం. నాణేనికి రెండోవైపు చూస్తే కుటుంబ పరిసరాల్లో మగువ ఆలోచనా స్వేచ్ఛా పరిధి కూడా పరిమితమైనదే. నేటి పరుగుల ప్రపంచంలో పురుషులు ప్రతిభ ప్రదర్శిస్తే సరిపోతుంది. కానీ స్త్రీ ప్రతిభతోపాటు, సమస్యను పరిష్కరించే సామర్థ్యాన్ని, ప్రతి సందర్భంలోనూ ప్రదర్శించకపోతే ఆమెను సమానంగా చూసే పరిస్థితులు లేవు.

'ఒకప్పుడు స్త్రీలు ఉద్యోగాలు అంటూ కాలు బయటపెట్టని రోజులే బాగున్నాయి. అలా ఉండి ఉంటే స్త్రీల మీద దాడులు చాలావరకు తగ్గుతాయి' అని కొందరు వ్యక్తపరుస్తున్న అభిప్రాయం ఎంతవరకు సమర్థనీయం? నేటి జీవనశైలికి సరితూగేట్టు సంపాదించే పురుషులు ఎంతమంది ఉన్నారు? కుటుంబ బాధ్యతలో భాగం ఆమె తీసుకుంటున్నదే తప్ప అది ఆమె అభిజాత్యం కాదని గుర్తించి, ఆమెను గౌరవించే పురుషులెందరు? అక్కడ మొదలయ్యే ఇగోలు, చివరికి ఎటు దారితీస్తున్నాయి? పిల్లలపై ఈ పరిస్థితులు ఎటువంటి ప్రభావాన్ని చూపుతున్నాయి? ఇటువంటి నమస్యలకు మూలాలు ఏమిటి? స్త్రీలు 'వర్కింగ్ మెన్'ను (పనిచేసే పురుషులు) ఆమోదించి గౌరవిస్తున్నారు. కానీ చాలామంది పురుషులు 'వర్కింగ్ వుమెన్' సంస్కృతిని మనస్ఫూర్తిగా ఆహ్వానించలేకపోతున్నారు. దీనికి తాజా ఉదాహరణ బాంబే హైకోర్టులో అప్పీలైన ఓ కేసు. తన భార్య తనకు రాగానే మంచినీళ్లు కూడా ఇవ్వడం లేదని, రుచికరమైన వంటలు వండి పెట్టడం లేదని.. అందుకే విడాకులు కావాలని ఓ భర్త కోర్టులో కేసు వేశాడు. ఆ భార్య కూడా ఓ ఉద్యోగిని. కోర్టు ఈ కేసును కొట్టేసింది. స్త్రీ బయటికెళ్లి ఎన్ని బాధ్యతలు నిర్వహించినా ఆ ప్రతిభకు గుర్తింపు పక్కన పెడితే ఆమె చేస్తున్న పనిని హర్షించే కోణం చాలావరకు కనిపించడం లేదు. స్త్రీ ఉద్యోగం చేయడం అన్నది ఓ సాధారణ అంశంగా, పరస్పర గౌరవాన్ని, ఇంటి బాధ్యతలను కూడా పంచుకోవలసిన విషయంగా స్వాగతించే రోజులు ఇంకా రాలేదనే చెప్పాలి. వర్కింగ్ వుమెన్ ను గౌరవించే సంస్కృతి రానంతవరకు స్త్రీ సాధికారత అన్నది ఎండమావే. అటువంటి సంస్కృతి రావాలంటే వర్కింగ్ వుమెన్ కష్టాన్ని వాస్తవంగా గుర్తించి ఆమె ఆత్మగౌరవాన్ని నిలబెట్టే వాతావరణం ఆ ఇంట్లో ఉంటే చాలు. అది కుటుంబానికి సంబంధించిన అంశమే తప్ప భర్తకో, భార్యకో మాత్రమే పరిమితమయ్యే అంశం కాదు. అటువంటి సమిష్టి ప్రోత్సాహక కుటుంబ వాతావరణం ప్రతి వర్కింగ్ వుమెన్ ఇంట్లో వెల్లివిరియాలని ఆశిద్దాం!



# పబ్లిసిటీ స్టంట్ల సంఘర్షణ

మొట్టమొదటి మహిళా ప్రధాని ఎవరు? మొదటి మహిళా వ్యోమగామి. ఎవరు? మొదటి మహిళా న్యాయమూర్తి ఎవరు? ఇలాంటి ప్రశ్నలు చాలా క్విజ్ పోటీల్లో మనం వింటూనే ఉంటాం. కానీ ఏనాడు దేశానికి మొదటి మగప్రధాని ఎవరు? మొదటి మగవ్యోమగామి ఎవరు? మొదటి మగ న్యాయమూర్తి ఎవరు? ఈ తరహా ప్రశ్నలు ఎన్నడూ వినమూ. అలా 'మహిళ అనే పదం తగిలించబడటం ఆ స్త్రీ సమానత్వం లేదా విజయం సాధించింది అనడానికి సంకేతమా? స్త్రీకి రిజర్వేషన్ శాతం పెరగడం సమానత్వమా?' ఏదైనా అత్యాచారమో, అఘాయిత్యమో జరిగినప్పుడు పలు మహిళా సంఘాలు మీడియాలో గగ్గోలు పెట్టి, కొన్ని రోజుల తర్వాత ఆ ఉదంతాలు మరుగున పడటం సమానత్వమా? 'మహిళను ఓ వివాదాస్పద వస్తువుగా మారుస్తూ, దానికి స్త్రీ ఉద్ధరణ అనే పేరు పెట్టడం ఇవన్నీ పబ్లిసిటీ కోసం పరోక్షంగా చేసే స్టంట్లేనేమో!' ఈ మధ్య రెండు తెలుగు రాష్ట్రాలను ఊపేసిన అంశం రామ్‌గోపాల్ వర్మ 'గాడ్, సెక్స్ అండ్ ట్రూత్' ఈ యూట్యూబ్ ఫిల్మ్‌లో అమెరికన్ పోర్న్ స్టార్ నటించడం, అన్నది సంచలనాన్ని రేపింది. అది స్త్రీ ఆత్మాభిమానాన్ని, గౌరవాన్ని కించపరచడమే కాకుండా, ఇటువంటివి స్త్రీపై అత్యాచారాలు పెరిగేలా

పురిగొల్పుతాయని మహిళా సంఘాలు మీడియా సాక్షిగా ఉద్యమాలు చేసాయి. పోర్న్ అనేది మనకు కొత్త అంశం కాదు. భారతదేశం పోర్న్ చూడటంలో మూడవస్థానంలో ఉంది. ఎన్నో పోర్న్ వీడియోలు హల్‌చల్ చేస్తూనే ఉంటాయి. ప్రతిరోజు. కానీ వాటి వేటి మీద ధ్వజమెత్తని వీరంతా ఒక్క ఈ 'జిఎస్‌టి' మీదే ఎందుకు దండెత్తారు? సినిమాలు, షార్ట్‌ఫిల్మ్‌లు ఏ మనిషిని ప్రత్యక్షంగా ప్రభావితం చేయవు. అవి పరోక్ష మాధ్యమాలే. మరి రాష్ట్రంలో జనవరి నెలలో ప్రేమోన్మాదానికి బలైన యువతులు ఉన్నారు. ఆలాగే ఒడిషాలో ఓ మైనర్ బాలికపై గ్యాంగ్‌రేప్ జరిగిన తర్వాత ఆ పాప సూసైడ్ చేసుకున్న ఉదంతం ఆ రాష్ట్రాన్నే కాదు దేశాన్నే అట్టుడుకించింది. ఈ ఉదంతాలు పక్కన పెడితే 'పద్మావత్' సినిమా విషయంలో దీపికాపదుకొనె లాంటి స్త్రీ ఆత్మగౌరవం నిలబెట్టడానికై ఎవరూ ఇంతగా ఉద్యమించలేదే? జరుగుతున్న ఉదంతాలు, పరిష్కారానికై ఉద్యమిస్తాం అనే ముసుగుతో కొనసాగే కుహనావాదులను నిశితంగా పరిశీలిస్తే ఇవన్నీ కేవలం పబ్లిసిటీ స్టంట్లు అని అర్థమవుతాయి. సమస్య (లేదా) చర్చలు వచ్చినప్పుడు మాత్రమే మొహాలు తెరలపై చూపించుకునే వీరు ఆ తర్వాత ఆ సమస్య చివరికి ఏమైందో మాత్రం చెప్పడానికి నోరు విప్పరు. వాస్తవిక కోణంలో గమనిస్తే అసలు సమానత్వం అన్న అంశాన్ని ఏ ప్రమాణాల ఆధారంగా నిర్ధారించాలి అన్న స్పష్టత దాదాపు ఎవరికీ లేనట్టే కనిపిస్తూ ఉంటుంది. అభిరుచి, ఆత్మాభిమానం కలయిక సమానత్వం అని కొంతమేరకు నిర్వచించవచ్చు. అసలు సమానత్వం అన్న అంశం కేవలం యవ్వనంలో, ప్రౌఢ దశలో ఉన్న స్త్రీలకు మాత్రమే చెందిన అంశంగా ఎందుకు చిత్రీకరించబడుతుంది? మనం పెరిగిన వాతావరణం, ఆ వాతావరణం మనపై చూపే ప్రభావం గాఢంగా ఉంటుంది. బాల్యంలో ఓ ఆడపిల్ల తనకు ఇష్టమైన పనులు చేస్తానన్నప్పుడో లేక యవ్వనదశలో తనకు నచ్చిన చదువు చదువుతానని అన్నప్పుడో వచ్చే కుటుంబ వ్యతిరేకతతో సమానత్వాన్ని ప్రశ్నించే బీజం మొలకెత్తుతుంది. అక్కడి స్థితిగతుల్లో రాజీపడిపోయిన ఆ బాలిక లేదా యువతి తర్వాత జీవితంలో అటువంటి పరిస్థితులు పునరావృతం అయినా సాధ్యమైన మేరకు రాజీపడి సర్దుకుపోవాలనే మనస్తత్వాన్నే అలవరచుకుంటుంది. బాల్యం నుంచే సొంతఅభిరుచుల్ని, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోగలిగే ధైర్యాన్ని బాలికల్లో నింపగలిగే వాతావరణం నిర్మించగలిగితే నిజమైన సమానత్వం సజీవంగా వర్ధిల్లుతుంది. ఇది ఓ కోణం.

ఇంకో కోణాన్ని పరిశీలిద్దాం. మానవుని మనుగడకు, భవిష్యత్తుకు కేంద్రబిందువు 'బాలిక' యావత్ ప్రపంచం 'సేవ్ గర్ల్ చైల్డ్' అంటూ గొంతెత్తి నినదిస్తున్నది. రోజురోజుకు ప్రపంచవ్యాప్తంగా ఆడశిశువుల జననమరణాల లెక్కలు చూసి ఆందోళన చెందుతున్నది. క్షణక్షణం 'ఆడపిల్ల'ను రక్షించుకోడానికి తపనపడుతున్నది నేటి సమాజం. ఇంతగా ఆరాటపడే ఈ సమాజంలోని బాలిక పుట్టగానే చెత్తకుప్పలలో, మురికి గుంటలలో పారేసేవారు, ఆర్థికంగా కుంగిపోయి అమ్మాయిలను అమ్ము'కొంటున్న వారు ఉండడం శోచనీయం. అదేవిధంగా బాలికలను యువతులను, ఆడవారిని చులకనగా చూస్తూ మనోవేదనకు గురి చేస్తూ, చిత్రహింసలు పెడుతూ, చివరికి దుర్మార్గమైన పనులకు పూనుకుంటూ వారి జీవితాలకు అర్థాంతరంగా ముగింపు పలుకుతున్న దాష్టికదుష్టులు కూడా మనం జీవిస్తున్న ఈ సమాజంలోనే బతుకుతుండడం అత్యంత బాధాకరం. 2008వ సంవత్సరం నుండి మనదేశంలో ప్రతి సంవత్సరం జనవరి 24వ తేదీన జాతీయ బాలికల దినోత్సవం నిర్వహిస్తున్నది. సేకరించిన జనాభా లెక్కలలో బాలబాలికల నిష్పత్తిని పరిశీలిస్తే చాలా ఆందోళనకరంగా ఉన్నది. ఆరు సంవత్సరాలలోపు ప్రతి వెయ్యిమంది బాలురకు ఆడపిల్లలు 914 మంది మాత్రమే అందుబాటులో ఉన్నారు. ఈ పరిస్థితే  ఆందోళన కలిగించేలా ఉందంటే మనదేశంలో ఆడపిల్లను బతకనిచ్చేపరిస్థితి చాలా దయనీయంగా ఉన్నది. ఒక దగ్గర చదువు చెప్పవలసిన అధ్యాపకుడే విద్యార్థిని వేధిస్తాడు. దేశ రాజధాని అయిన ఢిల్లీలో ఇద్దరు అభం శుభం తెలియని చిన్నారులపై సామూహిక లైంగికదాడి (17-10-2015), మరో దగ్గర కంటికి రెప్పలా కాపాడుకోవలసిన తల్లిదండ్రులే కూతురిని వ్యభిచారం రొంపిలోకి తోయడం, ప్రభుత్వ ఉద్యోగాల పేరు చెప్పి యువతులకు గాలం వేసి బ్లాక్ మెయిల్ చేయడం... ఇవన్నీ నాణేనికి రెండోవైపు! తమ ఉనికిని, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకునే సంఘర్షణ ఓ వైపు, సమాజంలో దాష్టీకాల బారిన నపడకుండా తమను తాము కాపాడుకోవడం ఇంకో వైపు, స్త్రీ ఈ రెండు సంఘర్షణల మధ్య కొట్టుమిట్టాడుతుంటే అరచేతిలో వైకుంఠం చూపిస్తూ తమ పబ్లిసిటీ పబ్బం గడుపుకునే వారు ఇంకొందరు. సమానత్వం, వ్యక్తిగత అభిరుచులు, ఆలోచనలతో మేళ వించబడిన నిలువెత్తు స్త్రీ ఆత్మగౌరవ కోణమే తప్ప ఇదో పరుగు పందెమో, పోటీనో కానేకాదు.



# బ్యూటీమిత్ - విజయగండం

ఆకాశంలోకి చొచ్చుకుపోయే ఆత్మశక్తిని, అన్ని ఉద్యోగాల్లో లింగ తారతమ్యం లేకుండా దూసుకుపోయే శారీరక బలాన్ని సంతరించుకున్న నేటి 21వ శతాబ్దపు స్త్రీలను సైతం బలహీనపరిచే అంశం ఏమిటి? అది 'బ్యూటీ మిత్' యవ్వనంలోని చిన్నారులు మొదలుకొని, మధ్యవయసులోని ప్రౌఢలు, వృద్ధాప్య వనితల వరకు ప్రాచ్య, పాశ్చాత్య దేశాల స్త్రీల 'సెల్ఫ్ కాన్ఫిడెన్స్' (ఆత్మవిశ్వాసం) స్థాయిని దాదాపుగా నిర్ణయించేది శారీరక సౌందర్యమే అని మానసిక శాస్త్రవేత్తలు తమ పరిశోధనల ఫలితాల ద్వారా నిర్ధారించారు. టీనేజ్‌లో ఆడపిల్లలు ఎక్కువగా ఆకర్షణల వలలవైపు లాగబడటానికి కారణం ఓ ప్రత్యేకమైన గుర్తింపు కావాలనే అభిలాష బలంగా మనసులో ఉండడం వల్లే. మంచి చదువుతో, పోటీల్లో బహుమతులతో ప్రతిభ కొలమానంతో తెచ్చుకోవాల్సిన ఆ గుర్తింపు పెడదోవవైపు మళ్లడం వల్ల 'నువ్వు అందంగా ఉంటావు. నీవు బావుంటావు' అనే పొగడ్తల్లో తమ ప్రతిభను తూచుకోవడం వల్ల ఎందరో ఆడ పిల్లలు అమాయకత్వంతో ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్నారు. మధ్యవయసు స్త్రీల కుటుంబాల విచ్ఛిన్నం కావడానికి, అక్రమ సంబంధాల పరంపర కొనసాగడానికి కారణం కూడా ఒకచోట దక్కని గుర్తింపుని ఇంకొక

చోట పొందాలని చేసే ప్రయత్నమే. నయోమి వుల్ఫ్ అనే రచయిత్రి 'బ్యూటీ మిత్' అన్న తన పుస్తకంలో స్త్రీలు 'అందం' అన్న ట్యాబూవల్ల తమని తామే ఎలా అణచివేసుకుంటున్నారో వివరించింది. ప్రపంచంలోని ఏ దేశంలోని ఏ సమాజంలోనైనా ఉత్పన్నమయ్యే ఏ సమస్య అయినా కచ్చితంగా ఓ వ్యక్తి లేదా వర్గం అసంతృప్తి లేదా న్యూనత నుండే ఉద్భవిస్తుంది. అసంతృప్తి లేదా న్యూనత అనే కారణానికి కుటుంబ వాతావరణం, మాధ్యమాల ప్రభావం కూడా తోడవ్వడం సమస్య తీవ్రతను పెంచుతుంది. యుక్తవయస్సు వచ్చినప్పటి నుండి స్త్రీ, పురుషులిద్దరిలో 'స్పెషల్ అట్రాక్షన్' అనే ప్రేరణ ఏర్పడుతుంది. స్పెషల్ అట్రాక్షన్ అంటే అందరిలోనూ తనను వ్యక్తిగతంగా గొప్పగా గుర్తించాలనే తపన. వాస్తవానికి ఆ తపన మంచిదే. దానివల్ల జీవితంలో విజయం సాధించాలనే కసి, తపన పెరుగుతాయి. కానీ విజయం సాధించడం ఒక్కరోజులో జరిగే పనికాదు. శారీరక మార్పులు యుక్తవయసులో ప్రారంభం కావడం వల్ల ఆడపిల్లలు, మగపిల్లలిద్దరూ తమ మనసులోని భావాలను ఎవరితోనూ పంచుకోవడానికి మగ్గుచూపరు. కొన్ని దశాబ్దాల క్రితం ఉమ్మడి కుటుంబాల పరంపరలో పిల్లలు తమను 'స్పెషల్ పర్సన్స్ 'గా గుర్తించి ఎప్పుడూ ప్రేమనే తప్ప కోపం వచ్చినప్పుడు కూడా విసుగు ప్రదర్శించని నాయనమ్మ, తాతయ్యల నీడలో తమ మనసులో రోజురోజూ పేరుకుంటూ పోయే భావాలను పంచుకునే వెసులుబాటు ఉండేది. ఒక్క జనరేషన్ గ్యాప్ ఉన్న తల్లిదండ్రులంటే భయభక్తులు, రెండు జనరేషన్ల గ్యాప్ ఉండే నాయనమ్మ, తాతయ్యలతో ఉండే అనుబంధంలో ప్రేమ, ఆప్యాయత, గారాబం వంటి కోణాలు ఉండటం వల్ల పిల్లలకు ఎప్పుడు స్పోర్టివ్‌గా, ఎప్పుడు సీరియస్‌గా వుండాలో తమకు తామే తెలుసుకునే వారు. కానీ కాలక్రమంలో సింగిల్ ఫ్యామిలీ, సింగిల్ పేరెంట్ లాంటి వ్యవస్థలు రావడం వల్ల పిల్లలు పూర్తిగా భయభక్తులతోనే లేక పూర్తిగా గారాబంతోనో పెరగడం వల్ల ప్రలోభాలకు లొంగిపోయే అవకాశాలు ఎక్కువ. దానికితోడు టెలివిజన్ లాంటి మాధ్యమాల ప్రభావం కూడా చాలా తీవ్రంగా ఉంటుంది. తల్లిదండ్రులు వారివారి ఉద్యోగాలతో బిజీ అయిపోవడం వల్ల పిల్లలు టీవీలకో, సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు అయిన ఫేస్ బుక్, వాట్సప్‌లకు అతుక్కుపోతున్నారు. టెలివిజన్ లాంటి మాధ్యమాల్లో ప్రసారమయ్యే కార్యక్రమాల్లో నాయకుడు, నాయకను అనుకరించడమే జీవితం అనే భ్రమలో పడుతున్నారు యువత. స్క్రీన్ మీద 'స్త్రీ'ని సౌందర్య ప్రధాన పాత్రగా ఎక్కువగా ఫోకస్ చేయడం వల్ల

యుక్తవయస్సు లోని ఆడపిల్లలు తాము కూడా అదే పాత్రలో పరకాయ ప్రవేశం చేయడానికి ప్రయత్నిస్తారు. అలా మొదలయ్యే బ్యూటీ మిత్ స్త్రీలకు దాదాపు జీవితాంతం ఉంటుందని పరిశోధకుల అంచనా. విద్య, విగ్రహపుష్టి, వాక్కు, వస్త్రం, వైభవం ఈ 'వ'కార పంచకం ఉన్న వ్యక్తి ఉన్నతికి కొదువ ఉండదు లోకంలో అని మనుస్మృతి మాట. 'విగ్రహపుష్టి' అంటే బాహ్యాలంకారాలు కాదు! ఆత్మవిశ్వాసం, చిరునవ్వుతో అంతర్గతంగా అలంకరించబడిన వ్యక్తిత్వం. ఆ వ్యక్తిత్వం ఉన్నప్పుడు మనం ఉన్న వాతావరణం మనవల్ల ఆహ్లాదభరితంగా మారుతుంది. అదే నిజమైన సౌందర్యసాధనం. ఆత్మన్యూనతతో బాధపడే పిల్లలు, ఒక్కరే సంతానం అయిన పిల్లలు చాలా త్వరగా ప్రలోభాల బారిన పడే అవకాశం ఉంటుంది. తోబుట్టువులు ఉండే పిల్లల్లో తెలియకుండానే ఓ రకమైన రక్షణ భావం కలుగుతుంది. అలాగే అన్నదమ్ములు, అక్కచెల్లెల్లు తమ తోబుట్టువులు చేసే పనులను గమనిస్తూనే ఉంటారు. అందువల్ల కూడా వారు పెడదోవపట్టే అవకాశాలు తక్కువ. స్వయంకృషి స్వావలంబన ద్వారానే సమాజంలో ప్రత్యేక గుర్తింపు, హోదా వస్తాయని పిల్లలకు చిన్నప్పటి నుండి వారి మెదడుల్లో నాటుకునేలా తెలియచెప్పగలిగితే సమాజంలో నేడు స్త్రీ, పురుషుల అసంబద్ధ ప్రవర్తనల వల్ల తలెత్తుతున్న అనేక రుగ్మతలు మటుమాయం అవుతాయి. బాల్యం నుండే పిల్లలతో ఎక్కువ సమయాన్ని గడపడం, రోజురోజుకీ మారే వారి మనఃస్థితిని గమనిస్తూ ఉండటం, ఎప్పుడైనా వారిలో దిగులు తలెత్తినప్పుడు ధైర్యాన్ని, కౌన్సెలింగ్ ద్వారా నింపడం వంటివి చేయడం వల్ల పిల్లలకు, తల్లిదండ్రులకు మధ్య అడ్డుగోడలు తొలగిపోతాయి. ఒక్కసారి పిల్లలకు తల్లిదండ్రులతో తమ మనసులో చెలరేగే అన్ని భావాలను పంచుకోగలిగే 'సంకుచిత్వం పోయిన స్థితి' ఏర్పడినప్పుడు తల్లిదండ్రులు దాని తర్వాత దశగా పిల్లలపై మాధ్యమాల ప్రభావాన్ని కూడా గమనిస్తూ ఉండాలి. ఫేస్‌బుక్, వాట్సప్‌లాంటి సోషల్ నెట్వర్కింగ్ సైట్లలో పిల్లల ప్రవర్తనను కూడా ఓ కంట కనిపెడుతూ ఉండాలి. విద్య, విజ్ఞానాలకు కూడా వేదికగా మారిన ఈ సోషల్ నెట్వర్కింగ్ సైట్లను ఎలా వాడాలో కూడా వివరంగా తెలియజెప్పితే ఇంకా మంచిది. ప్రతి వారం వారి ప్రవర్తనను అంచనా వేస్తూ, ఏమైనా సమస్యాస్పదంగా అనిపిస్తే వారు చదువుతున్న పాఠశాలకు వెళ్లి అక్కడ ఉపాధ్యాయుల ద్వారాను, వారి స్నేహితుల ద్వారాను అసలు విషయం

తెలుసుకోవాలి. ఈ చర్యలన్నీ పిల్లల మనసుపై గాఢమైన ప్రభావాన్ని చూపుతాయి. తల్లిదండ్రులు తాము చేసే ప్రతి పనిని జాగ్రత్తగా గమనిస్తున్నారనే భావన ఓ వైపు, పిల్లల్లో తప్పు చేయాలనే తలంపు ఇంకో వైపు! పిల్లల్లో తప్పు చేయాలనే తలపు తలెత్తినా వారిలో ఓ వైపు భయాన్ని, ఇంకోవైపు తల్లిదండ్రులపై ప్రేమ నింపడం వల్ల వారు అటువంటి తొందరపాటు చర్యలు చేసే అవకాశాలు తక్కువ. సమాజంలో ఏ అత్యాచారం జరిగినా దానిలో నిందితులు, బాధితుల బాల్య ప్రభావం తీవ్రంగా ఉంటుంది. నిరాధరణకు గురైన పిల్లలే భవిష్యత్తులో కర్కశమైన నేరస్తులుగా మారే అవకాశం ఉంటుంది. కనుక బాల్యంలో ఓ ప్రోత్సాహకరమైన, రక్షణ కల్పించే వాతావరణాన్ని సృష్టించగలిగితే ఆరోగ్యకరమైన సమాజం రూపొందుతుంది. స్వావలంబనకున్న ప్రాధాన్యతను పిల్లలకు బాల్యం నుండే నొక్కి చెబుతూ ఉండాలి. వక్తృత్వం వ్యాసరచన, చిత్రకళ, ఆటలు వంటి పోటీల్లో పాల్గొనేలా పిల్లల్ని ప్రోత్సహించాలి. మొదట్లో వారు ఏ కళలోనూ నైపుణ్యాన్ని ప్రదర్శించలేకపోవచ్చు. పాల్గొన్నందుకు ప్రోత్సహించడానికి చిన్న చిన్న బహుమతులు పిల్లలకు ఇవ్వాలి. క్రమేపీ వారి నైపుణ్యాలన్నీ గమనించాక వారు అందులో శక్తి పుంజుకునేలా ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. అలాగే మగపిల్లలు కూడా 'స్క్రీన్ హీరోయిజం' అనే ఉచ్చు నుండి బయటపడి నిజమైన హీరోయిజం ఉన్నత విలువలే అని గ్రహిస్తారు. స్వావలంబనే సౌందర్య సాధికారత, సాంగత్య సచ్ఛీలత సౌరభవికాస సంస్కారమే సక్సెస్ఫార్ములా.. వీటితో సాగితే వ్యక్తులే కాదు సమాజం కూడా 'సక్సెస్ గురువే!'

ఎప్పుడైతే బాల్యం నుంచే పిల్లలు నిర్మాణాత్మక పద్ధతిలో గుర్తింపు తెచ్చుకుంటూ చిన్న చిన్న విజయాల్ని బహుమతుల ద్వారా సాధించడం మొదలుపెడతారో వారిలో క్రమక్రమంగా లక్ష్యాలు పెట్టుకుని విజయాలు సాధించడంపై ఆసక్తి పెరుగుతుంది.

ఇటువంటి రీతిలో బాల్యాన్ని గడపటం వల్ల పిల్లలు 'సక్సెస్' నిజమైన సౌందర్యం అని గుర్తిస్తారు. దీనివల్ల ఆడపిల్లలు 'శారీరక సౌందర్యం' అనే ట్రాప్ నుండి బయటపడి 'వ్యక్తిత్వ సౌందర్యం' నిజమైన సౌందర్యం అని గుర్తిస్తారు.



# అరాచకపు కోరలలో

"సాక్ష్యం సరిగా లేదు అంటే సరైన సాక్ష్యానికి తావే లేదని అర్థంకాదు. తప్పుగా భావిస్తున్నదానికి ఆధారం లేదు అని సారాంశం"

–జాన్ స్టువర్ట్ మిల్ (బ్రిటిష్ తత్వవేత్త, రాజనీతిజ్ఞుడు)

నేరం జరగడం.. దాని తర్వాత దర్యాప్తులు జరగడం... ఎప్పుడో ఒకసారి నేరస్తులు వెలుగులోకి రావడం... వారికి శిక్ష పడటం... ఇది ఓ కోణం. ఇక్కడ ఏదో అసహజ సహజాతం వల్ల అరాచకానికి ఉరికొల్పబడిన ఆ తర్వాత ఎక్కడ మనసులో ఓ మూల పశ్చాత్తాపం కలగడం అనేది జరగడానికి చాలా వరకు ఆస్కారం ఉంది. అంటే చేసింది తప్పు అనే అభిప్రాయం నేరస్తుడిలో కలుగుతుంది. ఏదో ఓ బలహీన క్షణంలో.. సమన్వయం కోల్పోయి చేసే చర్యల విషయంలో సాక్ష్యాలు అనేవి బలమైన పాత్ర పోషిస్తాయి. ఆ క్రమంలో తప్పొప్పుల మీద స్పష్టత కచ్చితంగా ఏదో ఒక దశలో ఉంటుంది. కానీ తప్పు, ఒప్పుల మానసిక సంఘర్షణను దాటవేసి విపరీతమైన పైశాచకత్వ ధోరణితో కొన్ని నెలల పరిచయం తర్వాత... ఎదుటి వ్యక్తి సాధక బాధకాల్ని చూసిన తర్వాత కూడా... ఆ స్నేహ పరిమళాన్ని దుర్గంధం చేసి, దానికి ప్రేమ అన్న

పేరు పెట్టి... ప్రాణాన్ని దారుణంగా తీయడానికి ప్రయత్నించి... కాలిపోతున్న శరీరంలో... తనే కాల్చేసాను అనే వికృత విజయ హేళిని ఆస్వాదించి... తర్వాత న్యాయస్థానం ఎదుట లొంగిపోతే.. ఏది తప్పు, ఏది సాక్ష్యం... దేన్ని విచారించాలి? సమాజం, సాక్ష్యం, న్యాయస్థానాలు.. ఇవేమి కాదు... మానవత్వం మనిషిలో ప్రజ్వరిల్లేందుకు ఏదైనా కొత్త సమాజాన్నో కొత్త ప్రపంచాన్నో, సృష్టిస్తే బావుంటుందేమో!

చిన్నతనంలోనే చనిపోయిన తండ్రి, వివాహమైనా... ఇంట్లోనే ఉంటున్న అక్కలు, తల్లితోపాటు తనపైనే పడిన కుటుంబ పోషణ భారం... ఈ పరిస్థితుల మధ్య చిరుద్యోగంతో నెట్టుకొస్తున్న ఆ యువతి మనసు ప్రేమ వైపు మళ్ళలేదు. దీంతో ప్రేమ పేరుతో ఆమె వెంట పడుతున్న ఉన్న ఉన్మాది కక్షకట్టాడు. పథకం ప్రకారం ఆమెపై కిరోసిన్ పోసి నిప్పుపెట్టాడు. ఈ ఘాతుకానికి ఒడిగట్టిన ఉన్మాది స్వయంగా వచ్చి పోలీసుల ఎదుట లొంగిపోయాడు. హైదరాబాద్‌కి ఉత్తర మండల పరిధిలో ఉన్న లాలాపేట్‌లో డిసెంబర్ 21, గురువారం సాయంత్రం ఈ ఘోరం చోటు చేసుకుంది. 80 శాతం కాలిన గాయాలతో గాంధీ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న బాధితురాలి పరిస్థితి వర్ణనాతీతం. ఆ బాధితురాలే సంధ్యారాణి. నాటి అనురాధ నుండి నేటి సంధ్య వరకు ఎందరో బాధితులు!

ఇది ఒక్కటే ఉదంతం కాదు! రాజేంద్రనగర్ పరిధిలో వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య చదివే అనురాధపై యాసిడ్ దాడికి పాల్పడ్డాడు ఆమె సీనియర్. ఈ ఉదంతం అప్పట్లో తీవ్ర సంచలనం సృష్టించింది. దిల్‌సుఖ్‌నగర్ ప్రాంతంలో భార్గవి యాదవ్ అనే యువతిని వేధింపులకు గురిచేస్తున్న సంతోష్ ఒకరోజు రెచ్చిపోయాడు. కళాశాల నుండి తిరిగి వస్తున్న భార్గవిని సరూర్ నగర్‌లోని ఆమె ఇంటి సమీపంలోనే అత్యంత దారుణంగా హతమార్చాడు. కార్వాన్ ప్రాంతంలో వివాహిత రాణి వెంటపడిన కామాంధుడు కన్నయ్యసింగ్ ప్రేమ పేరుతో తీవ్రంగా వేధించాడు. ఎప్పటికీ ఆమె మాట వినట్లేదని కక్ష కట్టి కత్తితో దాడి చేశాడు. స్వాతి అనే యువతిపై బంజారాహిల్స్ పరిధిలో ఓ ప్రేమోన్మాది విరుచుకుపడ్డాడు. ఆమె బంధువుతో సహా సజీవ దహనం చేయాలని ప్రయత్నించాడు. వర్ధమాన నటి భార్గవిని ప్రేమోన్మాదిగా మారిన ప్రవీణ్‌కుమార్ హత్య చేసి ఆత్మహత్య చేసుకున్నాడు. బాలానగర్ ప్రాంతంలో అరుణ అనే బాలికపై ఆమె సమీప బంధువు శివశంకర్‌రెడ్డి దాడి చేసి హత్య చేశాడు.

అమీర్‌పేట టీఆర్‌ఆర్ కాలేజీలో లావణ్య అనే విద్యార్థినిపై ఓ మృగాడు దాడి చేశాడు. వనస్థలిపురం ఠాణా పరిధిలో విద్యార్థిని దివ్యను ఆమె సహవిద్యార్థే దారుణంగా హత్య చేశాడు.

పరిపక్వత లేని ప్రేమలే ఈ దారుణాలకు కారణం అనే అభిప్రాయం వ్యక్తం అవుతుంది. జీవితం విలువలపై అవగాహన లేని వయసులో పుట్టే ఆకర్షణే దారుణాలకు దారితీస్తోంది. తెలిసీ తెలియని వయస్సులో ఆకర్షణ – వ్యామోహంలో పడి దానినే ప్రేమగా భావిస్తున్నారు. ఆ తర్వాత ఇద్దరిలో ఎవరో ఒకరు అసలు విషయాన్ని గుర్తించి జాగ్రత్తపడితే.. రెండోవాళ్లు రెచ్చిపోతున్నారు. దీంతో ఆత్మహత్య చేసుకోవడమో.. లేదా హత్యకు తెగబడటమో చేస్తున్నారు. ఒక్క సందర్భంలో బెదిరింపులు, బ్లాక్‌మెయిల్, దాడులకు పాల్పడి కటకటాల్లోకి చేరి జీవితాన్ని నాశనం చేసుకుంటున్నారు. ఆడపిల్లలపై ప్రేమోన్మాదులు కత్తులతోనే, యాసిడ్‌తోనో దాడులకు తెగబడినప్పుడల్లా 'నేరగాళ్ళను కఠినంగా శిక్షిస్తాం. ఇటువంటివి పునరావృతం కాకుండా చూస్తాం' అంటూ ప్రకటించే అధికార యంత్రాంగం, పాలకుల హామీలు నిత్యకృత్యంగా మారిపోయాయి.

నగరంలోనే కాదు... రాష్ట్ర వ్యాప్తంగా ఎక్కడైనా ఈ తరహా ఉదంతం ఒక్కటి జరిగినా పోలీసులు 'అత్యంత అప్రమత్తం' అవుతారు. పోకిరీలు, ప్రేమోన్మాదులను కట్టడి చేయడానికి అనేక చర్యలు తీసుకుంటున్నామంటూ ఊదరగొడతారు. ఓ నాలుగు రోజుల పాటు కళాశాలలు, హాస్టల్స్ ఉన్న ప్రాంతాల్లో పెట్రోలింగ్స్ ఉధృతం చేస్తారు. అంతకుమించి తీసుకుంటున్న కఠిన చర్యలు ఏమీ కనిపించవు. ఏదైనా ఉదంతం జరిగినప్పుడు కేసు నమోదు చేసినా.. ఇది దర్యాప్తు పూర్తి చేసుకుని, న్యాయస్థానంలో విచారణ పూర్తయి, దోషులకు శిక్ష పడటానికి సమయం పడుతోంది. ఇవన్నీ ఇలాంటి ఉన్మాదులు రెచ్చిపోవడానికి కారణాలుగా మారుతున్నాయి.

పెద్దల పర్యవేక్షణ లోపించడం కూడా ఇటువంటి ఉదంతాలకు కారణంగానే పరిగణించవచ్చు. యుక్తవయస్సు వచ్చిన పిల్లల్లో అనేక మార్పులు చోటు చేసుకుంటాయి. ఒక్కసారిగా స్వేచ్ఛ వస్తుంది. ఆ సమయంలో వారిపై తల్లిదండ్రులు ప్రత్యేక శ్రద్ధ చూపాల్సి ఉంటుంది. అయితే ప్రస్తుత యాంత్రిక జీవితంలో ఉన్నత కుటుంబాలకే కాదు.. మధ్య తరగతి వారిలోనూ పిల్లలపై శ్రద్ధ తగ్గింది.

ఫలితంగా యుక్తవయస్సు రాగానే పెడదారులు పడుతున్నారు. ప్రేమ వ్యామోహంలో పడుతున్నారు. ఇవే సినిమా – టీవీల ప్రభావంతో ఒక్కోసారి దారుణాలకు దారి తీస్తున్నాయి. మరోపక్క విద్యాసంస్థలు,కాలేజీల యాజమాన్యాలకు విద్యార్థుల బాగోగులు పట్టించుకువి, వారికి జీవితం విలువ తెలియజెప్పే తీరిక లేకుండా పోయింది. అనునిత్యం వీరి దృష్టి అంతా పరీక్షలు, ర్యాంకుల పైనే. జీవిత ప్రస్థానంలో కీలకమైన యుక్తవయస్సులో యువతీయువకులపై పర్యవేక్షణ కొరవడి దారితప్పుతున్నారు.

సమాజంలో మహిళలకు గల సమున్నత స్థానం, వారి హక్కులను యువతకు బోధించాలన్న ఉద్దేశంతో రూపొందినదే జాతీయ యువజన విధానం. మహిళల పట్ల యువజనులు గౌరవంగా మసలుకొనేలా వారికి అవసరమైన కౌన్సిలింగ్ ఇవ్వాలని ఇందులో స్పష్టంగా పేర్కొన్నారు. ఆ లక్ష్యాలు నెరవేరేలా ప్రభుత్వాలు చర్యలు తీసుకున్న దాఖలాలే లేవు. యువజనులకు 13–19, 20–35 ఏళ్ల మధ్య వయస్సు గలవారిగా రెండు గ్రూపులుగా విభజించారు.

యవ్వన దశలో కీలకమైన 13–19 ఏళ్ల మధ్య వయస్కులకు ప్రత్యేక గుర్తింపు ఇవ్వాలనే అందులో నిర్దేశించారు. ప్రేమోన్మాదులు, వారి బారినపడుతున్న వారిలో అత్యధికులు వీరే. జాతీయ యువజన విధానంలో రూపొందించిన విధంగా ఇక్కడి సమాజంలో స్త్రీల స్థానం, వారికి గల హక్కులపై మగపిల్లలకు చక్కని అవగాహన కల్పించడంలో కానీ, మహిళల పట్ల గౌరవంగా మసలుకొనేలా కౌన్సిలింగ్ చేయడంలో కానీ ప్రభుత్వాలు ఎంతటి 'చిత్తశుద్ధిని' చూపిస్తున్నాయో జరుగుతున్న, పెరుగుతున్న ఉదంతాల సాక్షిగా తెలుస్తూనే ఉంది.

యాంత్రిక జీవనంలో ఆత్మీయత, అపేక్ష కొరవడి మృగాళ్లగా మారుతున్న తరుణంలో సమస్యకు మూలాలు మళ్ళీ మన వ్యవస్థలోని లోటు పాట్లనే వేళెత్తి చూపుతాయి. కనుక మానవత్వం అనే కొత్త ప్రపంచం సృష్టితోనే ఈ సమస్యకు పరిష్కారం సాధ్యం.



# విషసంస్కృతి వలయం

**–శృంగవరపు రచన**

ఓ నేరాన్ని చట్టబద్ధం చేస్తే ఆ నేరం సంస్కరణగా మారిపోతుందా? స్త్రీ దేవత అనో, త్యాగమూర్తి అనో ఒప్పుకోవాలన్నది ఏ స్త్రీ హృదయము కాదు. 'స్త్రీ ఓ మనిషి' అనే ప్రాథమిక సూత్రాన్ని గురించిన స్పృహ అందరిలో ఉండాలన్నదే అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు ఉండే స్ఫూర్తి.

అసిఫా అత్యాచారం మొత్తం దేశాన్నే కదిలించింది. ఆ అత్యాచారంతో స్త్రీలపై జరిగే అకృత్యాలకు వయసుతో నిమిత్తం లేదని, అలాగే అత్యాచారాలకు పాల్పడేవారు ఏ కారణంతోనైనా పసిపాపల్ని కూడా బలి చేయవచ్చని కూడా స్పష్టం అయ్యింది. దాని తర్వాత అసిఫా అనాధ అని, ఆమె మీద ఏ అత్యాచారం జరగలేదనే అబద్ధాన్ని నమ్మించే బాధ్యతను కొందరు తీసుకున్నప్పటికీ అది విఫలమైంది. అసిఫా అత్యాచారం శిశువులపై అత్యాచారాలకు ముగింపు పలకలేదు. దురదృష్టవశాత్తూ ఆ సంఘటన తర్వాత శిశువులపై అత్యాచారాలు ఇంకా వెలుగులోకి వచ్చాయి. ఇది ఓ కోణం. వీటిని అత్యాచారాలుగా పరిగణించడం జరుగుతుంది.

కానీ భార్యాభర్తల మధ్య ఇటువంటి సందర్భం తలెత్తితే అప్పుడు పరిస్థితి

ఏమిటి? మారిటల్ రేప్ అంటే భార్య సమ్మతితో సంబంధం లేకుండా భర్త శృంగారంలో పాల్గొనడం అన్నది ఓ అర్థం. దీనిని ఎన్నో దేశాల్లో నేరంగా పరిగణించారు.

కానీ భారతదేశంలో మాత్రం నేడు దానికి పూర్తిగా చట్టభద్రత లేనట్టుగానే స్పష్టం అవుతుంది. పోయిన సంవత్సరం మైనర్ భార్యతో శృంగారంలో పాల్గొనడానికి అనుమతిస్తున్న నిబంధనల రాజ్యాంగ బద్ధతను ప్రశ్నిస్తూ సుప్రీంకోర్టులో ఓ పిటీషన్ దాఖలైంది. భార్యతో బలవంతంగా శృంగారంలో పాల్గొనడాన్ని (మారిటల్ రేప్) నేరంగా పరిగణించలేమని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. ఈ విషయమై భారత పార్లమెంటు సైతం గతంలో విస్తృతంగా చర్చించిందని జస్టిస్ ఎంబీ లోకూర్, జస్టిస్ దీపక్ ధర్మాసనం తెలిపింది.

ఐపీసీ సెక్షన్ 375 ప్రకారం భార్య వయస్సు 15 ఏళ్ళ లోపుంటే ఆమె ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా శృంగారంలో పాల్గొంటే నేరమవుతుంది. ఒకవేళ భార్య వయస్సు 15 ఏళ్ళకు పైబడి 18 లోపుంటే అప్పుడు ఆమె అంగీకారాం లేకుండా శృంగారంలో పాల్గొన్నా నేరం కాదని కోర్టు పేర్కొంది. ఇది ఓ కేసు.

దీని తర్వాత తాజాగా ఈ ఏప్రిల్ నెలలో ఇంకో కేసు గుజరాత్ కోర్ట్‌లో దాఖలైంది. అక్కడ కూడా మారిటల్ రేప్ నేరం కాదని గుజరాత్ హైకోర్టు అభిప్రాయపడింది. అసహజ పద్ధతుల్లో శృంగారం, ఓరల్ సెక్స్‌ని మాత్రం క్రూరత్వానికి సమానమని పేర్కొంది. ఓ మహిళా డాక్టర్, ఆమె భర్తపై చేసిన ఫిర్యాదు విచారణకు వచ్చిన సమయంలో ఈ విధంగా కోర్టు వ్యాఖ్యానించింది. తనభర్త బలవంతంగా, తన ఇష్టానికి వ్యతిరేకంగా లైంగికంగా వేధిస్తున్నాడని.. తన ఇష్టానికి వ్యతిరేకంగా లైంగికంగా వేధిస్తున్నాడని.. కట్నం కోసం వేధింపులకు పాల్పడుతున్నాడని ఆమె ఫిర్యాదు చేయడంతో పాటు కేసు పెట్టింది. దీంతో ఆమె భర్త గుజరాత్ హైకోర్టును ఆశ్రయించాడు.

పై కేసు తరహాలోనే భార్య అనుమతి లేకుండా ఆమెతో భర్త శారీరక సంబంధాన్ని పెట్టుకోవడాన్ని రేప్‌గా పరిగణించలేమని జస్టిస్ జేబీ పార్దివాలా వ్యాఖ్యానించారు. అలాగే భార్య వయసు 18 సంవత్సరాల కంటే తక్కువగా లేనందున భారత శిక్షా స్మృతిలోని 375 కింద రేప్‌గా పరిగణించడం కుదరదని న్యాయమూర్తి పేర్కొన్నారు. కానీ ఐపీసీ 377 కింద అసహజ పద్ధతుల్లో శృంగారం చేస్తున్న విషయం మీద కేసు వాదనలు సాగించవచ్చునని ఆమెకు సూచించారు.

సక్రమంగా పెళ్ళి చేసుకున్న భార్యతో శృంగారం జరిపే హక్కు భర్తకు

ఉన్నదని పేర్కొంటూనే భర్త, భార్య ఇష్టం లేకుండా శృంగారం జరపకూడదని గతంలో హైకోర్టు ఇచ్చిన తీర్పును ఈ సందర్భంగా ప్రస్తావించారు. వరకట్నం, లైంగిక వేధింపులను తీవ్రంగా పరిగణిస్తామని స్పష్టం చేశారు. ఈ కేసు సీబిఐ లేదా సీఐడీ లాంటి పెద్ద దర్యాప్తు సంస్థలకు అప్పగించేందుకు న్యాయమూర్తి అంగీకరించలేదు.

పై రెండు ఉదంతాలను పరిశీలిస్తే స్త్రీని మనిషిగా కాక శారీరకంగా మాత్రమే పరిగణించడం జరుగుతుంది. శిశువులపై అత్యాచారం నేరం అంటే దానర్థం శిశువులు కానీ వారిపై అత్యాచారాలు చెయ్యవచ్చని కాదు కదా!

స్త్రీలపై లైంగిక వేధింపుల నిరోధనకు ఎన్నో చట్టాలున్నాయి. కానీ వాటి మీద స్పష్టత ఎంతమేరకు సమాజంలో ఉందన్నది ఎప్పటికీ ప్రశ్నార్థకమే. లొసుగులు మాత్రం ఎన్నో ఉన్నాయి. అత్యాచారం కన్నా బాధితురాలిని అత్యంతంగా వేధించేది దారుణంగా జరిగే మానసిక శీలహత్య.

స్త్రీకి పెళ్ళయితే లైంగిక వేధింపులు ఎప్పటికీ ఉండవని, భర్త ఆమెకు జీవితాంతం రక్షణగా ఉంటాడనే అభిప్రాయంతో చదువుకుంటున్న విద్యార్థినులను సైతం చదువు మధ్యలో ఆపు చేయించి బలవంతపు పెళ్ళిళ్ళు చేసే తల్లిదండ్రులు ఎందరో ఉన్నారు. కానీ బయటి లైంగిక వేధింపుల నుండి పరిష్కారం దొరికే ఆస్కారం ఉంటుంది. కానీ పెళ్ళి అనే చట్టభద్రతా హక్కుతో జరిగే లైంగిక పైశాచికత్వానికి మాత్రం ఎప్పటికీ పరిష్కారం ఉండదు.

ఒకవేళ సమస్య పెద్దదిగా పరిణమించినా పిల్లలు పుడితే వారి బాధ్యతల దృష్ట్యా స్త్రీ ఆ అత్యాచారాలకు అలవాటు పడిపోవాలని నిశ్చయించుకుంటుంది. ఈ సమస్యకు స్త్రీ విద్యతో, హోదాతో సంబంధం లేదు. ఆమె ఓ భార్య అయితే చాలు.

స్త్రీ శరీరాన్ని, ఇష్టాయిష్టాల్ని గౌరవించి ఆమెను ఓ మనిషిగా గుర్తిస్తే చాలన్నదే నేటి స్త్రీశక్తి స్ఫూర్తి. ఆ మనిషిగా గుర్తించడం అన్నది ఒక్కటే సమాజంలో అనేకంటే చాలా మంది భర్తల్లో లోపిస్తున్న అంశం. ఏ అంశాల ప్రామాణికంగా భార్యగా మాత్రమే కాక సమగౌరవాన్ని పొందే మనిషిగా ఆమె ఉనికి నిలబడుతుంది అన్నది ఎప్పటికి ఓ మిలియన్ డాలర్ ప్రశ్నే. ఎందుకంటే స్త్రీల విషయంలో ఓ సమస్య తలెత్తినప్పుడు దానికి పరిష్కారం లభించేటప్పటికే ఇంకొ కొత్త సమస్య, లేకపోతే అదే సమస్య ఇంకో కొత్త కోణంలో ఉదయిస్తుంది కనుక!



# ప్రేయసి పాత్రకే పరితమెందుకు?

ఆరోగ్యానికి హాని కలిగించే సన్నివేశాలు, ఏ జీవినైనా హింసించే సంఘటనలు సినిమాల్లో ఉంటే ఆరోగ్యానికి హానికరం అని, ఏ జీవికి నిజంగా హాని జరగలేదని సినిమాల్లో ధృవీకరిస్తారు. కానీ స్త్రీలపై అత్యాచారాల సన్నివేశాలు వచ్చినప్పుడు వాటి వల్ల ఏ ప్రభావం ఉండదు అన్నంత సహజంగా చూపిస్తారు. నిజానికి సినిమాల్లో స్త్రీ ఎప్పుడు ఆటలో అరటిపండే. ఎక్కడో స్త్రీ పధాన పాత్రధారి సినిమాల్లో తప్ప స్త్రీని ఎప్పుడు పురుషుడి స్టేటస్‌కి చిహ్నంగానో, గ్లామర్‌డాల్‌గానో మాత్రమే చూపడానికి పరిమితం చేస్తున్నారు.

సినిమాల్లో జరిగేవి ఏవి నిజం కాదనే అందరికి తెలుసు అందులో నాయకుడి చిత్రీకరణ నిజానికి బహుదూరంగా ఉంటుంది. అయినా అది సినిమా అని దాన్నికేవలం వినోద దృష్టితోనే చూడాలన్నది అందరం ఒప్పుకోవాల్సిన సత్యమే. ఓ గొప్ప సబ్జెక్ట్ ఉన్న సినిమాలో కూడా స్త్రీని ప్రేయసి పాత్రకే పరిమితం చేయడం సినిమాల్లో కూడా ఆమె సహజ ఊహలకు, అంచనాలకు తగ్గట్టు ఉండాలి అనే దృక్పథానికి సంకేతం.

సినిమా తెరపై నటించే నాయకుల్నిచూసినంత గౌరవంగా నాయకురాల్లను చూడరు. తెరపై కనపడితే ఓసారి చాలు అని అనుకునే మనస్తత్వం కలవారే ఎక్కువ. ఖడ్గం సినిమాలో ఒక్క ఛాన్సుకోసం జ్యోతిక, రవితేజ పడే తపన చూస్తే తెరకున్న గ్లామర్ ఏంటో స్పష్టంగా కనిపిస్తుంది. ఆ తపనలో పాత్ర ఔచిత్యాల

స్వేచ్ఛ స్త్రీలకు ఏమాత్రం ఉండదు.

ఇంకా దారుణమైన విషయం ఏమిటంటే సినిమాల్లోని అత్యాచారాల సన్నివేశాల్ని తర్వాత య్యూట్యూబ్‌లో అప్‌లోడ్ చేయడం. వాటి కింద కామెంట్స్ లాంటివి పరోక్ష అత్యాచారం ప్రవృత్తిని ప్రదర్శించేవే. ఫాంటసీలు ప్రతి స్త్రీ, పురుషులకు ఉంటాయి. ఎంతో సున్నితంగా ఉండాల్సిన ఆ ఫ్యాంటసీలు నేడు వికృత రూపాన్ని దాలుస్తున్నాయి.

ఆ వికృతకమైన ఫ్యాంటీసీలే సైకో మానసిక ప్రవృత్తిని ప్రేరేపిస్తున్నాయి. అవి కొంత మేరకు హత్యాచారాలకు పాల్పడేలా చేస్తున్నాయి. ప్రతి స్త్రీకి ఉండే వ్యక్తిగత స్వేచ్ఛ గురించి సమాజంలో అందరికి తెలియదు. అలాగే పురుషుడి గురించి కూడా తెలియదు. ఎందుకంటే వ్యక్తిగత కోణాలు ఎవరికి వారివి ఉ ంటాయి. కనుక తెరపై ఉండే ఈ హీరో హీరోయిన్లలను కొంత మేరకు అనుసరించే ధోరణి చాలా మందిలో ఉంటుంది.

ఆ ధోరణే కొంత మేరకు సమాజంలో సంకుచిత్వానికి కారణం అవుతుందని చెప్పవచ్చు సినిమా ఓ కళ. దాని లక్ష్యాలు, లక్షణాలు శాస్త్రీయమైనవే. కానీ పోటీ ప్రపంచంలో ఏ రసం ఏ మేరకు ఉండాలి అన్న నిబద్ధతపై కోల్పోయిన పట్టే దాన్ని కేవలం వాణిజ్య దృక్పథానికే పరిమితం చేస్తుంది.

సినిమాలు థియేటర్లలో చూసే వారిలో మగవారి సంఖ్యే అధికం. కనుక ఆడియన్స్ పల్స్ పేరుతో సినిమాల్లో ఆధిపత్య ధోరణి కొనసాగుతూనే ఉంది. స్త్రీలు కూడా పురుషుడు అలాంటి ధోరణితో ఉండడమే నాయకుడి లక్షణంగా పరిగణించడమే స్త్రీ ప్రేక్షకుల ఆదరణను కూడా చూరగొంది.

సినిమాలో స్త్రీ పాత్ర గురించి సినిమా చూసిన తర్వాత ఔచిత్య రీత్యా చర్చించుకునే వారి సంఖ్య కూడా తక్కువే. ఇలా ఏ కోణం నుండి చూసినా స్త్రీ ఓ ఆబ్జెక్ట్‌గా చిత్రీకరించబడుతుంది అన్నది వాస్తవం. సినీరంగంలో ఎపుడైనా స్త్రీ సమస్యలపై సినిమాలు వచ్చినప్పటికీ వాటిని విభిన్న రుచిగా పరిగణిస్తున్నారే తప్ప స్త్రీ ప్రధాన పాత్రల్లో ఉన్న సినిమాలను సహజమైనవాటిగా పరిగణించే సంస్కృతి ఇంకా రాలేదు.

ఏదీ ఏమైనప్పటికీ సినిమాల్లో స్త్రీ, జీవితంలో స్త్రీ ఎక్కడ కూడా ఊహల్లో కూడా స్త్రీకి గొప్పతనం ఆపాదించే పరిస్థితి లేదు. అటువంటి కోణం సహజంగా పరిఢవిల్లే సంస్కృతి రావాలని ఆశిద్దాం!



# స్వేచ్ఛకు సమాధి

స్త్రీ సమాజంలో ఎదుర్కొనే అన్ని సమస్యలతో పోరాడి పరిష్కరించుకోవడం సాధ్యమైన పని కాదు. వర్కింగ్ వుమన్ ఎదుర్కొనే సమస్యల్లో ఇంటి సమస్య ఒకటి. అందులోనూ 'సింగిల్ వుమన్' కష్టాల గురించి అయితే నేటి పరిస్థితులు దారుణంగా తయారయ్యాయి. ఇంటి ఓనర్ల నుండి లైంగిక వేధింపులు తప్పని పరిస్థితి. ఇంటి నుండి మరో ఇంటికి మారినా ఈ మృగాళ్ళ తీరు మాత్రం ఒకటే.

వివాహంతో స్త్రీకి భద్రత వస్తుందని ఇప్పటికి చాలా వరకు అందరూ నమ్ముతున్నారు. ఒకప్పుడు అది ఆర్థిక భద్రత అయి ఉండవచ్చు. కానీ నేడు స్త్రీ తన ఉపాధి తనే చూసుకున్నా మృగాళ్ళ నుండి తప్పని వేధింపులు!

అదేంటి? నచ్చకపోతే వేరే ఇంటికి మారిపోవచ్చు కదా అన్నది గొప్ప సలహానే కావచ్చు, కానీ దానిలో కూడా చాలా లొసుగులు ఉన్నాయి.నేడు ఉద్యోగం చేసి స్వతంత్రంగా బతికే స్త్రీలు ఈ దశను పెళ్ళికి ముందు కలిగి ఉంటారు. కుటుంబానికి ఆర్థికంగా అండగా నిలబడి తల్లిదండ్రుల బాధ్యతలను తీసుకుని, తర్వాత పెళ్లి చేసుకునే ధోరణి ఉన్న స్త్రీలు ఎంతోమంది ఉన్నారు.

ఆ క్రమంలో వారు అద్దె ఇల్లుకు పెట్టే ఖర్చు బడ్జెట్ రీత్యా తక్కువగానే ఉంటుంది. అందుకని పోర్షన్లలో ఉండాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఫ్లాట్‌లలో అయితే ఆ పరిస్థితి కొంచెం మెరుగ్గానే ఉంటుంది. కానీ ఇలా పోర్షన్లలో ఉండే ఇండిపెండెంట్ స్త్రీలు లైంగిక వేధింపుల బారిన పడే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి.

వీటన్నిటికన్నా ముందు ఇండిపెండెంట్ స్త్రీకి ఇల్లు అద్దెకు ఇవ్వడానికి ఎన్నో అవమానకరప్రశ్నలు సంధించడానికి ఆ ఇంటి యజమాని ముందే సిద్ధంగా ఉంటాడు. ఆ క్రమంలో బేలగా (లేదా) బలహీనపడుతున్న మనస్థితిని అంచనా వేసి తన అవకాశానికి వ్యూహాలు వేసుకుంటాడు. ఓ ఇల్లు దొరకదు, సింగిల్ వుమన్‌కి దొరకడమే కష్టం, అందులోనూ బడ్జెట్‌లో దొరకడం ఇంకొంత కష్టం.

పోనీ ఎలాగో కష్టపడి కాస్త డబ్బు పోయినా ఫర్లేదు అనుకొని రెంటల్ ఏజన్సీ ద్వారా వెళ్ళినా, అక్కడికి వెళ్లాక ఏవైనా సమస్యలు ఎదురైతే ఆ ఏజెన్సీవాడు మాయమౌతాడు.

ఓ స్త్రీ ఎంతో చదువుకుని కూడా, ఆర్థికంగా స్వాతంత్ర్యం ఉన్నప్పటికీ కూడా భర్త వేధిస్తే ఎలాగో సర్దుకుపోవడానికే ఇష్టపడుతుంది కానీ స్వతంత్రంగా బ్రతకాలనే యోచన చేయకపోవడానికి ఈ బయటి వేధింపులే కారణం. ఒకవేళ ధైర్యంగా ముందడుగు వేసి తన సమస్య గురించి చెప్పినా, ఆ సమస్య పరిష్కరించబడుతుందో లేదో తెలియదు.

ఒకవేళ పరిష్కారం దొరికినా దానికి ఎంతోకాలం పడుతుంది. ఆ క్రమంలో ఆమె 'శీలహత్య' జరుగుతుంది. అప్పటివరకు ఆమెకు మద్ధతుగా నిలబడ్డ వాళ్ళంతా ఈ శీలహత్య తెరమీదకు రావడంతో వెనక్కు తగ్గుతారు. అలా ఆ సమస్య కాస్త విజయవంతంగా పక్కదోవ పట్టించబడుతుంది. అప్పటికే మానసికంగా కుంగిపోయిన స్థితిలో ఉండే ఆ స్త్రీ తరువాత ఏం చేయగలుగుతుంది?

స్త్రీలకు వర్క్‌ప్లేస్‌లో వేధింపులు ఓ పక్క, ఇంటి ఓనర్లతో ఇంకో పక్క.

ఇలా చెప్పుకుంటూ పోతే ఆమెను కొంతకాలానికి ఆ పరిస్థితులకు అలవాటు పడిపోయేలానో లేక పిరికి దానిగానో తయారుచేస్తాయి.

తాజాగా కాస్టింగ్ కౌచ్ ఉదంతాలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి. కానీ ఆ క్రమంలో అన్ని రంగాల్లో ఉన్న స్త్రీల సమస్యల గురించి తెలుసుకున్నప్పుడు తేలిందేమిటంటే ప్రతి రంగంలోనూ ఈ లైంగిక వేధింపులు ఉన్నాయని కానీ నిష్పత్తుల్లోనే తేడా ఉందని.

ఒక్కచోట తక్కువగా ఉండొచ్చు, ఇంకోచోట తీవ్రంగా ఉండవచ్చు. కానీ లేదు అని మాత్రం చెప్పే ఆస్కారం లేదు.

ఇటువంటి సమస్యల పరిష్కారం అన్నది ఒక్క రోజులోనో, నెలలోనే, సంవత్సరంలోనే దొరికేది కాదు. అంతేకాకుండా, ఆ పోరాటంలో భాగంగా కొన్నిసార్లు ఆమె తన ఉపాధి కూడా కోల్పోవాల్సి రావచ్చు. ఇన్ని చిక్కుముడులు విప్పే వాతావరణం ఎప్పటికీ ఈ సమాజంలో నిర్మించబడుతుందో!



# సందిగ్ధతలో సాధికారత

**–శృంగవరపు రచన**

ఓసారి కాస్టింగ్ కౌచ్ మీద ఉద్యమం...

ఇంకోసారి హత్యాచారాల మీద ఉద్యమం...

మరోసారి సమాన వేతనాలు కావాలని ఉద్యమం...

చెప్పుకుంటూ పోతే వీటికి ముగింపు ఏది? రోజుకో కొత్త సమస్య... దానికో పరిష్కారం దొరికే లోపలే ఇంకో సమస్య పురుడు పోసుకుంటుంది. వీటన్నింటిని పరిశీలించినట్లయితే స్త్రీ సమస్యల ఉద్యమాల దగ్గరే ఆగిపోతున్నాయని కొన్నిసార్లు అనిపిస్తుంటుంది. మీడియా ముందుకొచ్చేవారు, అలాగే సమస్యని ప్రజలకు తెలిసేలా చేసే మీడియా, ఇంకోవైపు న్యాయస్థానాలు ఉన్నప్పటికీ ఎందుకు సమస్యలు పరిష్కరించబడడం లేదు? ఇది ఎప్పటికి మిలియన్ డాలర్ ప్రశ్నే. కానీ దీని సమాధానాన్ని విశ్లేషిస్తే కొంతమేరకు ఈ వైఫల్యాలకు కారణాలు బోధపడతాయి.

ఏ ఉద్యమం అయినా వ్యక్తిగత బాధ నుండి పుట్టే అవకాశాలు ఎక్కువ. మొదలు పెట్టే క్రమంలో ఆ బాధ అందరికీ తెలియాలనే ఆక్రోశమే ఎక్కువగా

ఉంటుంది. ఆ క్రమంలో మొదట్లో దొరికే మద్ధతు ఎంతో కొంత ఉపశమనాన్ని ఇస్తుంది. ఉద్యమ క్రమంలో రెండు దశలు ఉంటాయి. మొదటి దశలో ఆ సమస్య పడుతున్న వర్గానికి నాయకత్వం వహించే బాధ్యత తీసుకోవడం. ఆ బాధ్యత తీసుకున్నాక ఆ వర్గానికి శత్రువులు ఎన్నో వ్యూహాలు పన్నుతారు. ఇక రెండో దశలో శత్రువ్యూహంలో చిక్కుకుని శలభంలా మాడిపోవడం.

ప్రతి వ్యక్తికి ఓ జీవితం ఉంటుంది. అనుబంధాలతో నిండిన ఆ జీవితంలో కొన్ని నిబంధనలు సమాజరీత్యా ఉంటాయి. ఆ నిబంధనలు మనిషిని చాలా వరకు ఎన్ని సమస్యలొచ్చినా గళం విప్పకుండా చేస్తాయి. స్త్రీ సమస్యలు ఇందుకు మినహాయింపు ఏమీ కాదు. సమస్య ఏ స్థాయిలో మొదలైన ఇన్ని ప్రతిబంధకాలు అడుగులు వెనక్కి పడేలా చేస్తాయి.

సర్దుకుపోవడమే మంచిది అన్న భావన దాదాపు 80శాతం మహిళలకు ఉంటుంది. దానికి కారణం ఓ కోణం నుండి పరిశీలిస్తే కుటుంబం పట్ల ఉన్న బాధ్యత. ఆ క్రమంలో స్త్రీ తన ఆత్మగౌరవం కన్నా సమిష్టి బాధ్యతలకే ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తుంది. ఆమె గొప్ప మనసును అర్థం చేసుకొని ఆమెను గౌరవించేవారు ఉన్నారు. అలాగే ఆమెదైన ఈ మనస్తత్వాన్ని ఆమె బలహీనతగా భావించేవారు ఉన్నారు.

ఇది ఓ కోణం. ఇంకో కోణం నుండి పరిశీలిస్తే వ్యక్తిగతంగా తన సమస్యలు చెప్పుకుంటే సమాజంలో చులకనభావం కలుగుతుందేమోనన్న సంశయం, అప్పటివరకు ఉన్న అంతో ఇంతో కుటుంబ మద్ధతు దూరం అవుతుందేమోనన్న భయం, ఒకవేళ దీని పరిణామాలు తనని ఒంటరిని చేస్తే అవకాశవాదులు రెచ్చిపోతారేమోనన్న భీతి, ఇవన్నీ స్త్రీని నిజమైన పరిష్కారం కోసం పోరాడకుండా ఉండేలా చేస్తాయి.

మహిళా సంఘాలు పరిష్కరించిన సమస్యలేమిటో ఎవరికీ అంతుబట్టదు. సమస్య తీవ్రరూపం దాల్చినప్పుడు మాటలతో అందరూ తమ సానుభూతిని, మద్ధతను తెలుపుతూ స్పందిస్తారు. ఆ క్రమంలోఆ సమస్య చివరి వరకు నిలబడి దాని పరిష్కారానికై నిలబడిన సంఘాలు దాదాపు లేవనో చెప్పవచ్చు. తమ ఉ నికిని కాపాడుకోవడానికి ఈ సమస్యలు సంఘాలకు ఓ బాసటగా నిలుస్తున్నాయే తప్ప, బాధితులకి సంజీవనిలా మాత్రం కాదు.

ఉన్న అన్ని సంకెళ్ళను తెంచుకొని స్త్రీ బయటకు వచ్చినా ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో తెలియని పరిస్థితి. 'తెలిసిన దెయ్యమేమేలు తెలియని దేవుని కన్న' అన్న రీతిలో ఈ సందిగ్ధ పరిస్థితిలో స్త్రీ మౌనంలోనే సంతోషాన్ని వెతుక్కుంటుంది.

ఏ ఉద్యమం మొదలైనా పరిష్కారం లేకుండానే ఆ ఉద్యమం ముగిసిపోతుంది. బహుశా ఇటువంటి వైఫల్య పరిణామాలు కూడా స్త్రీలు వెనుకడుగు వేయడానికి కారణమై ఉండవచ్చు. ఇది ఎంతోమంది మృగాళ్ళు ముందడుగు వేయడానికి ఊతం ఇచ్చి ఉండవచ్చు.

ఏది ఏమైనా స్త్రీ సున్నితత్వ శైలిని బలహీనతగా కాకుండా దైవత్వంగా పరిగణించే రోజూ రానంత వరకు ఈ సందిగ్ధత తప్పదు. దానికి స్త్రీ తనని తన లక్షణాలను వ్యక్తీకరించే తీరులో ధృడత్వాన్ని దట్టించాలి. స్త్రీ శక్తి అంటే ఆత్మగౌరవాన్ని ధృడపరచుకొనే స్త్రీ సముదాయమే తప్ప గంభీరత్వాన్ని ఆపాదించుకుని సమాజంలో ఒకలా, వ్యక్తిగతంగా ఇంకొకలా మసలే ద్వంద్వ మనఃస్థితి కాదు.త్వరలోనే ఈ సందిగ్ధత స్పష్టత వెలుగులోకి పయనించాలని ఆశిద్దాం.



# కనీస భద్రత లేని స్త్రీ స్వేచ్ఛ

దాదాపు 17 ఏళ్ల తర్వాత భారతదేశానికి 20 ఏళ్ల వైద్యవిద్యార్థిని 2017వ సంవత్సరానికి ప్రపంచ సుందరి కిరీటాన్ని తెచ్చింది. ఆమె హర్యానాకి చెందిన మానుషి చిల్లార్. ఇది భారత కీర్తి ప్రజ్వరిల్లే కోణం.

కోపార్డి పూణేకి 120 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. తన తాత ఇంటి నుంచి ఇంటికి తీరిగి వస్తున్న తరుణంలో ఓ 14 ఏళ్ల మైనర్ బాలికపై ముగ్గురు అత్యాచారానికి పాల్పడి, దారుణంగా హత్య చేసారు. మహారాష్ట్రలోని కోపార్డిలో జరిగిన మైనర్ బాలిక అత్యాచారం, హత్యకు సంబంధించిన కేసులో అహ్మద్ నగర్ సెషన్స్ కోర్టు ఇటీవల ముగ్గురు నిందితులు దోషులేనని, శిక్ష తప్పదని (నవంబర్ 18)న తేల్చింది. దోషులకు దాదాపు శిక్ష ఖరారు అయిపోయింది కనుక ఇది విజయమా? ఓ లేత మొగ్గ విచ్చుకోకుండానే మట్టిలో కలిసిపోయింది కనుక మానవత్వంపై మరిచిపోలేని రక్తపు చారికా? స్త్రీకి స్వేచ్ఛ ఉండాలి. అలాగే భద్రతా ఉండాలి! దీన్ని పరిశీలిస్తే ఈ రెండు విరుద్ధ కోణాలు భద్రత కోసం కొట్టుమిట్టాడే పరిస్థితులున్నప్పుడు నిజమైన స్వేచ్ఛ ఎక్కడ ఉంటుంది? 'గాలికదుపు లేదు, కడలికంతు లేదు, గంగవెల్లువ కమండలంలో ఇమిడేదేనా?

ఉరికే మనసుకు గిరి గీస్తే అది ఆగేదేనా?' స్వేచ్ఛ గురించి మొదలు కలలుగనే స్త్రీ కూడా పరిస్థితుల రీత్యా సర్దుకుపోతూ ఉంటుంది. వీరేశలింగం నుండి చలం వరకు పరిశీలిస్తే స్త్రీ అభ్యున్నతి ప్రస్ఫుటం అవుతుంది. 'బాల వితంతువు' అన్న దానిని వ్యతిరేకించి, సంస్కరించారు వీరేశలింగం 'వృద్ధుడితో బాలిక సంబంధం తప్పు' అని గురజాడ గట్టిగానే తన సంస్కరణ రచనల ద్వారా స్పష్టం చేసారు. చలం తన సమకాలీన రచయితలందర్నీ తిరస్కరించి 'స్త్రీ'కి ఆత్మగౌరవం, స్వేచ్ఛ, వ్యక్తిగా గుర్తింపు వంటి అంశాల్ని స్పష్టం చేసేలా పాత్రల్ని చిత్రీకరించారు. సాహిత్యం, సంస్కరణలు, ఇలా ఎన్నో 'స్త్రీ' అనే అంశం మీద ఎప్పుడు సరికొత్త వాదాన్ని వెలుగులోకి తెస్తూనే ఉన్నాయి. అవును! నిజమే! ఈ రోజు స్త్రీకి కావాల్సినంత స్వేచ్ఛ ఉంది. తన లక్ష్యాలు సాధించడానికి అడ్డుగోడలు లేవు. అంటే 'స్త్రీ' మీద రుద్దబడిన ఆంక్షలన్నీ నేడు చాలావరకు కనుమరుగయ్యాయి. అలా అని 'స్త్రీ' సుఖంగా ఉందా? సుఖం– అంటే అర్థం ఏ చింతా లేకుండా ఉండగలుగుతుందా? 'రోజులు అసలే బాగాలేవు. కాస్త పెందలాడే ఇంటికి రావడానికి ప్రయత్నించు..' 'నీకు ఏమాత్రం ఆలస్యం అయ్యేలా ఉన్నా నాకు ఫోన్ చేసి చెప్పు..' ఇలా అనుకోకుండా ఈ డైలాగులు లేకుండా మన నిత్యజీవితం గడుస్తుందా? నైరోమి ఇరాన్ అఫ్ పార్సీసీ 'ట్రిపుల్ తలాక్ విషయంలో సైరాభానో' సాధించిన విజయాన్ని స్ఫూర్తిగా తీసుకుని పార్సీ వివాహ వ్యవస్థ, విడాకుల అంశం పై ధైర్యంగా సుప్రీంకోర్టుకు వెళ్లింది. స్త్రీలు ధైర్యంగా తమ ప్రగతిని తామే నిర్దేశించుకుంటూ అడుగులు ముందుకు వేస్తున్నారు. దానిలో సందేహమే లేదు. కానీ మధ్యలో అత్యాచారాల, హత్యల ఉనికి ఎప్పుడూ చరమగీతానికి చేరువ అవుతుంది? ఇవి ఓ పక్కన జరిగిపోతూ ఉండి, ఇంకో పక్క అభివృద్ధిలో దూసుకుపోతూ ఉంటే అప్పుడు దీన్ని ఏ కోణంలో సమతుల్యతగా చూడాలి? అప్పటివరకూ  సమాజంలో ఓ 'సిద్ధాంతం'గా పాతుకుపోయిన 'స్త్రీ చీకటిని వెలుగు'గా మార్చడానికి ఎన్నో దశాబ్దాల కాలం పట్టింది. కానీ ఇప్పుడు వ్యక్తిగత ధోరణుల వల్ల విజృంభిస్తున్న పైశాచిక ధోరణికి రూపుమాపే మార్గం ఏది? ఇదే విషయాన్ని ఇంకో కోణంలో చూస్తే ఇది 'ఇంకోరకమైన స్వేచ్ఛకు పుట్టిన విషఫలమేమో!' సమిష్టి కుటుంబాలలో దొరకని స్వేచ్ఛని చిన్న కుటుంబాల్లో వెతుక్కుందామని అనుకుని ఉమ్మడి కుటుంబ వ్యవస్థకు మనమే ఎక్కడో బలమైన

ముగింపు చెప్పేసాం. దాని నుంచి 'సింగిల్ పేరెంట్ స్థాయికి కూడా ఎదిగాం. ఈ పయనంలో ఇక "నో పేరెంట్' కూడా త్వరలోనే వెలుగులోకి రావచ్చేమో! ఇటువంటి పరిమాణక్రమ ఉత్పత్తిగా పైశాచిక ధోరణి అవలంభించే తరువాతి తరాన్ని మనమే తయారు చేసామేమో! మూలాలతో సహ ఖండించకపోతే ఏ సమస్య అయినా పునరావృతమయ్యే అవకాశం ఉంది. ఆ మూలాలు వెతికే ప్రయత్నమే ఇదంతా! 'స్త్రీ సమానత్వం, స్వేచ్ఛ' అనే అంశాల్ని పటిష్ఠం చేసుకుంటున్న వైనంలో ఇంకోపక్క కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కూడా జరుగుతూ వచ్చింది. అంటే  ఒకవైపు పురోగతికి పాదులు చేస్తూ.. ఇంకోవైపు తిరోతికి స్వాగతం పలకడం జరిగింది. అందుకే 'స్త్రీ సమానత్వం' విజయం సాధించిందా? లేదా? అన్న ప్రశ్నకు ఎవరి దగ్గరా స్పష్టమైన సమాధానమే ఉండటం లేదు. విత్తు వేసిన తర్వాత దాని ఫలాన్ని అనుభవించి తీరాల్సిందే. పురోగతి ఫలాలైనా, తిరోగతి తీరాలైనా! పురోగతి సమతుల్యత వైపు మళ్లాలంటే పరిణామక్రమంలో విషఫలాలుగా చొచ్చుకు వచ్చిన తిరోగతి మూలాల్ని గుర్తించి, వాటిని సమూలంగా సమాధి చేస్తూ పురోగతి వైపు మళ్లాలి. అప్పుడే నిజమైన స్వేచ్ఛ భద్రతలో కట్టుబడకుండా సహజంగా ఉంటుంది. ఇది ఉద్యమాలతో వచ్చే మార్పు కాదు.. మనుషులతో మమేకం అయిపోవడం వల్ల వచ్చే మార్పు. ఇది స్త్రీలకు మాత్రమే సంబంధించిన అంశం కాదు. విశ్వజననీయమైన అంశం. విచ్ఛిన్నమైన కుటుంబ వ్యవస్థల విషఫలాలే నేడు కార్పోరేట్ విద్యావ్యవస్థల్లో జరుగుతున్న విద్యార్థుల ఆత్మహత్యల ఉదంతాలు. ఇది పునారావ ృతం అవుతూనే ఉంది అంటే ఈ ఆత్మహత్యల గురించి నిజంగా తల్లిదండ్రులు స్పందించినట్టా? స్పందించనట్టా? 'ఇది మామూలే పరుగే ముఖ్యం' అని అనుకోబట్టా? అంశం 'స్త్రీ' అయినా అది సర్వజనుల అంశమే లోతుగా చూస్తే! స్త్రీ సమానత్వ' పరిష్కారం తోనే 'మానవసంబంధాల ధృడత' కూడా ఇమిడి ఉంది.



# మృగాళ్లు మారేదెప్పుడు?

కథువా, ఉన్నావ్ గ్యాంగ్ రేప్ ఘటనలపై దేశవ్యాప్తంగా ఆగ్రహావేశాలు పెల్లుబుకుతున్న సంగతి అందరికీ తెలిసిందే. 'నా బిడ్డ చాలా తెలివైనది. పెద్దయ్యాక తనను డాక్టర్‌ని చేయాలనుకున్నాం. మరే కుటుంబం ఇలాంటి వేదనకు గురికాకుండా ఉండాలంటే దోషులకు ఉరివేయడమే సరైన నిర్ణయం' అన్న ఆసిఫా తల్లి ఆక్రోశం తడి ఆరకముందే. గుజరాత్‌లో మైనర్ బాలిక దారుణ హత్య వెలుగులోకి వచ్చింది. సూరత్‌లోని ఓ పదకొండేళ్ల మైనర్ బాలికను వారం రోజులు చిత్రహింసలు పెట్టి మృగాళ్ళు చివరికి గొంతు నులిమి హత్య చేశారు. ఏప్రిల్ 6న సూరత్‌లోని భైక్షన్‌లోని క్రికెట్ మైదానంలో బాలిక మృతదేహాన్ని పోస్టుమార్టంకు పంపడం జరిగింది. బాలిక మృతదేహంపై 86 గాయాలు ఉన్నాయని పోస్ట్ మార్టం అనంతరం సూరత్ సివిల్ ఆసుప్రతి ఫోరెన్సిక్ విభాగం చీఫ్ తెలిపారు. అంతేకాకుండా చెక్కతో చేసిన ఆయుధంతో ఆమె మర్మాంగాలను కూడా మృగాళ్ళు గాయపర్చారని వెల్లడించారు. చిన్నారులు, మహిళలపై నేరాలు పెరిగిపోతుండడం పట్ల న్యాయస్థానాలు కూడా తీవ్ర ఆందోళనను వ్యక్తం చేశాయి. శిశువులపై లైంగిక అత్యాచారాలకు

వెనుకాడకపోవడం మనిషి నైతిక విలువలు పాతాళానికి చేరాయనడానికి నిదర్శనం, మెదక్ జిల్లా తూప్రాన్ మండలం మనోహరాబాద్‌లో నివసించే గడ్డమీది భిక్షపతి ఓ హత్యకేసులో జైలుకెళ్లాడు. అతడిని విడిపించేందుకు తండ్రి తమ రెండెకరాల పొలాన్ని గొల్ల పెంటయ్య, నాగుల నాగభూషాణలకు అమ్మేశారు. తర్వాత జైలు నుంచి బయటకు వచ్చిన భిక్షపతి.. భూముల విలువలు బాగా పెరిగిన నేపథ్యంలో తాము అమ్మిన భూమికిమరింత మొత్తాన్ని ఇవ్వాలని గొల్లపెంటయ్యను డిమాండ్ చేశాడు. అయితే ఇందుకు పెంటయ్య నిరాకరించటంలో ఆతనిపై భిక్షపతి కక్ష పెంచుకున్నాడు. ఇందుకు పథక రచన చేసిన భిక్షపతి.. అదే గ్రామానికి చెందిన ఓ చిన్నారికి బిస్కెట్లు, చాక్లెట్లు జూపి పెంటయ్య పొలం సమీపానికి తీసుకెళ్లాడు. అక్కడ ఆ చిన్నారిపై ఆత్యాచారం జరిపి, హత్య చేశాడు. మృతదేహాన్ని పెంటయ్య పొలంలో పడేశాడు. చిన్నారిని తీసుకెళ్లడం చూసిన కొందరు గ్రామస్తులు భిక్షపతిని నిలదీశారు. మొదట తనకేమీ తెలియదని చెప్పిన భిక్షపతి, తర్వాత పోలీసుల విచారణలో నిజం ఒప్పుకున్నాడు. పెంటయ్య పొలంలో ఆ చిన్నారి మృతదేహాన్ని పడవేసింది తానేనని, చిన్నారి హత్య కేసు పెంటయ్యపై నెట్టేందుకే అలా చేశానని చెప్పారు. చిన్నారిపై అత్యాచారం జరిపి ఆ తర్వాత హత్య చేసినట్లు పోస్టుమార్టంలో తేలింది. 2011 జూలై 11న జరిగిన ఈ ఘటనపై తూప్రాన్ పోలీసులు చార్జ్‌షీట్ దాఖలు చేశారు. ఈ కేసుపై సిద్దిపేట ఆరో అదనపు జిల్లా సెషన్స్ కోర్టు విచారణ జరిపింది. సాక్ష్యాధారాలను పరిశీలించిన కోర్టు, హత్య, అత్యాచారం, అపహరణ నేరాలకు భిక్షపతికి జీవితఖైదునివిధిస్తూ, 2018లో తీర్పు వెలువరించింది. కింది కోర్టు తీర్పును సవాలు చేస్తూ భిక్షపతి ఇదే ఏడాది హైకోర్టులో అప్పీల్ దాఖలు చేశాడు. ఈ అప్పీల్ పై జస్టిస్ నాగార్జునరెడ్డి నేతృత్వంలోని ధర్మాసనం విచారణ జరిపింది. పూర్తి ఆధారాలను పరిశీలించిన ధర్మాసనం లైంగిక వాంఛతోనే ఆ చిన్నారిని భిక్షపతి చంపాడని, ఇందుకు సంబంధించిన అన్ని ఆధారాలను పోలీసులు సేకరించారని తెలిపింది. ఆ చిన్నారి హత్య విషయంలో భిక్షపతికి దురుద్దేశాలు ఉన్నాయని స్పష్టం చేసింది. భిక్షపతి చేసిన అనాగరిక దారుణానికి కింది కోర్టు మరణదండన విధించి ఉండాల్సిందని ధర్మాసనం తన తీర్పులో పేర్కొంది. ఏ రకంగా చూసినా కింది కోర్టు తీర్పులో జోక్యం చేసుకోవాల్సిన అవసరం కనిపించడం

లేదని భిక్షపతి దాఖలు చేసిన అప్పీలను కొట్టివేసింది. జరిగిన, జరుగుతున్న ఉదంతాలను పరిశీలిస్తే కక్ష తీర్చుకునే సాధనంగా, మత విధ్వంసాల పనిముట్లుగా కూడా ఆడపిల్లలు బలిపశువులు కావడం ఈ దేశచరిత్రను కుసంస్కార దశలోకి పయనించేలా చేస్తుందని అనిపిస్తుంది. చట్టాల అవగాహన, పోరాడటం అయిన ఆడపిల్లలు ఎలా చేయగలుగుతారు? ఈ సమస్యకు పరిష్కారం న్యాయస్థానాలు, దేశనాయకుల చేతుల నుండి కూడా జారిపోయినట్టు అనిపిస్తుంది. ఇటువంటి దారుణకాండకు చరమగీతం ఎలా పాడాలి అన్నది సమాజానికే నేడు వదిలివేయబడ్డ ప్రశ్న.



# మళ్లీ తలెత్తిన 'దాసీ' దురాచారం

మూఢనమ్మకాల బలంతో సమాజంలో ప్రబలే దురాచారాలు ఆయా సంస్కరణలు వెలుగులోకి రాగానే దగ్ధమైపోయాయి. కానీ అమాయకత్వం, అవిద్య, నిస్సహాయత్వం ఎప్పుడైతే చుట్టుముడతాయో అప్పుడు మళ్లీ సంస్కరణలు మరుగున పడి అఘాయిత్యం రూపంలో దురాచారాలు సమాజాన్ని కుంచింపజేస్తాయి. దీనికి తాజాగా ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో వెలుగు చూసిన దేవదాసీ సంప్రదాయం. దేవదాసీ వ్యవస్థ, జోగినీ వ్యవస్థ. ఈ రెండు వ్యవస్థలల్లోనూ బలి అయ్యేది స్త్రీలే. ఈ వ్యవస్థలలో చిన్నచిన్న తేడాలున్నప్పటికి రెండింటిలోనూ అమ్మాయిల్ని దేవతలకు సమర్పించడం అనే సంప్రదాయమే కనిపిస్తుంది. ఇది కాకతీయుల కాలం నుంచి ఉంది. కాకతీయురాజులు దేవదాసీలను రాజదాసీలుగా నియమించుకునేవారు. వారి భోగపత్నులుగా చేసుకునేవారు. కేవలం రాజులు మాత్రమే దేవదాసీలను అనుభవించేవారు. కానీ దీని తర్వాత వచ్చిన జోగిని వ్యవస్థలో జోగినులను ఉన్నత కుటుంబాలు, నిమ్న కుటుంబాలు అందరూ తమ లైంగిక సంతృప్తి కొరకు ఉపయోగించుకునేవారు. కాలక్రమంలో దేవదాసీలు, జోగినులు ఇద్దరు కూడా

పెత్తందార్లు, భూస్వాములు, ధనవంతులు అన్ని వర్గాల నుండి లైంగిక దోపిడికి గురైనవారే. చారిత్రకంగా చూస్తే బ్రిటిష్ వారి హయాంలో రాజులు దేవాలయాల అభివృద్ధికి కృషి చేశారు. దైవారాధనలో నృత్యపూజ ఒక భాగంగా ఉండేది. ఆలయాల్లో వేకువజామున దేవుడికి మేలుకొలుపులు పాడటం నుంచి, రాత్రివేళ పవళింపు సేవ వరకు నృత్యగానాలు ప్రదర్శించేవారు. ఇవన్నీ చేయడానికి దేవాలయాలలో ప్రత్యేకించి మనుషులు కావాలి. ఇందుకుగాను అమ్మాయిల్ని దేవాలయాలకు దానం చేసేవారు. దేవుని సేవకు నియమింపబడిన ఈ అమ్మాయిల్ని దేవదాసీ అని పిలిచేవారు. దేవదాసీలు రాజులు ఇచ్చిన మాన్యాలతో పొట్టపోసుకుంటూ నిరాండబర జీవితం గడిపేవారు. కాలక్రమంలో వీరి నృత్యం ఆలయం నుండి రాజాస్థానానికి మారింది. ఫలితంగా రాజులు వీరిని రాజనర్తకిలను చేశారు. రాజనర్తకిలు రాజ్యసభలలోనూ, రాజు అంతఃపుర మందిరాలలోనూ నృత్యం చేసేవారు. రాజుకు ఉంపుడుకత్తెలుగా (రాజదాసిలుగా) ఉండేవారు. విలాసాలకు, సౌఖ్యాలకు అలవాటుపడ్డ వీరి పరిస్థితి రాజ్యాలు, జమీందారులు అంతరించిన తర్వాత దుర్భరమైంది. చాళుక్య రాజైన గుణగ విజయాదిత్యుని నాటి చెల్లవ్వ, ప్రతాపరుద్రుని నాటి మాచలేని, కొమరగిరెడ్డి ఆస్థానంలో లకుమాదేవి పల్నాటి వీరచరిత్రలో వర్ణింపబడింది. రాజాస్థానింలో కవయిత్రులుగా ఉంటూ రాజుకు భోగపత్నులుగా కొంతమంది ఉన్నారు కూడా. 17వ శతాబ్దంలో రంగాజమ్మ, 18వ శతాబ్దంలో ముద్దుపళని వంటి వారు ఈ కోవకు చెందినవారే. ప్రముఖ సంగీత విద్వాంసులు ఎం.ఎస్. సుబ్బలక్ష్మి కూడా దేవదాసీ కుటుంబం నుండి వచ్చినవారే. కులపరంగా చూస్తే దేవదాసీ సంప్రదాయం ప్రకారం ఒక వంశంలోని స్త్రీలలో తరానికికొక్కరిని చొప్పున గుడిలోని దేవునికి పెళ్లి చేసేవారు. ఆ స్త్రీ జీవితాంతం అవివాహితగా ఉండాలి. మొదట్లో కేవలం బ్రహ్మణ కుటుంబాలలో నుంచి మాత్రమే దేవదాసీలు ఉండే వారు. తర్వాత నిమ్నవర్గాల నుండి కూడా వచ్చారు. దీనికి గల కారణం ఉన్నతవర్గాలు తక్కువ కులాల వారికి దేవాలయాలలోనికి ప్రవేశం కల్పించకపోవడం. దాంతో తక్కువ కులాలవారు వారికోసం వారే దేవాలయాలను వారు నివసించే ప్రాంతాల లోపు నిర్మించుకోవడం మొదలుపెట్టారు. ఆ దేవాలయాలకు అమ్మాయిల్ని వారి జాతిలో నుంచే అర్పించేవారు. ఈ విధంగా

నిమ్నవర్గాలల్లో నుంచి దేవదాసీలు వచ్చారు. ఇకపోతే జోగిని వ్యవస్థకు వస్తే కొంతమంది స్వార్ధపరులు లైంగిక సంబంధాలను కొనసాగించడానికి పెట్టుకున్న మూఢచార సంప్రదాయం జోగిని వ్యవస్థ. ఊర్లల్లో కరువు కాటకాలు వస్తే ఎవరికైనా నయం కానీ రోగాలు వస్తే, సంతానంలో మగబిడ్డలు పుట్టకపోతే, ఇటువంటి సాకులతో ఆడపిల్లలను గ్రామదేవతలకు సమర్పించడమే ఆ సంప్రదాయానికి జీజాలు వేసింది. ఒకప్పుడు గ్రామాల్లోని భూస్వాములు లేదా ధనవంతులు భర్తతో కాకుండా ఇతర స్త్రీలతో కూడా లైంగిక సంబంధాన్ని కలిగి ఉండేవారు. ఆ ఇతర స్త్రీలే జోగినిలుగా మార్చబడిన అమ్మాయిలు. ఈ సంబంధాన్ని కుటుంబపరంగాగాని, ఊరిపరంగా గాని ఎవరూ తప్పుపట్టేవారు కాదు. ఎందుకంటే అమ్మాయిని దేవతగా సమర్పించటం అనే జోగిని వ్యవిస్థ మూఢనమ్మకంతో కూడిన దురాచారం. ఈ విషయం గ్రహించని తల్లిదండ్రులు, మిగిలినవారు అమ్మాయిల్ని జోగినులుగా చేసి భూస్వాములకు దాసిలను చేస్తున్నారు. పురుషుల వివాహేతర సంబంధానికి బానిసలు ఈ జోగినిలు. వీరు వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా పిలువబడుతున్నారు. మాతంగి, బసలి, మురళి, మరియము మొదలైన పేర్లతో పిలువబడుతున్నారు. కేరళలో మహోరి, అస్సాంలో నాటి, మహారాష్ట్రంలో మురళి అని అంటారు. ఈ దురాచారంలో స్త్రీని దేవతకు అర్పిస్తున్నారు. ఇక్కడ స్త్రీ అనడం కంటే అమ్మా అనడం సమంజసం. ఎందుకంటే వారి వయసు ఆరునెలల నుండి ఉంటుంది. ఒక్కొక్కసారి గర్భస్థ శిశువు కూడా. అంటే తల్లి కడుపులో ఉండగానే ఆడపిల్ల పుడితే జోగినిగా చేస్తాం అని మొక్కుకుంటారు. శిశువు జన్మించిన తరువాత ఒక మంచిరోజు చూసి జోగినిగా మారుస్తారు. కొంతమందిని నెలల వయసులోనూ, మరికొంతమందిని 6,7,8 సంవత్సరాల వయసులోనూ జోగినిలుగా చేస్తారు. వారికి ఆ వయసులో ఏమి జరుగుతుందో కూడా తెలియని పరిస్థితి.

తెలుగులో ఈ వ్యవస్థలపై అనేక రచనలు, సినిమాలు ఉన్నాయి. స్వాతంత్ర్యం రాకపూర్వం ఈ వ్యవస్థలలో ఉన్న తీరుకి స్వాతంత్ర్యం వచ్చాక ఈ తీరుకి చాలా మార్పులు గోచరిస్తాయి. ప్రభుత్వం వీటి నిర్మూలనకు కొన్ని చర్యలు చేపట్టింది. ఈ దురాచార బాధితులకు అనేక వసతులు కల్పించింది. తిండి, బట్ట నివాసం,

ఉపాధి మొదలైన సౌకర్యాలు కల్పించింది. జీవనభృతి సమకూర్చింది. 1988లో స్వర్గీయ నందమూరి తారక రామారావు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు రాష్ట్రంలో ఈ దురాచారాన్ని నిషేధించారు. అలాగే సంఘసంస్కర్తలు కూడా వీరి కోసం ప్రత్యేక సంస్థలను నెలకొల్పి ఈ వ్యవస్థను రూపుమాపడానికి ప్రయత్నించారు. కొన్ని శతాబ్దాల పాటు ఓ పరంపరలా సాగిన ఈ దురాచారాన్ని రూపుమాపడానికి జరిగిన ప్రయత్నాలు ఎన్నో. సెక్షన్లు 370, 370ఏ, 2013 యాక్ట్, ఐపిసి 372 వంటివి చట్టాలు ఉన్నప్పటికీ అవి కూడా నిస్తేజమవుతున్న పరిస్థితి నేడు కనిపిస్తుంది. బాధితులు ముందుకు రాకపోవడం, దాన్ని సాధారణంగా పరిగణించడమే ఈ వ్యవస్థలు మరలా రూపు తీసుకోవడానికి కారణాలు. 1988లోనే ఎస్సార్ శంకర కృషితో వచ్చిన 'జోగిని నిషేధ చట్టం లాంటివి వచ్చినా ఏదో ఓ ప్రాంతంలో ఈ దురాచారాలు మళ్లీ జీవంతో పరిగెడుతున్నాయి. ఓటు బ్యాంకు లేనప్పుడు ప్రభుత్వం మాత్రం ఎందుకు పట్టించుకుంటుంది? తల్లిదండ్రులకు విద్య, తమ ఆడబిడ్డల భవిష్యత్ విలువ పూర్తిగా అవగతమైన రోజే ఇటువంటివి సమసిపోతాయి. ఎందుకంటే ఇది ఓ కుటుంబంలోని అంధవిశ్వాసంతో మొదలైన సమస్య. ఇది క్రమంగా వ్యవస్థనే నాశనం చేస్తుంది. వృద్ధాప్యం, తదుపరితరాలు ఈ దేవదాసి జోగిని ఎలా ఉంటారనేది ఊహకి కూడా భయపెట్టే ప్రశ్నే! మానవత్వం చితిపై నడుస్తున్నంత కాలం ఈ దురాచారాలు రక్తపు దాహంతో. సాగుతూనే ఉంటాయి.



# సమగౌరవమే సమానత్వం

ఏదైనా ఒక ఉద్యమం, సమస్య, చర్చ ఒకానొక దశలో విపరీతమైన పోకడల్ని అవలంభించే దశ వస్తుంది. ఆ సమయంలో సమస్యే తప్ప సమగ్ర దృక్కోణం గోచరించదు. దేశంలో, రాష్ట్రంలో, గ్రామంలో, ఇంట్లో ఇలా అన్ని చోట్లా స్త్రీలపై అత్యాచారాలు ఏదో ఒక రూపంలో వెలుగులోకి వస్తున్నాయన్నది వాస్తవం. ఆ సంఘటనలు వెలుగులోనికి వచ్చినపుడు సమస్త పురుష ప్రపంచం దుర్మార్గమైనదిగా అనిపించే తెర మన దృష్టిని పట్టుకుంటుంది. ప్రతి మనిషిలో బలాలు, బలహీనతలూ రెండు ఉంటాయి. అలాగే అవకాశాలో, ప్రభావాలో, ప్రలోభాలో, పరిసరాలో కచ్చితంగా అటు మంచిగానో లేక చెడుగానో రూపొందేలా చేస్తాయి. నాన్న, అన్న, మన బంధువులు ఇలా ఎంతోమంది మన రక్షణ కోసం అనుక్షణం ఆరాటపడుతూ ఉంటారు. వారు ఎప్పుడు 'మనవాళ్లే' అన్న జాబితాలోనే ఉంటారు ఆ 'మనవాళ్లు' జాబితా కలిస్తేనే ఈ సమాజం . ఆ పరిధి విస్తృతమైతేనే ఈ ప్రపంచం. రాహుల్ సాంకృత్యాయన్ 'ఓల్గా నుంచి గంగకు" అన్న పుస్తకంలో మాతృస్వామ్య వ్యవస్థను గురించి వివరించారు. ఈ పరిస్థితులు స్త్రీ నాయకత్వ, కుటుంబ నిర్వహణ నైపుణ్యాలకు అద్దం పట్టాయి.

తారువాత పురుషస్వామ్య వ్యవస్థ వచ్చిన తరువాత పురుషుడు అన్ని బాధ్యతలు తీసుకున్నాడు. కాలం అంటేనే అన్ని కొనాలను అందరి కనులలో ప్రతిఫలించేలా చేసే అస్త్రం. మార్పును ఆవ్వానిస్తూ ముందుకు సాగితేనే నిజమైన సమగ్ర జివిత, సమాజ, జాతి కోణాల్ని నిష్పాక్షికంగా అనుభూతిస్తూ ముందుకు సాగగలం.

నేడు సమాజంలో దాదాపు నడుస్తుంది సామార్థ్యాల ప్రాతిపదికనీ తప్ప ఆడు, మగ అన్న పాక్షిక కోణాల్లో కాదు. అది అంగీకరించాల్సినవాస్తవం. ఏదైనా సమస్య తలెత్తినప్పుడు ఆ బాధితుల మీద. అందరికి సానుభూతి ఉంటుంది. ఆ సానుభూతిని పెట్టుబడిగా పెట్టి ఎందరో తప్పు చేయని వారిని నిందించడం కచ్చితంగా ఆటవిక న్యాయమే. అది స్త్రీల సమస్య అయినప్పుడు ఆ ఒక్క నిందితుడితో పాటు మగవాళ్లందరిని ఆ చట్రంలోనే ఇరికించేయడం ఎంతవరకు సబబు? మీడియా ముందు మాట్లాడేటప్పుడు కచ్చితంగా కొన్ని నియమాలు పాటించాలి. అసభ్యతకు బోల్డ్‌నెస్‌కు మధ్య ఓ సన్నని గీత ఉంటుంది. ఆ గీతను చెరిపేస్తే విశృంఖలత విజృంభిస్తుంది. గౌరవం, ఆత్మగౌరవం అన్నవి స్త్రీ పురుషులిద్దరికి సంబంధించిన అంశాలు. మనమీద మనకు ఉండే ఆత్మ ఆ హుందాతనాన్ని, సున్నితత్వాన్ని, సమగౌరవ దృక్పథాన్ని పట్టించుకోని స్థితిని తీసుకువెళ్లే పరిస్థితులను సమన్వయపరచుకోవాలి. లేకపోతే మరల వరదల చాటున మగ్గే ప్రపంచం స్త్రీపై దాడి చేయవచ్చు. స్త్రీ ఆత్మగౌరవం లానే, పురుష ఏమిటంటే మన కోణంలో మన సమస్యలు, మనము మాత్రమే కనిపిస్తాం కనుక. ఆ కోణం నుండి స్త్రీ బయటపడాలి. ప్రపంచాన్ని సమగ్ర దృష్టితో చూసే కోణాన్ని అలవరచుకోవాలి. నేటి సమాజంలో విపరీతమైన పోటీ నెలకొని ఉంది. ఆ పోటీ కొందరిలో తమ నైపుణ్యాలను పెంపొందించుకునే కసిని ప్రోది చేస్తూ ఉంటే మరికొందరిలో మాత్రం నిరాశా, నిస్పృహలు ఆ నిరాశా, నిస్పృహల వెల్లువే కొందరిని విపరీత దిశలకు మళ్లిస్తుంది. ఈ ప్రపంచంలో కష్టపడి పని చేసుకుంటూ పోతూ నైపుణ్యాలను పెంపొందించుకునే వ్యక్తుల విజయాల్ని ఎవ్వరూ ఇప్పటి వరకు ఆపలేక పోయారు. ఆ నైపుణ్యాల దిశగా మళ్లినప్పుడే ఇటువంటి విపరీత ధోరణులకు తెరపడుతుంది. ఒకరిపై లేదా వర్గంపై విరుచుకుపడడం



# సమిధలవుతున్న స్త్రీలు

**పగలంతా ఒడలిమీద గాయాలకు**
**మందువేసి కదుతుంటుంది**
**రేయంతా శీతవాత ఘాతాలకు**
**వజ వజ వణుకుతుంటుంది**

– డా.దాశరధి కృష్ణమాచార్య

మనుషులు, విలువలు ఉనికి కోల్పోతున్నాయి. ప్రేమానుబంధాలు, మమతానురాగాలు శిధిలం అవుతున్నాయి. కలహాలే కలిసి జీవిస్తున్నాయి. మనస్పర్థలు, ఘర్షణలే గాలివానలవుతున్నాయి. నేను మాత్రమే! బాగుండాలనే స్వార్థపూరితమైన దృక్పధం, తన సుఖ సంతోషాలకు ఎంవరడ్డొచ్చినా భరించలేని అసహనం, విచ్చిన్నమవుతున్న కుటుంబ సంస్కృతి, ఆశలు, ఆశయాలను, అహాలను సంతృప్తి పర్చలేని దాంపత్య జీవితం మొదలు నరికినా చెట్టులా కూలిపోతుంది. ఇలాంటి సంఘటనల్లో ఒకప్పుడు ఒకరి నుండి ఒకరు విడిపోవాలని కోరుకునేవారు. ఇప్పుడలా కాదు, తనకు అడ్డుగా ఉన్న దాన్ని

తొలగించుకోవడమే లక్ష్యంగా హత్యలకు పాల్పడుతున్నారు. గత 10 రోజుల కాలంలో ఈ దుష్టపరిణామాల కారణంగానే ఎనిమిది మంది మహిళలు హతమయ్యారు. అపర్ణ అనే మహిళను రెండో పెళ్లి చేసుకొని రహస్యంగా కాపురం చేస్తున్న మధు..ఆ వ్యవహారం బయటకుపొక్కి గొడవలకు దారితీయడంతో జనవరి నెల 30న అపర్ణను, ఆమె తల్లి విజయమ్మను, కూతురు కార్తికేయను హతమార్చి తలుపులు వేసి తాపీగా వెళ్లిపోయాడు. ఆర్థిక ఇబ్బందులు, ఒత్తిళ్ల నేపథ్యంలో హరీందర్ జిల్లెలగూడలో భార్యాపిల్లలను హతమార్చాడు. రెండు వారాల క్రితం హయత్‌నిగర్‌లో మోతీలాల్ అనే వ్యక్తి తనకు కాబోయే భార్యపై అనుమానంతో ఆమెను చంపేశాడు. ఈ సంఘటనలన్నింటిలోనూ విపరీతమైన అసహనం, తనకు అడుగా ఉన్నారని భావిస్తే భార్య, పిల్లలను సైతం తొలగించుకొనే మానసిక ఉన్మాద ప్రవృత్తే కారణం. ఈ ఉన్మాద ప్రవృత్తితో అనుబంధాలు, సామాజిక విలువలు హతమవుతున్నాయి. ఒకప్పటి ఉమ్మడి కుటుంబాలు ఇప్పుడు లేకపోవడం, వ్యక్తులపై ఎలాంటి సామాజిక నియంత్రణ కూడా లేకపోవడం.. ఈ రకమైన నేరాలకు ఆజ్యం పోస్తుంది.

భాగస్వామిని తరచుగా విసిగిస్తూ మాట్లాడుతుంటే ఆ స్థితిని మానసిక పరిభాషలో డెల్యూషన్' అంటారు. ఇలాంటి ప్రవర్తన కలవారే హత్యలకు పాల్పడుతుంటారు. భార్య ప్రవర్తన ఎంత బాగున్నా.. ఏదో ఒక విషయంలో వేధింపులకు గురిచేస్తుంటారు. ఇవే చివరకు హత్యలకు దారి తీస్తాయని మానసిక వైద్యనిపుణులు విశ్లేషిస్తున్నారు. సినిమాలు, సీరియళ్లలో చూపే వివాహేతర సంబంధాలు తమ ఇంట్లోనూ జరుగుతున్నాయని అపోహపడటం, మద్యానికి బానిసవడం..ఆ దృక్పథంలో నేరాలకు పాల్పడడం జరుగుతోందని పేర్కొంటున్నారు. నిందితులు విచారణలో కొంచమైనా పశ్చాత్తాపం లేకుండా తాము చేసిన నేరాలకు విపులంగా వివరించడం గమనార్హం.

ఈ రకమైన సమాజ విచ్ఛిన్న పరిణామాలకు ఐదు కారణాలును, పరిష్కారాలను కొంచెం నిశితంగా పరిశీలిస్తే మనం గమనించవచ్చు. ఈ అవమానవీయమైన సంక్షోభాన్ని తొలగించి, ఉన్నత విలువలను స్థాపించేందుకు ఒక సామాజిక నియంత్రణ వ్యవస్థ అవసరం. మెగా సిటీలు, మహానగరాలు

ఉనికిలోకి వచ్చిన తరువాత ఈ సామాజిక నియంత్రణ లేకుండా పోయింది. సోషల్ మీడియా అందుకు మరింత ఆజ్యం పోస్తోంది. మనిషి ప్రకృతితో మమేకమయ్యే జీవన విధానం, విలువల స్థాపనతో మాత్రమే ఒక స్థిరత్వం ఏర్పడుతుంది. ఇలాంటి దారుణాలు తగ్గుముఖం పడతాయి. నేటి సమాజంలో వస్తువులు, సుఖం, వ్యక్తిగత ఆనందాలే ముఖ్యమయ్యాయి. నూతన ఆర్థిక విధానాలు, వస్తు వినిమయవాద సంస్కృతి ఇందుకు కారణం. దీంతో సహజమైన మనిషి లక్షణాలు చనిపోయి, మృగాల్లా మారుతున్నారు. మరోవైపు డబ్బుకున్న గుర్తింపు మనుషులకు లేకపోవడంతో ఆత్మన్యూనతకు గురై హత్యలకో, ఆత్మహత్యలకో పాల్పడుతున్నారు. ఇలాంటి విపరీత ధోరణులు తొలగిపోవాలంటే సమాజంలో సమిష్టి జీవన విధానం అలవడాలి. ప్రత్యామ్నాయ ఆర్థిక, రాజకీయ విలువలతోనే అది సాధ్యం. అంతేకాకుండా శక్తికిమించిన భారీ అంచనాలు, ఆర్థికంగా బాగా సంపాదించాలనే కోరికల కారణంగా తీవ్రమైన ఒత్తిడి గురవ్వడం కూడా ఒక కారణమే. వాస్తవ పరిస్థితులను సరిగ్గా అంచనా వేయలేని అజ్ఞానం ఇది. ఈ ఒత్తిడి నుంచి బయటపడేందుకు సిగరెట్, ఆల్కహాల్, వివాహేతర సంబంధాలు లాంటి దురలవాట్లకు బానిసలవుతున్నారు. మనస్తత్వ పరిభాషలో దీనిని 'కోపింగ్ మోకానిజం' అంటారు. ఒక దుస్థితి నుంచి బయటపడేందుకు మరో దుస్థితిని ఎంపిక చేసుకోవడం. ఈ క్రమంలో జరిగే కలహాల కారణంగా అహం దెబ్బతిని దారుణాలకు పాల్పడుతున్నారు. ఇది సైకోబీవథాలజీ మనస్తత్వం. కుటుంబ సంబంధాలు బలోపేతం కావాలంటే పెళ్లికి ముందే కౌన్సెలింగ్ అవసరం. ఒత్తిడి, ఒంటరితనం కూడా హత్యలకు, ఆత్మహత్యలకు కారణమవుతాయి. వీటికి పాల్పడుతున్న వారిలో డిప్రెషన్ బాధితులే అధికంగా ఉన్నారు. కుటుంబాలు విచ్ఛిన్నమవ్వడం, సమస్యలను ఎదుర్కోనలేకపోవడం, పిల్లలను అతిగారాభం చేయడం, ఆర్థిక ఇబ్బందులు తదితర కారణాల వల్ల ఈ పరిస్థితులు ఏర్పడుతున్నాయి. డిప్రెషన్ బాధితులు, సున్నిత మనస్కులు, హార్మోన్ల అసమతుల్యతతో బాధపడుతున్న వారికి తప్పనిసరిగా కౌన్సెలింగ్ ఇప్పించాలి. ఇలాంటి దారుణాలను అరికట్టాలంటే ప్రతి ఒక్కరికీ జీవితం విలువ తెలియాలి. ఆ విలువలను నేర్పే విధంగా విద్యావిధానంలో, సామాజికంగా మార్పురావాలి. నైతిక విలువలతో చిన్నప్పటి నుండి అలవర్చాలి. తల్లిదండ్రుల పెంపకంలో,

మీడియాలోనూ మార్పులు అవసరం. నేరాలను నియంత్రించే విధంగా మీడియా బాధ్యతాయుతమైన పాత్రను నిర్వహించాలి. శుచినై జగములకు పరమ శచిత్వమునరించు నే వసుమతీ తనయా రచిత ప్రవేశమున కడు శుచినైతి కృతార్ధ భావ సుభగుడనైతిన్ భాస్కర రామాయణం.

సీతమ్మ అగ్నిలో ప్రవేశించటం వల్ల తానే పవిత్రమయ్యానని హవ్యవాహనుడు అన్న వర్ణన ఇది. అటువంటి సీతమ్మ సంస్కృతి బలవంతపు స్త్రీ చితిగా పరిణమించడం సమాజపు ఏ అభివృద్ధికి సంకేతం!

శుచినై జగములకు
పరమీ శచిత్వమునీరించు
నే వీసుమతీ తనలకూరచిత
ప్రవేశమున కడు శుచినైతి
కృతార్ధ భావ సుభీగడనైతిన్



# మానవత్వం మళ్ళీ చిగురిస్తుందా?

'సాక్ష్యం సరిగా లేదు అంటే సరైన సాక్ష్యానికి తావే లేదని అర్ధం కాదు. తప్పుగా భావిస్తున్నదానికి ఆధారం లేదు అని సారాంశం'. –జాన్ స్టువర్డ్ మిల్ (బ్రిటిష్ తత్వవేత్త, రాజనీతిజ్ఞుడు) నేరం జరగడం దాని తర్వాత దర్యాప్తులు జరగడం. ఎప్పుడో ఒకసారి నేరస్తులు వెలుగులోకి రావడం వారికి శిక్ష పడటం ఇది ఓ కోణం. ఇక్కడ ఏదో అసహజ సహజాతం వల్ల అరాచకానికి ఉసికొల్పబడిన ఆ తర్వాత ఎక్కడో మనసులో ఓ మూల పశ్చాత్తాపం కలగడం అనేది జరగడానికి చాలావరకు ఆస్కారం ఉంది. అంటే చేసింది తప్పు అనే అభిప్రాయం నేరస్తుడిలో కలుగుతుంది. ఏదో ఓ బలహీన క్షణంలో సమన్వయం కోల్పోయి చేసే చర్యల విషయంలో సాక్ష్యాలు అనేవి బలమైన పాత్ర పోషిస్తాయి. ఆ క్రమంలో తప్పొప్పుల మీద స్పష్టత కచ్చితంగా ఏదో ఒక దశలో ఉంటుంది. కానీ తప్పు, ఒప్పుల మానసిక సంఘర్షణను దాటేసి విపరీతమైన పైశాచికత్వ ధోరణితో కొన్ని నెలల పరిచయం తర్వాత ఎదుటి వ్యక్తి సాధక బాధకాల్ని చూసిన తర్వాత కూడా. ఆ స్నేహ పరిమళాన్ని దురంధం చేసి, దానికి ప్రేమ

అన్న పేరు పెట్టి ప్రాణాల్ని దారుణంగా తీయడానికి ప్రయత్నించి.. కాలిపోతున్న శరీరంలో తనే కాల్చేసాను అనే వికృత విజయహేళిని ఆస్వాదించి తర్వాత న్యాయస్థానం ఎదుట లొంగిపోతే ఏది తప్పు, ఏది సాక్ష్యం.. దేన్ని విచారించాలి? సమాజం, సాక్ష్యం, న్యాయస్థానాలు ఇవేవీ కాదు. మానవత్వం మనిషిలో ప్రజ్వరిల్లేందుకు ఏదైనా కొత్త సమాజాన్ని కొత్త ప్రపంచాన్ని సృష్టిస్తే బావుంటుందేమో! చిన్నతనంలోనే చనిపోయిన తండ్రి వివాహమైనా ఇంట్లోనే ఉంటున్న అక్కలు తల్లీతోపాటు తనపైన పడిన కుటుంబ పోషణభారం ఈ పరిస్థితుల మధ్య చిరుద్యోగంతో నెట్టుకొస్తున్న ఆ యువతి మనసు ప్రేమ వైపు మళ్లలేదు. దీంతో ప్రేమ పేరుతో ఆమె వెంట పడుతున్న ఉన్మాది కక్షకట్టాడు. పథకం ప్రకారం ఆమెపై పెట్రోలు పోసి నిప్పుపెట్టాడు. ఈ ఘాతుకానికి ఒడిగట్టిన ఉన్మాది స్వయంగా వచ్చి పోలీసుల ఎదుట లొంగిపోయాడు. హైదరాబాద్లోని ఉత్తర మండల పరిధిలో ఉన్న లాలాపేట్లో డిసెంబరు 21, గురువారం సాయంత్రం ఈ ఘోరం చోటు చేసుకుంది. 80శాతం కాలిన గాయాలతో గాంధీ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న బాధితురాలు మరుసటిరోజు మరణించింది. ఆ బాధితురాలు సంధ్యారాణి. నాటి అనురాధ నుండి నేటి సంధ్య వరకు ఎందరో బాధితులు! ఇది ఒక్కటే ఉదంతం కాదు. రాజేంద్రనగర్ పరిధిలో వ్యవసాయ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య చదివే అనురాధపై యాసిడ్ దాడికి పాల్పడింది ఆమెకు సీనియరే. ఈ ఉదంతం అప్పట్లో తీవ్ర సంచలనం సృష్టించింది. దిల్ సుఖ్నగర్ ప్రాంతంలో భార్గవి యాదవ్ అనే యువతిని వేధింపులకు గురిచేస్తున్న సంతోష్ ఒకరోజు రెచ్చిపోయాడు. కళాశాల నుండి తిరిగి వస్తున్న భార్గవిని సరూర్నగర్లోని ఆమె ఇంటి సమీపంలోనే అత్యంత దారుణంగా హతమార్చాడు. కార్వాన్ ప్రాంతంలో వివాహిత రాణి వెంటాడిన కామాంధుడు కన్నయ్యసింగ్ ప్రేమ పేరుతో తీవ్రంగా వేధించాడు. అప్పటికే ఆమె మాట వినట్లేదని కక్ష కట్టి కత్తితో దాడి చేశాడు. స్వాతీ అనే యువతిపై బంజారాహిల్స్ పరిధిలో ఓ ప్రేమోన్మాది విరుచుకుపడ్డాడు. ఆమె బంధువుతో సహా సజీవ దహనం చేయాలని ప్రయత్నించాడు. వర్ధమాన నటి భార్గవిని ప్రేమోన్మాదిగా మారిన ప్రవీణ్ కుమార్ హత్య చేసి ఆత్మహత్య చేసుకున్నాడు. బాలానగర్ ప్రాంతంలో అరుణ అనే

బాలికపై ఆమె సమీప బంధువు శశిశంకరరెడ్డి దాడి చేసి హత్య చేశాడు. అమీర్ పేట టిఆర్ఆర్ కాలేజీలో లావణ్య అనే విద్యార్థినిపై ఓ మృగాడు దాడి చేశాడు. వనస్థలిపురం లాణా పరిధిలో విద్యార్థిని దివ్యను ఆమె సహవిద్యార్థే దారుణంగా హత్య చేశాడు. పరిపక్వత లేని ప్రేమలే ఈ దారుణాలకు కారణం అనే అభిప్రాయం వ్యక్తం అవుతుంది. జీవితం విలువలపై అవగాహన లేని వయసులో పుట్టే ఆకర్షణే దారుణాలకు దారితీస్తోంది. తెలిసీ తెలియని వయసులో ఆకర్షణ వ్యామోహంలో పడి దానినే ప్రేమగా భావిస్తున్నారు. ఆ తర్వాత ఇద్దరిలో ఎవరో ఒకరు అసలు విషయాన్ని గుర్తించి జాగ్రత్తపడితే రెండోవాళ్లు రెచ్చిపోతున్నారు. దీంతో ఆత్మహత్య చేసుకోవడమో, లేదా హత్యకు తెగబడటమో చేస్తున్నారు. ఒక్కొక్క సందర్భాలలో బెదిరింపులు, బ్లాకమెయిల్, దాడులకు పాల్పడి కటకటాల్లోకి చేరి జీవితాన్ని నాశనం చేసుకుంటున్నారు. ఆడపిల్లలపై ప్రమోన్మాదులు కత్తులతోనో, యాసిడ్తోనో దాడులకు తెగబడినప్పుడల్లా 'నేరగాళ్లను కఠినంగా శిక్షిస్తా, ఇటువంటివి పునరావృతం కాకుండా చూస్తాం' అంటూ ప్రకటించే అధికార యంత్రాంగం, పాలకుల హామీలు నిత్యకృత్యంగా మారిపోయాయి. నగరంలోనే కాదు రాష్ట్ర వ్యాప్తంగా ఎక్కడైనా ఈ తరహా ఉదంతం ఒక్కటి జరిగినా పోలీసులే 'అత్యంత అప్రమత్తం' అవుతారు. పోకిరీలు, ప్రమోన్మాదులను కట్టడి చేయడానికి అనేక చర్యలు తీసుకుంటున్నామంటూ ఉదరగొడతారు.

ఓ నాలుగు రోజుల పాటు కళాశాలలు, హాస్టల్స్ ఉన్న ప్రాంతాల్లో పెట్రోలింగ్స్ ఉధృతం చేస్తారు. అంతకుమించి తీసుకుంటున్న కఠిన చర్యలు ఏమీ కనిపించవు. ఏదైనా ఉదంతం జరిగినపుడు కేసు నమోదు చేసినా ఇది దర్యాప్తు పూర్తి చేసుకుని, న్యాయస్థానంలో విచారణ పూర్తయి, దోషులకు శిక్షపడటానికి సమయం పడుతోంది. ఇవన్నీ ఇలాంటి ఉన్మాదులు రెచ్చిపోవడానికి కారణాలుగా మారుతున్నాయి. పెద్దల పర్యవేక్షణ లోపించడం కూడా ఇటువంటి ఉదంతాలకు కారణంగానే పరిగణించవచ్చు. యుక్తవయసు వచ్చిన పిల్లల్లో అనేక మార్పులు చోటు చేసుకుంటాయి. ఒక్కసారిగా స్వేచ్ఛ వస్తుంది. ఆ సమయంలో వారిపై తల్లిదండ్రులు ప్రత్యేక శ్రద్ధ చూపాల్సి ఉంటుంది. అయితే ప్రస్తుత యాంత్రిక జీవితంలో ఉన్నత కుటుంబాలకే కాదు.

మధ్యతరగతి వారిలోనూ పిల్లలపై శ్రద్ధ తగ్గింది. ఫలితంగా యుక్తవయస్సు రాగానే పెడదారులు పడుతున్నారు. ప్రేమ వ్యామోహంలో పడుతున్నారు. ఇదే సినిమా టివీల ప్రభావంతో ఒక్కోసారి దారుణాలకు దారి తీస్తున్నాయి. మరోపక్క విద్యాసంస్థలు, కాలేజీల యాజమాన్యాలకు విద్యార్థుల బాగోగులు పట్టించుకుని, వారి జీవితం విలువ తెలియజెప్పే తీరిక లేకుండా పోయింది. అనునిత్యం వీరి ద ృష్టి అంతా పరీక్షలు, ర్యాంకులపైనే. జీవిత ప్రస్థానంలో కీలకమైన యుక్తవయసులో యువతీయువకులపై పర్యవేక్షణ కొరవడి దారితప్పుతున్నారు. సమాజంలో మహిళలకు గల సమున్నత స్థానం, వారి హక్కులను యువతకు బోధించాలన్న ఉద్దేశంతో రూపొందినదే జాతీయ యువజన విధానంలో రూపొందించిన విధంగా ఇక్కడి సమాజంలో స్త్రీల ఎ స్తానం, వారికి గల హక్కులపై మగపిల్లలకు చక్కని అవగాహన కల్పించడంలో కానీ, మహిళల పట్ల గౌరవంగా మసలుకొనేలా కౌన్సిలింగ్ చేయడంలో కానీ ప్రభుత్వాలు ఎంతటి 'చిత్తశుద్ధిని' చూపిస్తున్నాయో జరుగుతున్న, పెరుగుతున్న ఉదంతాల సాక్షిగా తెలుస్తూనే ఉంది. యాంత్రిక జీవనంలో ఆత్మీయత, ఆపేక్ష కొరవడి మ ృగాళ్లుగా మారుతున్న తరుణంలో సమస్యకు మూలాలు మళ్లీ మన వ్యవస్థలోని లోటు పాట్లనే వేలెత్తి చూపుతాయి కనుక 'మానవత్వం అనే కొత్త ప్రపంచం' స ృష్టితోనే సమస్యకు పరిష్కారం సాధ్యం.



నా గురించి నా మాటల్లో :

పుట్టింది, పెరిగింది ,చదువుకుంది ఆంధ్రాలో. చదివింది ఇంజనీరింగ్ అయినా ప్రవృత్తి రీత్యా సరస్వతి స్పర్శ పై ఉన్న ఆరాధనతో జర్నలిస్టు ,రచయిత్రి ,అనువాదకురాలు ,ఆంగ్ల శిక్షకురాలు ,వ్యక్తిత్వ వికాస నిపుణురాలుగా మారాల్సి వచ్చింది. కాని ఇవన్నీ పైకి కనిపించే అబద్దపు ముసుగులు అని , భారతీయురాలిని అన్న స్పృహ వీటి వల్ల దూరం అయ్యిందే తప్ప నా వల్ల నాకు గాని, సమాజానికి గాని వొరిగింది యేమియు లేదనే సత్యం గోచరించాక నన్ను నేను అన్వేషించుకోవడం మొదలు పెట్టాను. ఆ క్రమంలో 'శృంగవరపు రచన' గా మరణించి రచన శ్రీ దత్త గా మరల నిజమైన నిజానికి నిజాయితీగా దర్పణం పట్టే శక్తిగా ఆవిర్భవించాను. ఇది అతిశయోక్తి కాదు. నాకు ఆ మాటకు నిలబడే శక్తి ఉంది , భారతీయతను వక్రీకరించి వ్యవస్థను భ్రష్టు పట్టిస్తున్న నేటి మీడియా ను చూసి నాకు కలిగిన ఆక్రోశం , సరస్వతి బిడ్డలతో పచ్చ నోట్లతో ఆడుకుంటున్న తీరు చూసి రగిలిన నా గుండె నా కొత్త ఆవిర్భావం. అన్న మాట కోసం , నిజం కోసం దేనికైనా నిలబడి, మనిషిని డబ్బు తో కాక నిజమైన మనిషిగా చూడగలిగే సత్తానే నా ఆస్తి. ఆ ఆస్తిని కాపాడటానికి భారతీయతను నిజంతో నిలబెట్టడం ఒక్కటే మార్గం. అందుకే రచన శ్రీ దత్త అనే భారతీయురాలిగా మారాను. నాకు ఉన్న ముద్దు పేర్లు మండోదరి, రాక్షసి, మొండి దెయ్యం పెట్టుకునే వారికి పెట్టుకునే అన్ని పేర్లు స్తోత్రాలుగా నాకు ఉన్నాయి. ఈ పదవికి నాకు ఉన్న ఒకే ఒక్క అర్హత 'నిజం,భారతీయత ,నిజాయితీ' కోసం ఎంత దూరం అయినా వెళ్ళగలడం. వీటితో పాటు నాకు ఉన్న మరో అర్హత 'నేను సర్వ సామాన్యురాలిని.' మీడియా ఎల్లప్పుడు సర్వ సామాన్యులకు అండగా నిలబడాలి అన్నదే నా సిద్ధాంతం. నా నీతి రావణ నీతి. అంటే సమాజంలో సర్వ సామాన్యులకి న్యాయం జరగాలి అన్నదే రావణ నీతి.

ఇదండీ నా గురించి క్లుప్తంగా. ఇంకా తెలుసుకోవాలంటే యూట్యూబ్, బ్లాగ్ , ఫేస్ బుక్ , వెబ్ సైట్, రేడియో ఆవిర్భవ వీటిల్లో కనిపిస్తూ , వినిపిస్తూ ఉంటా.

ఇట్లు

రచన శ్రీ దత్త




**ఆవిర్భవ పబ్లిషర్స్**

ఫ్లాట్ నెంబర్ 403,నివేదిత ఎన్ క్లేవ్,

ప్లాట్ నెంబర్ 147,సిద్ధార్థ నగర్ కాలని ,

యూసఫ్ గూడ,

హైదరాబాద్ 500038

